## వైజాగ్ ఫెస్ట్ 2017లో డిసెంబర్ 1 నుండి 10 వరకు గురజాడ సాహిత్య వేదికపై జరిగిన కార్యక్రమాల దృశ్యాలు














PR3VMORA188

సాహిత్య
ప్రస్థానం
జనవరి 2018

సంపుటి : 17
సంపాదకీయం
సంచిక : 1

# నిత్యనూతనం • సత్య కేతనం...

**2018** నూతన సంవత్సర శుభాకాంక్షలతో పాటు వినూత్న విస్తార రూపంలో సాహిత్య ప్రస్థానం మీ చేతుల్లోకి తెస్తున్నందుకు సంతోషిస్తున్నాం. ఇదే మనందరికీ నూతన సంవత్సర కానుక. మీ సూచనలూ సలహాలు పంపితే అనుకున్న మేరకు మరికొన్ని శీర్షికలూ అంశాలూ కూడా త్వరలో తోడవుతాయి. పత్రిక పరిణామంతో పాటు ప్రమాణాలు కూడా పెరగాలన్నదే మా ఆకాంక్ష. *2017* పొడుగునా సాహితీ మిత్రుల సహకారంతో విస్తృత వేదికలు నడిచాయి. సృజన కారుల స్వేచ్ఛపై దాడులూ దౌర్జన్యాలే గాక హత్యలూ అఘాయిత్యాలూ కూడా జరిగినా సామాజిక చైతన్యం కొత్త వూపిరిపోసుకుంది. స్వేచ్ఛాస్వరంతో మొదలైన ప్రస్థానం వీటన్నిటినీ నిరసించడమే గాక చారిత్రిక ఉదాహరణలతో ఇలాటి శక్తుల ఆటలు సాగవని హెచ్చరించింది. ఇదే సమయంలో పాలక వర్గాల ప్రలోభాల పర్వం కూడా జోరుగానే నడిచి పదును తగ్గించే పన్నాగాలకు పాల్పడింది. కొందరు ఆ వలలో పడిపోయినా ప్రజాపక్ష సాహిత్యకారులు తమ స్వతంత్రతను కాపాడుకోవడం మనకు గర్వకారణం. తాయిలాలకు లోబడి తలలు తాకట్టుపెట్టడానికి ఇష్టపడని వారు తలెత్తుకునే వుంటారని ఈ అనుభవం రుజువు చేసింది.

హైదరాబాదులో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు కూడా. తెలుగు వారి ఏకత్వాన్ని చాటి విలువైన పాఠాలే అందించాయి. విశాఖలో జరిగిన సాహిత్యోత్సవం పోటీలు మరిన్ని మంచి రచనలు రావడానికి ప్రోత్సాహమిచ్చాయి. అనంతపురంలో వేమన ఉత్సవాలు గొప్ప స్ఫూర్తి నింపాయి. కొత్త జిల్లాలకు విస్తరించిన సాహితీ స్రవంతి ప్రగతిశీల విశాల వేదికగా మరింత బలోపేతమైంది.

మరోవైపున సమకాలీన ప్రపంచం చాలా సవాళ్లు విసురుతున్నది. ఇటీవలి శాసనసభ ఎన్నికల తర్వాత దేశంలోనూ తెలుగు రాష్ట్రాలలోనూ కదలికలు పెరుగుతున్నాయి. ఇప్పటికే ఎన్నికల జ్వరం ప్రవేశించింది గనక సామాజిక రాజకీయ రంగాలలో వేడి పెరగడం తథ్యం.

ఇలాటి జటిల సందర్భాలలో సాహిత్యం ద్వారా జనానికి సత్యం చెప్పడానికి సంఘటిత శక్తి నిలబెట్టడానికి ప్రస్థానం పునరంకితమవుతున్నది.



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com

## కథలు


గత వర్తమానం - మల్లిపురం జగదీశ్.................... 8
ఉసురు - ఇందూరమణ................................ 12
లిప్‌స్టిక్ - ఎల్. శాంతి................................ 19
ఉత్తమ కథ - కనుపర్తి వరలక్ష్మి ....................... 24


## కవితలు


వేదన - మార్ని జానకిరామ్ చౌదరి .................. 4
జనంలోంచి... - సిరికి స్వామినాయుడు............. 5
వనమాలి - డా॥ కె. సుదేరా............................ 6
నేను గౌరీలంకేష్‌ని.. - రాపాక సన్ని విజయ్ క్రిష్ణ... 7
తెలుగు వెలుగు - బి. గోవర్ధనరావు................ 18
ఇక మీరు మావైపు చూడండి - కత్తి పద్మారావు...... 29
ఆ కళ్ళు - ఉదయమిత్ర .................. 34
మనాది - అనిల్ డ్యాని ................... 35
కొత్త ఉదయం - బ్రౌన్............................ 44
మనసు మరణించిన దేహం - యామినీదేవి కోడే..... 53
నిష్క్రమించిన సూర్యుడు? - ఎస్. రామకృష్ణ......... 53
కింకర్తవ్యం - గరికపాటి మాస్టారు............ 57
నా పేరు నాయనమ్మ- బి. కళాగోపాల్..................60
చరాస్తులు - డా॥ విజయలక్ష్మి పండిట్...... 63
మనసు ప్రతిబింబం - రాణి............................. 63


## వ్యాసాలు


ఘనంగా తెలుగు మహాసభలు- వెలిగేనా భాషాప్రభలు?
- సత్యాజీ.............................................. 38
ఐతిహాసిక రంగస్థలం - బ్రెష్ట్ ప్రయోగాలు
- వాల్టర్ బెంజిమెన్ తెలుగు: పోపూరి అనంతలక్ష్మి..... 40
దేవిప్రియకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు......... 45
సామాజిక న్యాయపోరాట కవిత్వం
- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి...................... 49
వేమన ఇతర భారతీయ కవులు
- డా॥ ఎ.ఎ. నాగేంద్ర............................. 54
అద్దేపల్లితో అనుభవాలు, జ్ఞాపకాలు - గనారా.......... 58
వైజాగ్ ఫెస్ట్‌లో సాహితీ సంరంభం - వొరప్రసాద్...... 61


## ఇంటర్వ్యూలు


పి. సత్యవతి ........................................ 30
తెలకపల్లి రవి ........................................ 36
దేవిప్రియ ........................................ 46
డిసెంబర్ నెల ప్రస్థానం పురస్కారాలు................ 63
స్వీకారం................................................ 64
డైరీ.................................................... 66


## కవిత

## వేదన



- మార్ని జానకిరామ్ చౌదరి
9440338303

రెప్పచాటు కంటికేం తెలుసు
నేలజారిన నీటి విలువ
గాయపడ్డ గుండెనడుగు
కన్నీటి విలువ

ఉసురు తీసిన కత్తికేం తెలుసు
ఊపిరి విలువ
జన్మనిచ్చిన అమ్మనడుగు
పాశం విలువ

వడ్డించిన విస్తరికేం తెలుసు
ఆకలి విలువ
కాలుతున్న పేగునడుగు
మెతుకు విలువ

లిప్తపాటు మెరుపుకేం తెలుసు
వెలుగు విలువ
నిశిరాతిరి కొడిగడుతున్న
దీపపు ఒత్తినడుగు బ్రతుకు విలువ

పొంగుతున్న కడలికేం తెలుసు
చినుకు విలువ
నెర్రలిచ్చిన మన్నునడుగు
రైతు నాటిన విత్తు విలువ

బండబారిన రాతి గుండెకేం తెలుసు
కవితా నివేదన
గుండె చీల్చుకొచ్చిన అక్షరాన్నడుగు
అర్ధరాత్రి కవి పురుటి వేదన! ◆

# జనం లోంచి....!

- సిరికి స్వామినాయుడు
9494010330



పడమటకొండ మీద
వెలుగుమేకను మింగేస్తున్న చీకటిచిలువలా - దళారీ
శ్రమశక్తినీ సహజసంపదనీ మింగేస్తూ -
సర్వవ్యాప్తమైనపుడు ఎవరితో యుద్ధం చేస్తావు ?
వ్యవస్థీకృతమై.... శత్రువు
ఊసరవెల్లిలా రంగులు మార్చుకుంటూ....
మబ్బుల మాటునుంచి శరసంధానం చేస్తున్నపుడు
ఎలా యుద్ధం చేస్తావు ?

వైజాగ్ ఫెస్ట్ - 2017లో
ప్రథమ బహుమతి పొందిన కవిత

♦

నెత్తురు చిందదు !
లోన జీవనాడులు తెగిపోయి
జల్లెళ్లైపోతాయి దేహాలు !
సైన్యాల మోహరింపులుండవు
ఛిద్రమైన బతుకులు తప్ప !
కళేభరాలుండవు, కదిలే శవాలు తప్ప !
మారిపోయింది యుద్ధరీతి !
ప్రతి యిల్లూ ఒక యుద్ధరంగమే !
సామాన్యులే క్షతగాత్రులు !
కనిపించని చెరశాలలో యుద్ధఖైదీలు !

♦

బహుళ పడగల సర్పమై - వాడు
చుట్టేస్తున్నాడు భూగోళాన్ని !
దేశాల మధ్య హద్దులు చెరిగిపోయీ....
పెనుతుఫానుకు
పచ్చని అరటితోట కకావికలమైనట్టు -
అడవులూ నదులూ మైదానాలూ
అన్నీ అతలాకుతలమై....
ఉనికిని కోల్పోయి
ఊళ్లకు ఊళ్లు వల్లకాళ్లైపోయీ....
యుద్ధమైతే లేదుగానీ....
యుద్ధానంతర భీభత్సమైతే....భయానకమై !

♦

నగ్నత్వమే....నేటి నాగరికతైన వేళ -
పబ్లూ కేఫ్లూ బార్లూ ప్రపంచమైపోతున్న వేళ -
పోరాటాన్ని మరచిపోతోందీ నేల !
ఫేస్బుక్లూ వాట్సప్లూ యూట్యూబ్లూ
ఇంటర్నెట్లో చిక్కిన పావురాలై జనం !
ఉద్యమాలూ విప్లవాలూ పోరాటాలూ -
గూగుల్ గూట్లో కొత్తమాటలైపోతున్న వేళ -
మనుషుల మధ్య సిగ్నల్స్ లేవు !
ఆలోచనాధారాలు తెగిపోయీ....
దుమ్ముపట్టిపోతున్నాయి ధిక్కారగీతాలు !

♦

యికనైనా - యుద్ధవ్యూహాలు మారాల !
శక్తులన్నీ కూడగట్టుకొని శకలాలన్నీ ఏకమవ్వాల !
నేలసారాన్ని బట్టి విత్తు జల్లాల !
భావజాల జలపాతాలు పోటెత్తాల !
మాట - మేఘగర్జనవ్వాల !
పాట - పదునుదేరిన కరవాలమవ్వాల !
నినాదం - నిప్పులసర్పమై బుసలుగొట్టాల !
మొద్దువారిన మెదళ్లకుదుళ్లలోంచి
మెలకువ పుట్టాల !
చచ్చుపడ్డ శరీరాల్లో చలనం రావాల !
సమస్య పుట్టినచోటే చైతన్యం ఎగిసిపడాల !
జనంలోంచి ఓ కిరణం
చరిత్ర నుదుట సింధూరం దిద్దిపోవాల !!

♦

# వనమాలి

- డా॥ కె. సుధేరా
9701347080

తివ్వ దుంపల కోసమై కొయ్యబొరుగులై చరియల్ని చెలుకుతుంటే
తీవ్రవాదుల ముద్ర వేసేస్తోంది
గంజికాసుకొనేందుకు కసిన్నిగింజలకై కల్లం అడుగు గంటి కంకులు నూర్చుకొంటుంటే
గంజాయి రవాణాదారులని నేరం మోపేస్తోంది
కడుపుకాలి కందమూలాలకై వేళ్ళ మొదళ్ళని కుళ్ళగించుకుంటుంటే
గంధపుచెట్టుపై గొడ్డలి గురిపెట్టారంటోంది
కొండ దిగి వస్తే చాలు వాడిని బంగారుకొండని చేస్తానన్న పాలకుల వాగ్దానం
ఏలినవారి ఏలకుల తోటలో వెర్రిదిష్టిబొమ్మని చేసేసింది
పెంపుడు జంతువులా వాడి చుట్టూ తిరుగుతూ – ఇంకా నమ్మించాలనే చూస్తోంది చట్టం;
కౌపీనమై పిరుదులకి చుట్టుకొన్న పేదరికాన్ని కాఫీవనంగా మార్చేస్తానని,
ఆకులో – అలములో తినితేర్చే పూటగడవని ఆకలిపేగుల్ని ఆపిలుతోటలు చేసేస్తానని!
ఎంత చెమటని ఉప్పుగా గడ్డకట్టించితే మాత్రం....
చెట్టుని, గుట్టని తిరునామాలే ధరించి తిరుగుతోన్న సంచారజాతిని
తీరైన చిరునామాలేదని తిరస్కరిస్తూనే వుంది సర్కారోడి సంక్షేమం !
అరకుని చూస్తే చాలు – గుండెలనిండా అల్లుకొన్న బెరుకు...
ఆకు తొడిగిన చెరకు తోటలే నవనవలాడేది – రసం పిండేసిన పిప్పిగుట్టై రోగాల్ని ఈగలై మూగిస్తున్నందుకు !
వంపులు తిరిగిన కోనడొంకకి పసిడి వడ్డాణమైన వలిసెపూల సోయగం
వలస రైలు పట్టుకొంటోంది ... చన్నుకి వేలాడే శిశువుల్తో, వెన్నుకి వేలాడే మూటల్తో !
వేలాది తండాలు మొండాల లోతు మునుగుతూ వుంటే... మునులై తపస్సు చేసుకొంటూ ఎలా ఉండిపోగలదు
పోలవరం గర్భంలో గనులై నిక్షిప్తమైపోడానికి నిరీక్షిస్తున్న భద్రాద్రి రాముడి బిడ్డల ఘన చరిత్ర !?
గుత్తికోయలగూడాలను గుడాకులా నమిలిపడేసిన గుత్తేదార్లు పరిచే పూతరేకు రాదార్ల పక్కన
రాత్రిపూట వెలిగే కొవ్వొత్తి బేరాల్లో ... నెత్తురింకిపోయిన గాయాలకు చోటుండదు...
గాలికి ఎగిరిపోయే గుడారాలై రక్తమాంసాలను రాళ్ళగుట్టలుగా పేర్చుకోడానికి తప్ప !
ఎన్ని కొమ్మ ఆకుల కొన ఊపిర్లు తాగితే – ఒక బ్యాక్సైటు బట్టీ వెలుగుతుందో,
ఎన్ని మూలికావృక్షాల్ని కలలో కసాబిసా నూరితే – ఒక సీసాడు సంజీవన తైలం తయారవుతుందో,
ఎన్ని రేలపాటలకి రెక్కలు విరిచిపడేస్తే – ఒక రైలు బండెడు ఇనుపరాళ్ళవుతాయో....
వాళ్ళకి లెక్కలు కట్టుకోవడం తెలియదని గుటకలు మింగుతోంది గుంటనక్క శాసనం !
ష్... జాగ్రత్త !
వెదురు విల్లు వెనుక బెదురుతున్న కుందేలుకన్ను
రెల్లుగుబుర్లతో కబుర్లాడుతోంది...... రహస్యంగా !
వొలికిన లేడి నెత్తురుతో అలికిన మునివాకిల్లోంచీ
వేకువ తొణికిసలాడుతోంది.... వేటసింహంలా !
రాజ్యం పొరపడుతున్నట్టు ఆదివాసి అంటే...
అన్యాక్రాంతమవుతోన్న వనమూలికే కాదు – అన్నెం పున్నెమెరుగని మన్యాన్ని కాపుకాచే వనమాలి కూడా !
భక్తి పీఠాలకోసం తిత్తితీసిన పులిచర్మమే కాదు – శక్తినంతా కూడదీసుకొని తిరగబడే పులిపంజా కూడా !



వైజాగ్ ఫెస్ట్ - 2017లో
ద్వితీయ బహుమతి పొందిన కవిత

**(తెలుగు రాష్ట్రాల్లో సమీకృతమవుతోన్న గిరిజనోద్యమాలకి మద్దతుగా)**



# నేనూ.. గౌరీ లంకేష్ ని..

- రాపాక సన్ని విజయ్ క్రిష్ణ
8332975458

నువ్వు చంపేసి పారిపోతావంతే
మాట్లాడుతున్నానని..
నీ గురించి
మనిషివి కాని నీ గురించి
నీ ఉన్మాదం గురించి
వాస్తవం మాట్లాడుతున్నానని
చంపేసి పారిపోతావంతే
అయినా..
నేను మాట్లాడుతూనే ఉండటాన్ని చూడకుండానే
వాస్తవం నుంచి పారిపోయే నీ అలవాటు చొప్పున..
నువ్వు పారిపోతావంతే
నేను మాట్లాడుతూనే వున్నాను

నేను,
మరణాన్ని,
నువు చేసిన హత్యలో చూడలేదు
పిరికిపందవై
నువ్వు పారిపోతున్నప్పటి
నీ భయంలో చూసాను
నీ చావుని చూసాను
నువ్వలా శవంలా
పరిగెత్తటం చూసాను

పారిపోతూ పారిపోతూ
నువ్వో హత్యను చేసాననుకుంటావు-
మాట్లాడుతూనే ఉండటాన్ని
హత్య చేయడం
నీకెప్పటికీ సాధ్యం కాదు

నువ్
నిలబడి వుంటే
అక్కడ
నడి రోడ్డు మీద
నా నిశ్చలత్వంలోని
వేల చలనాలు
మాట్లాడటం
పోగైన జనం గొంతులోంచి
వినగలిగి వుంటావు

బహుశా ..
ఈ హత్యని,
నేను అవమానపడి వుండేదాననే
నన్ను చంపిన చోట
నువ్వు ధైర్యంగా నిలబడి వుంటే
హత్య ఎందుకు చేసావో
అది సవాలు విసిరి వుంటే
కనీసం నిన్ను మనిషిగా కాకపోయినా
నెత్తరు తాగే మృగంగానో
శవాలు తినే పెంట పురుగు గానో
గుర్తించి వుండే దానిని

వైజాగ్ ఫెస్ట్ - 2017లో
తృతీయ బహుమతి పొందిన కవిత

నేను ,
కలంతోనో
గళంతోనో
నిన్ను తరుముతూ వుంటే,
నువ్వు ,గన్నులు భుజానేసుకుని
పరిగెత్తి పారిపోవటం
నేను గెలవటం..

నువ్వు,
మహా ఐతే,
చంపేసి పారిపోతావంతే
పిరికిపందవై

ఛీ..
పారిపోతావేం
నేను
మాట్లాడుతూనే వున్నాను ◆



# గత వర్తమానం

మల్లిపురం జగదీశ్
9440104734

"అన్నా! కరపత్రం రెడీ అయిందా?" అడుగుతున్నాడు మిత్రుడు ఫోన్లో.

"సాయంత్రానికిచ్చేస్తా"నన్నాను.

ఆకు పచ్చని కొండలు. దొంతరలు దొంతరలుగా. కొండలకానుకొని పంట పొలాలు. కొండల మీంచి జారుతున్న జలపాతంలా ఆకుపచ్చదనం. కోతిపిల్ల కర్రాట, బొండాట, సిర్తాబిల్లాట...సింతపిక్కలాట... ఒకటేమిటి నా బాల్యమంతా ఆటలు దిద్దుకున్న ఆకుపచ్చదనం. నన్నెత్తుకున్న ప్రతి చెట్టూ ... నన్ను హత్తుకున్న ప్రతి పుట్టా ఈ రోజు కనిపిస్తూ వుండొచ్చు కానీ రేపు? కన్నెదార కొండా... బోడికొండా... ఎర్రమంటి కొండా... ఒక్కొక్కటీ మాయమైపోతూ. సాలూరు కొండలూ, బాక్సైటు గనులూ... అన్నీ ఆదివాసీ నివాసాలే. తవ్వకాలూ, సంపదా, అభివృద్ధి పేరుతో ఆదివాసీల్ని తరిమేయడం...

వైజాగ్ ఫెస్ట్ 2017 పోటీలలో ప్రథమ బహుమతి గెలుపొందిన కథ

దీన్ని వ్యతిరేకిస్తూ ఆదివాసీ సంఘాల ఐక్యవేదిక ఐ.టీ.డీ.యే ని ముట్టడించే కార్యక్రమం చేపట్టింది. దాని గురించే రాయాల్సివుంది కరపత్రంలో.

టైమ్ చూసేను. స్కూలుకి వెళ్ళాల్సివుంది.

తరగతి గదిలో చెప్పాల్సిన పాఠం... రాయాల్సిన కరపత్రం మదిలో మెదులుతున్నాయి.

చుట్టూ చూసేను. బస్ ఇంకా రాలేదని నిర్ధారించుకున్నాను. నాతో పాటు బస్సు ఎక్కాల్సిన వాళ్ళు అక్కడే వున్నారు. ఆ సెంటర్ ఒకప్పుడు నిర్మానుష్యంగా వుండేది. ఇప్పుడది మండల ముఖ్య వ్యాపార కేంద్రం. రోడ్డు ప్రక్కనే ఎత్తైన భవనాలు. వ్యాపార సముదాయాలు. జీడి పిక్కల వ్యాపారులు, కిరాణా, బట్టలు, డిపార్ట్‌మెంటల్ స్టోర్లూ, బజాజ్ బైక్ షోరూములు, మారుతీ కారు షోరూములూ... అన్నీ ఒకటేమిటి అన్నీ వ్యాపారంగా మార్చే అత్యాధునిక స్థలాలు. అన్నీ గిరిజనేతరులవే. ఈ భూములన్నీ స్థానిక గిరిజనులకే దక్కాల్సి వుండగా ఇవన్నీ ఎలా సాధ్యం? ఇక్కడ ఒన్నాఫ్ సెవెంటీ చట్టం వుందా? ఈ భూముల్ని కాపాడడానికి ఒక స్పెషల్‌డెప్యూటీ కలెక్టరు కార్యాలయం కూడా వుంది. కానీ అది కూలడానికి సిద్ధంగా. యేళ్ళ తరబడి ఆ పోష్టు ఖాళీగా. ఆ రోజు ఒకటి రెండు కుటుంబాలు మాత్రమే ఇక్కడ వుండి గిరిజన సంపదపై కన్నేసేవి. మరిప్పుడు? ఇవన్నీ ఎలా వచ్చాయి..? ఈ భవంతులన్నీ ఎలా లేచేయి? ఈ కార్లన్నీ ఎక్కడినుండొచ్చాయి?

బస్ రావడంతో బడిగుర్తొచ్చింది. నేనటు నడిచాను.

గదిలోకి అడుగుపెట్టగానే పిల్లలు ముఖాల్లో వెలుగు. అందరూ గిరిజన పిల్లలే. అసలు పాఠశాలే గిరిజన సంక్షేమానికి చెందినది. నాతో సహా అందరూ కొండా కోనల్లోంచి వచ్చిన వారే.

ఎన్విరాన్‌మెంట్ లో "వాటీజ్ మేన్ విదవుట్ బీస్ట్"పాఠం. రెడ్ఇండియన్ల చీఫ్ సీటెల్ అమెరికా వాసులనుద్దేశించి చేసిన ప్రసంగం అది. వాషింగ్టన్ నిర్మించడానికి ఆ భూముల్ని తమ నుండి బలవంతంగా లాక్కున్నపుడు అయిష్టంగానే అంగీకరిస్తూ చేసిన ప్రసంగమది. మూవింగ్ స్పీచ్...! అందరి గుండెల్లో ఎప్పటికీ మారుమ్రోగుతున్న ఆకుపచ్చ సందేశం.

అసలు సీటెల్ అయిష్టంగానైనా తమ భూముల్ని ఇవ్వడానికి ఎలా అంగీకరించి వుంటాడు? ఐరోపా నుండి వలస వచ్చిన అమెరికన్లు స్థానిక నివాసులైన రెడ్ఇండియన్ల భూములు లాక్కోవడానికి ఏ ప్రలోభాలు చూపించి వుంటారు? లేదా ఏమని బెదిరించి వుంటారు? అసలు అమెరికన్ల రాజధాని నిర్మాణం కోసం తన భూముల్ని ఎందుకు ఇవ్వాల్సి వచ్చింది?

"రెడ్ఇండియన్లు ఎవరు సార్?" అడిగాడొక కుర్రాడు.

ఔను... ఎవరు? భూములు కోల్పోయిన వాళ్ళు. ఎవరు రెడ్ఇండియన్లు? రాజధాని రైతులని చెప్పాలా? పోలవరం

గిరిజనులని చెప్పాలా? ఎలా చెబితే పిల్లలకు అర్థమవుతుంది?

చెప్పాను... వాళ్ళూ మనలాగ గిరిజనులు. అతి పురాతన ప్రిమిటివ్ ట్రైబల్ గ్రూప్. ప్రకృతిని దేవతలా కొలిచే అత్యంత సహజమైన మానవులు. ఈ భూమి పైన అణువణువూ పవిత్రమైనదేనని భావించే సమూహం. తన పూర్వీకుల జ్ఞాపకాలు చెట్లలో ప్రవహించే జీవరసమనీ... పరిమళించే ప్రతి పువ్వూ అక్కచెల్లెలేనని... పలకరించే ప్రతిజీవీ తమ అన్నదమ్ముడే అని భావించే అతి పురాతన మానవ సమాజం అని చెప్పాను.

Can you buy or sell the sky? or warmth of the land? అని అడుగుతున్నాడు సీటెల్ తరగతి గదిలో.

తరగతి గది సడెన్‌గా అడవిలా మారిపోయింది. సీటెల్ ఓ రాయి మీద కూర్చొని అక్కడి కొచ్చిన అమెరికన్లనుద్దేశించి మాట్లాడుతున్నాడు. చుట్టూ రెడ్ ఇండియన్లు తమ తమ పెంపుడు జంతువులైన గుర్రాల మీద బర్రెల మీద కూర్చొని ఆసక్తిగా వింటున్నారు. వాళ్ళలో కొంతమంది డెస్క్ బెంచీల మీద కూడా కూర్చొని వున్నారు. జాగ్రత్తగా చూస్తే వాళ్ళు మా పిల్లలు.

రాయి మీద నుండి మాట్లాడుతున్నది నేనా? చీఫ్ సీటెలా?

అది రెడ్ ఇండియన్ల నేలా? తరగతి గదా?

“ఈ రోజు తెల్లవాడి నుండి ఒక వర్తమానం అందింది.” నా గొంతు నాకే గంభీరంగా వినిపిస్తోంది. దాదాపు మూడు చదరపు కిలోమీటర్ల మేర నిలబడివున్న ప్రజలు సులభంగా వినపడగల ధ్వని ప్రసరిస్తోంది నా గొంతులోంచి. “ఈ నేలను కొనాలనుకుంటున్నారు... దేశ రాజధాని నిర్మించుకుంటానికని...ఈ నేల నుండి మనల్ని ఖాళీచేయమని అంటున్నారు.... ఇచ్చేద్దామా మన భూములూ?” ఇంకా బిగ్గరగా అడిగాను.

‘నీనెందుకిస్తానూ బూమీ?’ తిరిగి ప్రశ్నించిందొక గొంతు. అటు చూస్తే అది నాన్న. అతడికెదురుగా మా ఎమ్మార్వో చేతిలో ఏవో కాగితాలు పట్టుకుని. “ఇక్కడ నర్సరీ ఎక్స్టెన్షన్ చేస్తున్నాం. ఈ పాక వున్న భూమిని ఇవ్వాల్సి వుంటుంది” అంటున్నారు. “ఇవ్వనంతే ఇవ్వను” అంటున్నాడు నాన్న.

“సార్! ఏమ్మాట్లాడుతున్నారు?” పిల్లలెవరో అరిస్తే ఈ లోకానికొచ్చేను.

దేశమేదైనా...

కాలమేదైనా... భూములు లాక్కోవడం. ఆదివాసీల్ని నిర్వాసితులుగా మార్చేయడం. ఇదే కదా చరిత్ర? ! కాదు కాదు ఇదే కదా వర్తమానం?!

నేనున్నది గతంలోనా? వర్తమానంలోనా??

“మన కోసం పునరావాసం కొత్తగా నిర్మిస్తున్నారని, మనల్నందరినీ అక్కడికి వెళ్ళమని కోరుతున్నాడు. ఆ స్వరంలో అభ్యర్ధన కంటే ఆదేశమే వినపడుతోంది. వెళ్దామా?” సీటెల్ అడుగుతున్నాడు మరోవైపు తరగతి గదిలో రాయి మీద కూర్చొని.

“వద్దు సార్! ఈ భూముల్ని రాజధానికోసం ఇవ్వొద్దు సార్! ఇది మన నేల. మనకు బతుకు లేకుండా ఆర్భాటం, హంగుల రాజధానికోసం మనల్ని మనం కోల్పోవద్దు సార్!” పిల్లలు అరుస్తున్నారు.

అరుస్తున్నది పిల్లలా? భూములు కోల్పోతున్న రైతులా?

హటాత్తుగా తరగతి గదిలో అలజడి.

“మీకోసం అత్యంత ఆకర్షణీయమైన పేకేజీ ఇస్తున్నాం. మీ భూముల్ని ప్రపంచ పెట్టుబడుల్తో అందంగా తయారు చేస్తాం. అభివృద్ధి చేసి మీకో ప్లాటిస్తాం. అక్కడ మీరు వ్యాపారం చేసుకోవచ్చు.....” తాయిలాలు మండమీద బెల్లం రాసినట్టు.

“వ్యవసాయం ఎలాగూ లాభసాటిగా లేదు... వ్యాపారమే మేలు... ఒప్పుకుంటున్నాం ఒప్పుకొంటున్నాం. మీ పేకేజీ బహు బాగున్నది” గుంపులోంచి ఒకరు లేచి తన భూముల్ని అప్పగించేస్తున్నట్టు ప్రకటించేడు. అతని వెంట మరి కొందరు. వాళ్ళకి శాలువా కప్పేరు ప్రతినిధులు. కడుపు నిండా భోజనం పెట్టి పంపించేరు. అక్కడి నుండి వెళ్ళిపోతున్న వాళ్ళు అస్థిపంజరాల్లా మారిపోవడం స్పష్టంగా కనిపిస్తోంది.

“ఆగండి! అందరూ అలాగే అనుకుంటే... ఇక్కడ వ్యవసాయం ఎవరు చేస్తారు? రాబోయే తరాలు ఏమి తింటాయి? ప్లాస్టిక్కుతో నిండి పోతున్న భూమి మీద మనిషి తినాల్సింది అన్నమే కదా? ఒకటి కాదు రెండు కాదు. యాభై వేల ఎకరాలు. అది మామూలు సంఖ్య కాదు. ఒక తరానికి తరం కోల్పోతున్న అన్నం ముద్ద. వేలకు వేల కుటుంబాలు నిర్వాసితులుగా మారిపోతున్న సందర్భం...ఆలోచించండి... ఆలోచించండి...ఆగండి!” మరికొందరు అరుస్తున్నారు.

వారి వెనక మరికొందరు.

ఆ సంఖ్య పెరిగిపోకుండా ఆ నేల మీద రెండు అస్త్రాలు ప్రయోగించారు.

ఒకటి భూసేకరణ. రెండు భూ ఆక్రమణ. రెంటి అర్ధమూ ఒక్కటే. ప్రజల భూముల్ని ప్రభుత్వం లాక్కోవడం.

ఆ రెండూ కాఖీ రంగులో అక్కడి గాల్లో వ్యాపించాయి. ప్రజలు ఒక్కసారిగా అరిచారు. ప్రాణ భయంతో చెల్లా చెదురైపోయారు.

సీటెల్ కళ్ళు మూసుకున్నాడు. ఈ దృశ్యం ముందే ఊహించగలిగాడతడు. అందుకే భూముల్ని తెల్లవాడికి అప్పగించడానికి అంగీకరించాడు...మౌనంగా.

"నాయకా! ఏమిటీ మౌనం?" ఎవరో ప్రశ్నిస్తున్నారు.

ప్రశ్న ఒకటే.

గొంతులే వందలు...

కాదు వేలు...

కాదు కాదు...లక్షలు.

కాదు కానేకాదు... అనంతం...బృందగానంలా.

కళ్ళు తెరిచాను. ఎదురుగా అడవుల్ని మోస్తోన్న అడవి బిడ్డలు. యూనిఫామ్ తొడుక్కుని అమాయకంగా డెస్క్ బెంచీల పై కూర్చొని... ఒక్కొక్కరూ ఒక్కొక్క ప్రశ్నలాగా.

నిజం కదూ! వీళ్ళంతా ఇళ్ళూ, భూములు కోల్పోయిన నిర్వాసితులు.

ఔను... నిర్వాసితులు.

హక్కుల్ని కోల్పోతున్న నిత్య నిర్వాసిత ఆదివాసీలు.

సీటెల్ చుట్టూ... మోకరిల్లి నేల మీద తలలు వాల్చి కూర్చున్న ప్రిమిటివ్ ట్రైబల్ పిల్లలు.

సీటెల్ మళ్ళీ గొంతు విప్పాడు.."తప్పదు. మనం ఈ నేలను విడిచి వెళ్ళక తప్పదు. లేదంటే మన జాతే అంతరించిపోతుంది. ఆధునిక కుట్రపూరిత శక్తుల ముందు ఆదివాసులమైన మనం ఎదురు నిలబడి పోరాడలేం. ఇది చీకటి కాలం. ఇప్పటికిప్పుడు యుద్ధానికి దిగితే మరణం తథ్యం. అది నాకిష్టం లేదు. ప్రవాసం అనివార్యం. ఎవరో కవి అన్నట్టు 'ప్రవాసమూ ఒక యుద్ధ రహస్యమే'. తప్పదు... ఈ నేలని ఖాళీ చేసి ఆ నిర్వాసిత కట్టడాల్లోకి వెళ్దాం పదండి" సీటెల్ నన్నావహించాడు. నా గొంతు నాలోనే ధ్వనిస్తోంది రహస్యంగా... స్పష్టంగా.

స్వరంలో కన్నీళ్ళు...! లక్ష గొంతుల నిర్వాసిత హోరు...!!

"నిర్మాణాలు...!

ఆధునిక నిర్మాణాలు...!!

ప్రజని నిర్వాసితులుగా మార్చే దు:ఖ నిర్మాణాలు...!!!

ఓట్ల కోసం...

పడగలెత్తే కోట్ల కోసం...

అందలమెక్కించే అసెంబ్లీ సీట్ల కోసం...

నిర్మాణాలు... ఆధునిక నిర్మాణాలు..." నా గొంతు తరగతి గోడలమీద రాసిన అక్షరాల్లా ధ్వనిస్తోంది.

"సార్! కవిత్వమా?" ఎవరో అడుగుతున్నారు. తరగతి గదిలోపలి నుంచా? గుండెగది లోపలినుంచా?

"కాదు కాదు. ప్రజల గొంతు. వారి కన్నీళ్ళను అనువదిస్తున్నాను" నేనే చెప్పానా మాట.

"అర్థం కాలేదు. మరోలా చెప్పండి. ఒక ఉదాహరణమివ్వండి" నా ఒడిలోకొచ్చి నా చెక్కిలి మీద చేయాన్చి అడుగుతున్నాడు మరొకరు.

గొంతు సవరించుకున్నాను. నా ఎదురుగా కుతూహలం కుప్పల్లా కూర్చొని వుంది... బెంచీల మీద... పుస్తకాలు ముందేసుకొని.

"ఇది నిర్వాసిత కాలం. ప్రజలంతా నిర్వాసితులుగా మారే కాలం. నేలను మాత్రమే కాదు, తమ బతుకుల్ని తాము కోల్పోతున్న కాలం. తమకు తెలీకుండానే నిర్వాసితులుగా మారిపోతున్న కాలం. మనిషి మనిషన్న సంగతి మర్చిపోతున్న కాలం. ఒక జాతి అంతరిస్తున్న కాలం. ఔను ! ఒక తరం తరవాతి తరంతో బంధనాల్ని తెంపుకుంటోన్న కాలం."

"కాలం సరే! కారణాలు చెప్పండి" కాలాన్నీ కవిత్వాన్నీ అర్థం చేసుకోలేకపోతున్న మరో విద్యార్థి అడిగాడు

వాడిని దగ్గరగా చేర్చుకున్నాను. అవే మాటల్ని మరోలా చూపించాను.

"ఇక్కడ చూడండి! మరొక నిర్మాణం." అని కొన్ని పాత దిన పత్రికల్ని చూపించాను.

"సార్! ఇది పోలవరం! నవ్యాంధ్ర మెడలో పూలహారం" అరిచాడో కుర్రాడు.

నవ్వొచ్చింది. బిగ్గరగా నవ్వేను.

"ఎందుకు నవ్వుతున్నారు సార్!" అయోమయంగా అడిగాడు అదే కుర్రాడు.

వాడి భుజమ్మీద చెయ్యేసి నడిపించాను. మా వెనుక తరగతి నడుస్తోంది. "కవిత్వమంటే కళాత్మకంగా చెప్పడమొక్కటే కాదు. నిజాన్ని నిర్భయంగా చెప్పడం కూడా" అన్నాను.

"అంటే? నేను చెప్పింది అబద్ధమా సార్?"

"ఔనన్నాను. నీ కవిత్వానికి దినపత్రికల సమాచారం మాత్రమే ఆధారం కాకూడదు."

"ఎందుకని సార్?"

"పత్రికలు చెప్పినవన్నీ నిజాలు అవ్వాలని రూల్ లేదు"

"మరి?"

"కవిత్వం నిజాన్ని ప్రతిబింబించాలి. పత్రికల్లో వచ్చిందీ, ప్రభుత్వాలు చెప్పింది మాత్రమే నిజం కాదు. అందుకే పోలవరం పూలహారం అంటే నవ్వాను"

"మరి నిజమేంటో ఎలా తెలుస్తుంది సార్?"

"పోలవరం అంటే ప్రోజెక్టు మాత్రమే కాదు. పోలవరం అంటే ఆదివాసీ నిర్వాసితుల శాపం కూడ. వాళ్ళతో మాట్లాడితే తప్ప నిజాలు తెలీవు."

"నిజం. అక్కడికి వెళ్ళకుండా, ఆ నిర్వాసితులతో మాట్లాడకుండా పోలవరం గురించి మాట్లాడే హక్కు మనకెవ్వరికీ లేదు." చివరి బెంచీ విద్యార్థి అన్నాడు.

"అందుకే ఇక్కడికొచ్చాం" అని ఆగాను. నా వెనుక వాళ్ళు...

తరగతి గది ఇప్పుడు...

రేకుల షెడ్డులతో...

వున్న వూరికి దూరంగా సిమెంటు గోడలతో...

మనుషులు. నిండా కన్నీళ్ళతో...

భూములు కోల్పోయి వనుల్లేక దిక్కుతోచని మనుషులతో...

ఒక నిర్వాసిత గ్రామంగా మారిపోయింది.

విద్యార్థులు ఇంటర్వ్యూ చేస్తున్నారు.

వారితో మాట్లాడుతున్నది నేనో! పోలవరం నిర్వాసితుడినో !? రెడ్ఇండియన్ల చీఫ్ సీటెల్‌నో..! మాట్లాడుతున్నాం అంతే....

"నేనూ...నిర్వాసితుడిని! ఈ నేలమీద నన్ను నేను కోల్పోయిన ఒక నిర్వాసితుడిని...ఒక ఆదివాసీని. నా నేలను కోరుకున్నావంటే నా హక్కుల్నీ కోరుతున్నట్టే...

పిల్లలు శ్రద్ధగా వింటున్నారు.

"నీ పిల్లలకు చెప్పాలి...వాళ్ళ పాదాల కింద వున్న నేల మా పూర్వీకుల అస్థికలతో నిండి వున్నదని. ఈ మాటనే ఆధునిక కవి మరోలా అన్నాడు 'నేలంటే తాత ముత్తాల మాంసాస్థికలలోంచి పుట్టుకొచ్చిన బతుకు పువ్వు' అని. ఆ మాటకు అర్థం తెలుసా? ఈ సందేశం పంపించి నా నేలను సొంతం చేసుకోవాలనుకున్నావు... అలా అనుకోవడంలో ఈ నేలను జయించానని విర్రవీగుతున్నావు. కానీ ఈ నేల అలా అనుకోదు. నీ వెర్రితనానికి నవ్వుకుంటుంది. ఎందుకంటే నేలను ఎవ్వరూ జయించలేదు. నేలే మనల్ని జయిస్తూ వస్తోంది. మనిషి నేలకు చెందినవాడు. కానీ నేల మనిషికి చెందింది కాదు. ఈ సత్యాన్ని ఎప్పుడు నువ్వు గ్రహిస్తావో నాకర్థం కావడం లేదు. ఎందుకంటే నీ దృష్టిలో నేనొక ఆదివాసీని... అడవిమనిషిని... అజ్ఞానిని"

"మా హక్కులు మాక్కావాలి"

"మునిగిపోయింది భూమి కాదు... మా బతుకు...మా ఉనికి... మా చిరునామా"

"మాకు మా షెడ్యూల్డ్ ఏరియా హక్కులు కావాలి" నినాదాలు... జెండాలు...మనుషులై ఎగురుతున్న నిరసనలు... సీటెల్ మాటలకు కొనసాగింపులా. అధికారం ఆలకించని ఆర్తనాదాల్లా.

"మిస్టర్ సీటెల్! ఎక్కడున్నామో తెలుస్తోందా మీకు?" ఏ ప్రదేశం గురించి మాట్లాడుతున్నామో తెలుసా అనే అర్థంలో అడుగుతున్నాడు మూడో బెంచీమీదున్న గ్రామస్తుడు.

"తెలుసు! దేశమేదైనా భూమొక్కటే. మనిషెక్కడివాడైనా జీవమొక్కటే. బాధ ఎక్కడిదైనా ఆక్రందన ఒక్కటే! నా మాట నమ్మక పోతే అటు వినండి!" అని నా చూపుడు వేలుని అటుగా చూపించాను.

పిల్లలందరూ ఒకే సారి అటువేపు తలలు తిప్పి చూసేరు.

భారీ తవ్వకాలతో పోలవరం! ఎత్తైన ఇనప గోడల నిర్మాణం!!

అవతల గోదావరి...!

నిండా నీళ్ళతో...!

కాదు కాదు మునిగిపోతున్న ఆదివాసిల కన్నీళ్ళతో...!

మాయమైపోతున్న అడవి నేల మూగ రోదనతో...!

ఇవతల..

నిర్వాసిత కట్టడాలుగా వూళ్ళు...!

దళారి చేతుల్లో దగాపడుతూ...ఆదివాసీ!

ఎంగిలి మెతుకుల్ని పేకేజీల్లో విసురుతూ... చిద్విలాసంగా నాయకులు!

"సార్! బెల్ అయి చాలసేపయింది" గది బయట తర్వాతి పిరియడ్ చెప్పాల్సిన మాష్టారు దీనంగా వున్నారు.

ఔను! ఒక పిరియడ్ పూర్తయింది.

బయటికొస్తుండగా స్టాఫ్ రూమ్‌లో నా మొబైల్ మోగింది. మిత్రుడు గుర్తు చేస్తున్నాడు "మిత్రమా! కరపత్రం తయారయ్యిందా? మనకంతగా సమయం లేదు ప్రింటింగ్‌కిచ్చేయాలి" అని.

ఔను...

సమయం లేదు.



# ఉసురు

ఇందూరమణ
9951171696

**జీవచ్ఛవంలా పడి కూర్చున్నాడు కిత్తన్న.**

**చుట్టూ విగతజీవులై చెల్లా చెదురుగా పడిఉన్న దూడల మధ్య ప్రాణంలేని శిలలా కొయ్యబారిపోయి కూర్చున్నాడు.**

అప్పటికే గోశాల్లో ఉన్న గోవులు చచ్చిపోయాయన్న వార్త ఊరంతా పొగలా అల్లేసింది...

◆◆◆

దేవుడి వార్షిక కళ్యాణోత్సవాలు ఘనంగా జరుగుతున్నాయి

వైజాగ్ ఫెస్ట్ 2017 పోటీలలో ద్వితీయ బహుమతి గెలుపొందిన కథ

రాష్ట్రం నలుమూలల నుండే కాక ఇతర రాష్ట్రాల భక్తులు కూడా తండోపతండాలుగా దేవుడి కళ్యాణం వీక్షించడానికి తరలివస్తున్నారు. దేవుడికి ముడుపులు కట్టి కట్న కానుకలతోపాటు లేగదూడల్ని కూడా కానుకగా సమర్పించడం దేవాలయంలో ఆనవాయితీ. దేవుడి కళ్యాణానికి వచ్చిన భక్తులు లెక్కకు మించిన దూడలు కానుకగా సమర్పిస్తున్నారు. అవన్నీ పొలోమని కొండ దిగువనున్న గోశాలకు వచ్చి చేరుతున్నాయి.

అప్పటికే అక్కడున్న పాతిక పైచిలుకు దూడలతో పాటు కొత్తగా చేరిన దూడలు కలిసి రెండొందలు దాటిపోయాయి. దేవుడికి కానుకగా వచ్చిన దూడలు వంద వరకూ పోగవగానే వాటిని బహిరంగ వేలం ద్వారా అమ్మేసి అలా వచ్చిన సొమ్ము దేవుడి ఖజానాకి జమచేయడం పరిపాటి. దేవుడికి కానుకగా వచ్చిన దూడలు వారం పదిరోజుల కంటే గోశాల్లో ఉండవు.

కిత్తన్న పని కూడా గోవులకు గడ్డి, కుడితి సమయానికి అందించడమే. రాత్రీ పగలు అదే పని. కిత్తన్న ఒక్కడే గత నాలుగేళ్ళుగా అక్కడ మాలీగా పనిచేస్తున్నాడు. నామకానికి ఒక వ్యక్తిని నియమించినా అతను కిత్తన్నకు సహాయకుడు దినసరి కూలీ మాత్రమే. ఈ సమయంలోనే కిత్తన్న ఇంటికెళ్ళి వస్తుంటాడు. రాత్రి పగలూ గోశాల కాపరిగా... గోవుల పరిరక్షణ కోసం నియమించబడ్డాడు కిత్తన్న.

దేవుడి కళ్యాణం ఎంతో ఘనంగా జరిగిపోయింది. సందడి కూడా చల్లబడింది.

గోశాల మాత్రం రకరకాల జెర్సీ, దేశవాళీ దూడలతో కళకళలాడుతోంది. కిత్తన్న ఆనందంగా ఒక్కో దూడ దగ్గరకు వెళ్ళి వాటి మెడ క్రింద దువ్వుతూ ప్రేమగా కుడితి నీళ్ళు పడుతున్నాడు. దూడల్లో చిన్నా పెద్దా ఉన్నాయి. కొన్ని బక్కచిక్కి... మరికొన్ని ఊరిమీద పడి తిరిగిన ఆంబోతుల్లా బలిసి ఉన్నాయి.

ఓ మూల లేగ దూడ ఒకటి దిగులుగా కూర్చుని కనిపించింది కిత్తన్నకి. గబాలున దాని దగ్గరకు వెళ్ళి రెండు చేతులతో ఎత్తుకుని పాక లోపలకు తీసుకువచ్చాడు. లాలనగా తల నిమురుతూ కుడితి గోళం దగ్గరకు తీసుకు వెళ్ళి నీళ్ళు తాగించబోయాడు. ఆ లేగ దూడ ససేమిరా తాగకుండా తల అటూ ఇటూ తిప్పుతూ మూతి ముడుచుకుంది. కిత్తన్న నానా తిప్పలు పడ్డాడు. అయినా ఆ లేగ దూడ మూతి తడుపుకోలేదు. గడ్డి పరక కూడా ముట్టలేదు. ఆకలి లేదేమో అనుకుంటూ ఓ మూల ఎండు గడ్డిని పరుపులా పరిచి లేగ దూడని పడుకోబెట్టాడు కిత్తన్న.

'పాపం ! తల్లావు దగ్గర పాలు తాగుతున్న ఈ లేగదూడని లాక్కొచ్చి దేవుడికి కానుకగా సమర్పించి తమ మొక్కు తీర్చేసుకున్నారు భక్తులెవరో. ఇది ఇంకా తల్లి రొమ్ము మరిచినట్టూ లేదు. ఎలాగ దీనికి మేతపెట్టాలో... దేవుడా ! నువ్వే దీన్ని కాపాడాల' అనుకుంటూ పాకలో ఓ మూల నున్న మంచం మీద కూర్చుని లేగదూడకేసి చూస్తూ దూలానికి చేరగిలబడ్డాడు కిత్తన్న.

ఇంతలో "అయ్యా ! అయ్యా !" అంటూ కిత్తన్న కూతురు పరిగెట్టుకుంటూ వచ్చింది.

కూతురు పిలుపుకి ఉలిక్కిపడ్డాడు కిత్తన్న. మంచం మీద నుండి లేచి పాక బైటకు వచ్చాడు. పాకలో ఎండు గడ్డి మీద పడుకున్న లేగ దూడని చూసి ఆనందంతో కిత్తన్న కూతురు ఎగిరి గంతేసింది.

"అయ్యా ! అయ్యా! ఈ దూడ పిల్లని నాకివ్వవా ! మనింటికి తీసుకుపోతానయ్యా!" సంతోషంతో గెంతుతూ అడిగింది కిత్తన్న కూతురు.

"అమ్మో ! ఇది దేవుడి దూడమ్మ. మనకివ్వరు. "కూతుర్ని దగ్గరకు తీసుకుని తలనిమురుతూ అన్నాడు కిత్తన్న.

"పో అయ్యా ! ఈ దూడ పిల్లతో ఆడుకుందా మనుకున్నాను." అంటూనే లేగదూడ దగ్గరకు వెళ్ళి ప్రక్కనే కూర్చుని దాని తల నిమిరింది. కునుకు తీస్తున్న లేగదూడ కిత్తన్న కూతురు చేయి తగిలేసరికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసింది. తనలాగే ఉన్న కిత్తన్న కూతుర్ని చూసి ఉత్సాహంగా రెప్పలు టప టపలాడిస్తూ తల అటూ ఇటూ ఊపుతూ నాలుకతో కిత్తన్న కూతురు చెయ్యి నాకింది లేగదూడ.

ఈ దృశ్యం చూస్తూనే కిత్తన్న ఉప్పొంగిపోయాడు.

"అమ్మా లచ్మీ! పాపం ఆ దూడ పిల్లని కాసింత కుడితి నీళ్ళు తాగించమ్మా! పొద్దుట్నుండి వచ్చి పచ్చి మంచి నీళ్ళు ముట్టలేదది" ఆనందంగా కూతురితో చెప్పాడు కిత్తన్న. తండ్రి చెప్పీ చెప్పగానే లేగ దూడని రెండు చేతులతో పొదివి పట్టుకుని నిలబెట్టి నడిపించుకుంటూ కుడితి గోళాం దగ్గరకు తీసుకు వెళ్ళింది కిత్తన్న కూతురు. ఏం మాయ చేసిందో కిత్తన్న కూతురు. కుడితి గోళం చూడగానే ఆబగా మూతి ముంచి ఆవురావురుమని కుడితి నీళ్ళు గుక్కతిప్పుకోకుండా తాగేసింది లేగదూడ.

నీళ్ళు తాగేసి గెంతుకుంటూ ఆగి ఆగి పరిగెడుతూ కిత్తన్న కూతురు కేసి తల ఎత్తి చూస్తూ కిత్తన్న కూతురు పరిగెట్టుకుని దగ్గరకు రాగానే దొరక్కుండా మళ్ళీ పరిగెత్తుతోంది లేగదూడ. గోశాల్లో ఉన్న దూడల్ని తప్పించుకుంటూ మెలికలు తిరుగుతూ పరుగులు పెడుతూ కిత్తన్న కూతురితో ఆడుకుంటోంది ఆ లేగ దూడ.

ఇంతలో దేవస్థానం అధికారులు గోశాల దగ్గరకు వచ్చారు. వాళ్ళను చూస్తూనే కిత్తన్న కూతురు భయంగా తండ్రి పక్కకొచ్చి నిలబడింది. కిత్తన్న కూతురు పరుగు ఆపేసి దాక్కోవడం చూసి టక్కున పరుగు ఆపేసి నాలుకతో మూతి తుడుచుకుంటూ అటూ ఇటూ దిక్కులు చూస్తూ నిలబడింది లేగదూడ.

"దండాలండయ్యా!" ఏ.ఈ.వో కి రెండు చేతులు జోడించి నమస్కరించాడు కిత్తన్న.

"దూడలు ఎన్నున్నాయో లెక్క తేల్చాలి కిత్తన్న! సాయంత్రం దూడల వేలం ఉంది కదా. ఉదయానికల్లా గోశాల ఖాళీ అయిపోతుంది. నీకు పని తగ్గిపోతుంది" నవ్వుతూ అంటూనే దూడల్ని లెక్కకడుతున్నాడు ఏఈవో. ఆయనతో పాటు వచ్చిన గుమస్తా ఫైల్ చేత పట్టి చిన్నా పెద్దా దూడల లెక్కలు రాసుకుంటున్నాడు.

"అయ్యా ! ఆ చిన్న దూడ పిల్ల నా కూతురికి కావాలటయ్యా ! దానికి ఎంతో ఖరీదు కట్టి నా జీతంలో ఇరగ్గోసుకోడానికి అవుద్దంటారా అయ్యా?" చేతులు కట్టుకుని ఏఈవోని అడిగాడు కిత్తన్న.

"గొప్పోడివిరా! దూడల్ని వేలంలోనే అమ్మాలిగాని ఇలా నీకూ నాకూ నచ్చినట్టు ధర నిర్ణయించి ఇచ్చేయ్యడానికి ఎలా కుదురుతుందిరా కిత్తే! నీ కూతురుకి కావాలంటే ఏ బొమ్మ దూడో కొనివ్వరా. లేదా వేలంలో పదో పాతికో దూడల్ని పాడుకో. పెంచుకో. ఒకటీ అరా ఎలారా వేలం వేస్తారు?" ఎగతాళి చేస్తూ అన్నాడు ఏఈవో.

ఆ సాయంత్రమే తండోపతండాలుగా గోశాల దగ్గరకు వేలం పాటదారులు వచ్చి చేరుకున్నారు. పాటదారులంతా వేలంలో తాము పాడాలనుకున్న దూడల దగ్గరకు వెళ్ళి తడిమి తడిమి చూసుకుంటున్నారు. ఓ ఇద్దరు పాటదారులు మాత్రం మిగతా పాటదారులను కలిసి ప్రక్కకు తీసుకువెళ్ళి రింగవడానికి మంతనాలు సాగిస్తున్నారు. అధికారులు అంతా గమనిస్తున్నా తమకేమీ పట్టనట్టు వేలం నిర్వాహణకు ఏర్పాట్లు చేస్తున్నారు.

వేలం పాట మొదలు కాబోతోందని పాటలో పాల్గొనాలనుకునే పాటదారులు ధరావత్తు చెల్లించి వేలం పాటలో పాల్గొనాలని అధికారులు మైకులో ప్రకటించారు.

ఇద్దరు పాటదారులూ చిన్న చితక పాటదారులకు ఎంతో కొంత ముట్టజెప్పి వేలం పాటలో పాల్గొనకుండా పంపించేసారు. ఒకరిద్దరు మాత్రం తమకి కావలసిన మూడు నాలుగు దూడల్ని ఎంచుకుని గుంపుగా పాడుకున్నారు. దేవాలయ అధికారులకు డబ్బు కట్టేసి తాము పాడిన దూడల్ని

ఆటోలెక్కించి తీసుకుపోతున్నారు. అలా ఏభై దూడల వరకూ సాయంత్రమే వెళ్ళిపోయాయి.

కిత్తన్నకి లేగదూడ మీద మనసుండిపోయింది. ఎవరైనా దాన్ని తీసుకువెళ్తే వాళ్ళని అడిగి ఎంతో కొంత సొమ్ము కట్టి తీసుకోవాలని పెయ్యి తల నిమురుతూ దాని దగ్గరే కూర్చున్నాడు.

వేలం పాట పూర్తయ్యింది.

"కిత్తన్నా ! మిగిలిన ఈ దూడలు కూడా వేలంలో పాడేసుకున్నారు. వాళ్ళు లారీలు తెచ్చుకోడానికి వెళ్ళారు. వాళ్ళు ఎంత రాత్రి వేళ వచ్చినా రశీదు చూపిస్తే దూడల్ని లెక్కపెట్టి వారికి అప్పగించు." అంటూ అధికారులు వెళ్ళిపోతూ కిత్తన్నకి ఆదేశాలిచ్చారు.

"సరే బాబయ్యా! అయ్యా! మరి.. మరి.. ఆ పెయ్యిని ఎవరూ అడగలేదా అయ్యా?" మనసులో సంతోషం తన్నుకొస్తుంటే అనుమానం చావక అడిగాడు కిత్తన్న.

"గొప్పోడివేరా! దాన్ని చూసే ఈ నూట ఏభై దూడల్తో కలుపుకుని వేలంలో పాటదారులిద్దరూ వేలు గుమ్మరించి పాడుకున్నారు." చిరాగ్గా మొహం పెట్టి అన్నాడు ఏఈవో.

"చిత్తం బాబయ్యా" అంటూ ఇక చేసేదిలేక మౌనంగా నిలబడిపోయాడు కిత్తన్న.

అర్ధరాత్రి.

లారీల గోలకి దూడలన్నీ నిద్రనుండి మేల్కొని 'అంబా'... అంటూ ఒకదాని తర్వాత ఒకటి అరుస్తూ గోల చేసేసరికి నిద్రమత్తులో ఉన్న కిత్తన్న ఉలిక్కిపడి లేచాడు.

పాటదారులిద్దరూ కిత్తన్న దగ్గరకు వచ్చి రశీదు చూపించి దూడల్ని అప్పగించమన్నారు.

"ఇదేంటయ్యా! ఇంత అపరాత్రి పూట. పాపం గొడ్లన్నీ సేదతీరుతున్నాయి. ఉదయాన్నే రాలేకపోయారా?" ఆవులిస్తూ అన్నాడు కిత్తన్న.

"ఎప్పుడైతే నీకెందుకయ్యా!" అంటూ లారీలతో వచ్చిన పనివాళ్ళతో దూడల్ని లారీల్లో ఎక్కించమని పురమాయిస్తున్నాడు ఒకడు.

దూడల్ని చేత్తో బాదుతూ ఉత్సాహంగా "అన్నా! ఇది బాగా బలిసుందన్నా !.... ఈ బక్కది దిగుబడి రాదన్నా!" అంటూ దూడల్ని బరబరా లాక్కుపోతున్నారు లారీలతో వచ్చిన కూలీ వాళ్ళు. తమని ఎక్కడికో తోలుకుపోతున్నారని పసిగట్టిన దూడలు ఊపిరి బిగబెట్టి... కాళ్ళు నిలుపుగా తన్ని పట్టి లారీలు ఎక్కకుండా మొరాయిస్తున్నాయి.

"దొంగముండా దూడలు లారీలెక్కకుండా మొరాయిస్తన్నాయిరా సన్నాసి... ఏటి సేద్దావేటి?" అంటున్నాడు ఒకడు.

"నాలుగు బాదరారో రెంకన్నా ! ఈటి ఏశాలింకెంత సేపులే.. కబేళా కెళ్తే... సరి... పద పద" అంటూనే మొరాయిస్తున్న దూడల్ని దుడ్డు కర్రతో బాది లారీలెక్కిస్తున్నాడు రెండోవాడు.

వాళ్ళ మాటలు వింటున్న కిత్తన్నకి మనసెందుకో కీడు శంకించింది. కానీ ఏం చెయ్యగలడు.

"అయ్యా! నాకు తెలవకడుగుతాను. ఈ దూడలు మీకెందుకయ్యా ! ఇన్నేసి డబ్బులు పోసి ఏలం పాటలో కొనుక్కుపోతున్నారు." దూడల్ని కసిగా బాదేస్తున్న రెండో వాడి చెయ్యి పట్టుకుని కొట్టకుండా ఆపుతూ అడిగాడు కిత్తన్న.

"ఈ దూడల్ని ఏం చేసుకుంటామో నీకెందుకయ్యా! మీ డబ్బు మీకు ముందే కట్టేసాం కదా. అయినా కూలోడివి నీకీ ఆరాలన్నీ ఎందుకు చెప్పు!" ఎగతాళిగా అని చిన్నగా చిరునవ్వు నవ్వుతూ అన్నాడు సన్నాసనబడే రెండో వాడు.

దూడలన్నీ లారీలెక్కాక లేగదూడ కోసం లారీలతో వచ్చిన ఇద్దరూ దగ్గరకు రాగానే ఆ ఇద్దర్నీ ఆపి ఆ దూడపెయ్యిని తనకిమ్మని బ్రతిమలాడాడు కిత్తన్న. జేబులో దాచుకున్న అయిదొందల రూపాయల నోటు తీసి లేగ దూడకు బదులు తీసుకోమని ప్రాధేయపడ్డాడు కిత్తన్న.

"పో! పోవోయ్! దీని విలువ ఎంతో నీకేం తెలుసు. కావాలంటే పాతికా పరకా అడుగు ఇస్తాము. కానీ, ఈ దూడపిల్లని మాత్రం అడక్కు" అంటూ లేగ దూడని లాక్కొని వెళ్ళబోయారు ఆ పాటదారులు.

"అయ్యా! ఇంత చిన్న పెయ్యిని మీరు పెంచలేరయ్యా! నా కూతురు ఆశపడుతోంది. ఈ అయిదొందలు చాలకపోతే మరో వంద ఇస్తాను ఈ పెయ్యిని మాత్రం పట్టుకెళ్ళకండయ్యా" వాళ్ళిద్దరి చేతులూ పట్టుకుని బ్రతిమలాడాడు కిత్తన్న

'పో పోవయ్యా! ఈ దూడ పెయ్యిని పెంచుకుంటామని నీకెవరు చెప్పారు. వాటితో పాటే ఇదీనూ... దీని రుచి.. దీని విలువ నీకేం తెలుసు..." అంటూనే లేగ దూడను కూడా

రెండో లారీలో ఎక్కించుకుని వెళ్ళిపోయారు పాటదారులు.

లారీలు కదిలీకదలగానే పోలీస్ రక్షక్ వాహనం గోశాల ముందు ఆగింది. విచారంగా వెనుదిరిగిన కిత్తన్న ఏదో బండి ఆగిన శబ్దానికి చటుక్కున వెనక్కి తిరిగి చూసాడు.

పోలీసు జీపును చూడగానే కిత్తన్నలో విచారం ఎగిరిపోయి గుండెల్లో ఏదో ధైర్యం మొండిగా తన్నుకొచ్చింది. అప్పటికే ఇద్దరు కానిస్టేబుల్లు జీపు దిగి కిత్తన్న దగ్గరకు వచ్చారు.

"ఇంత రాత్రి వేళ ఆ లారీల్లో ఏం లోడు చేసుకుని తీసుకు వెళ్తున్నారు" ఓ కానిస్టేబుల్ అడిగాడు కిత్తన్నని

"అయ్యా! దూడలయ్యా! నోరులేని గోవులు. నా కెందుకో అనుమానంగా ఉందయ్యా! వేలం పాటలో పాడుకుని పట్టుకెళ్తున్నా... దొంగల్లా ఈ అర్ధరాత్రిపూట... ఎందుకో అనుమానంగుందయ్యా!" దుఃఖం ఆపుకోలేక పోయాడు కిత్తన్న. తన మనసులో సుడులు తిరుగుతున్న అనుమానాన్ని బైటపెట్టాడు.

అంతే! పోలీసు జీపు రయ్యిమని ముందుకు దూసుకుపోయింది. కనుచూపు దూరంలో కనిపిస్తున్న లారీలను వెంబడిస్తూ వెళ్ళారు పోలీసులు.

♦♦♦

ఆ మర్నాడు భయంకరమైన వార్త దావాలనంలా వ్యాపించింది.

భక్తులు దేవుడికి కానుకగా సమర్పించిన గోవులను కబేళాకు తరలిస్తున్న ముఠాని పోలీసులు అర్ధరాత్రి మాటువేసి పట్టుకున్నారన్న విషయం ఊరంతా గుప్పుమంది. లారీల్లో తరలిస్తున్న దూడల్ని పోలీసులు స్వాధీనం చేసుకుని లారీలను సీజ్ చేసి, వేలం పాటదారులను అరెస్టు చేసారని, కోర్టు ఆదేశాలొచ్చేవరకూ నూటఏభై దూడల్ని తిరిగి దేవస్థానం గోశాలకు చేర్చారని రాసారు.

నెల రోజులు గడిచిపోయాయి.

ఎండలు తీవ్రస్థాయిలో విరుచుకుపడుతున్నాయి. బావులన్నీ ఎండిపోయాయి. నీటి ఎద్దడి తీవ్రరూపం దాల్చింది. గోశాల్లో ఉన్న పెద్ద బోరుబావికున్న మోటరు చెడిపోయింది. దూడలకి కుడితి నీళ్ళు దొరకడం లేదు. గడ్డివాము తరిగిపోయి పూర్తిగా అడుగంటిపోయింది.

కోర్టు గొడవల వలన దేవుడికి కానుకగా వస్తున్న దూడలు రోజుకు రోజు పెరుగుతూ వస్తున్నాయి. వేలం పాటలు జరగటం లేదు. వివాదంలో చిక్కుకున్న నూట ఏభై దూడలకు తోడూ కొత్తగా మరో ఏభై దూడలు వచ్చి చేరాయి. వాటన్నిటి ఆలనా పాలనా కిత్తన్న ఒక్కడే చూడలేక పోతున్నాడు. పేరుకు మరో పనివాడున్నా అంటీముట్టనట్టూ వస్తున్నాడు వెళ్ళిపోతున్నాడు.

'నందడిలో నదేమియహ్ అన్నట్టూ గడ్డివాము తరిగిపోయింది. బస్తాలకొద్దీ నిలువ ఉండాల్సిన తవుడూ తరిగిపోయింది. పుండు మీద కారం జల్లినట్టూ బోరుబావికి అమర్చిన మోటారు చెడిపోయింది. గోవులు చూస్తే ఈ మాయదారి ఎండకు సొమ్మసిల్లి పడిపోతున్నాయి. ఇప్పుడేం చెయ్యాల్రా దేవుడా! అని మనసులోనే సొణుక్కుంటూ గోశాల దగ్గర నుండి మండు టెండలోనే కాళ్ళీడ్చుకుంటూ దేవస్థానం ఆఫీసుకు చేరుకున్నాడు కిత్తన్న.

ఈవో ఆఫీసులో నుండి బయటకు వస్తూ కిత్తన్న కంటపడ్డాడు ఏఈవో శ్రీనివాస్.

తలకు చుట్టుకున్న తుండు గుడ్డ గబాల్న విప్పేసి భుజం మీద వేసుకుని వినయంగా ఆయన ముందుకెళ్ళి చేతులు జోడించి దండం పెట్టాడు కిత్తన్న.

"ఏరా కిత్తా! గోశాల వదిలేసి ఇటెందుకొచ్చావు?" దర్పం ఒలకబోస్తూ అడిగాడు ఏఈవో. గోశాల, చౌల్ట్రీలు, దేవస్థానం బస్సుల నిర్వాహణాధికారం అంతా ఏఈవో శ్రీనివాస్దే.

"ఏం చెప్పనయ్యా! పదిరోజుల్నుండి మీకు ఇన్నఇంచుకుంటూనే ఉన్నాకదయ్యా. దూడలకి దానా నేదు. కుడితికి టికాణా నేదు. గోసాల్లో ఉన్న ఒక్క బోరుబావి పాడైపోనాదని చెప్పాకదయ్యా. మెకానిక్కోడ్ని పిలిచి మోటారు సెడ్డాదో...బోరుబావి ఎండినాదో.. సూపించండయ్యా. కనీసం గోదాములో వీసమెత్తు ఎండు గడ్డి కూడా లేదయ్యా. లారీలోడు ఎండు గడ్డి తెప్పించినా కొంతలో కొంత దూడల ఆకలి తీరతాదయ్యా" వినయంగా చేతులు కట్టుకొని చెప్పాడు కిత్తన్న

గోవుల గోడు సరేరా! ఇప్పటికిప్పుడు కొత్త మోటారు కొనాలంటే పేపర్లో ప్రకటన ఇచ్చి కొటేషన్లు పిలవాల. తక్కువ కొటేషన్ దారు దగ్గర మోటరు కొన్నామే అనుకో... మెకానిక్ ని పిలిచి ఫిట్ చేయించాల. అదీ నాకు నచ్చినోడో... నీకు నచ్చినోడో... అయితే కుదురుద్దా! కుదరదు కాక కుదరదు. దానికి వర్క్కార్డరని ఒకటేడిసింది. దాన్ని ఫాలో కావాల. ఇక గడ్డి.. అదీ ఇదే తంతు. అయినా కావలసినంత ఎండు గడ్డి

దొరకొద్దూ. వారం పదిరోజులు ఎలాగో నెట్టుకురారా. నీకు తెలిసి కూడా ఎందుకురా కిత్తన్న నన్ను చంపుకు తింటావ్ పో ! పోయి నీ పని చూస్కో !" చిరాగ్గా గసిరేసాడు ఏఈవో శ్రీనివాస్. కిత్తన్నకి ఏం చేయాలో పాలుపోలేదు.

"అయ్యా! కనీసం దూడ పెయ్యికి పెట్టడానిక్కూడా గడ్డిపరక లేదయ్యా. దగ్గర్లో నీళ్ళ బావిన్నా బావున్ను. అన్నీ ఎండిపోయాయి. నేనం చెయ్యగలనయ్యా!" బావురుమన్నాడు కిత్తన్న.

"మనవేం చేస్తాంరా! ఇప్పటికిప్పుడు దేవుళ్లా వరాలివ్వలేం కదా! వాటి చావు అవి చస్తాయిలే. నీకు చేతనైంది చెయ్యి. లేదా తిని తొంగో. వేలం పాటయిపోయింది. గోవుల గోల వదిలేసిందనుకున్నాను. నువ్వే ఎదవ కూతలు కూసి పోలీసులకు పట్టిచ్చావు. లేకపోతే అంతా సజావుగా జరిగిపోయిండేది. ఎప్పటికప్పుడు వేలాలు సాగిపోతుండేవి" అని కోపంగా అరుస్తూనే "నువ్వు నా సీటు దగ్గరకు రా." అంటూ ఈవో ఆఫీసు ప్రక్కనే ఉన్న గదిలోకి వెళ్ళిపోయాడు. ఏఈవో శ్రీనివాస్.

'ఆకలితో మల మలా మాడిపోతున్న మూగజీవాల కేసి చూడలేక ఎండన పడివొచ్చాడు. ఈళ్ళకి ఇదేది అక్కరలేదు. అయినా దానా గీనా లేనప్పుడు ఈయనగోరి సీటు దగ్గరకెళ్ళి నేనేటి సెయ్యాల. అయినా అయ్యగోరు పిలిచాక ఎల్లకపోతే ఇంకేమన్నా ఉందా?' అని మనసులోనే గొణుక్కుంటూ ఈసురోమని నడుచుకుంటూ ఏఈవో శ్రీనివాస్ గది దగ్గరకు వెళ్ళి వినయంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు కిత్తన్న.

"ఇదిగోరా! వీటి మీద నీ వేలిముద్రలు వేసి ఇవ్వు. పసువులకి దానా కొనాలి కదా" అంటూనే నాలుగైదు కాగితాల మీద కిత్తన్న వేలిముద్రలు తీసుకుని వెంటనే తల దించుకుని ఏదో ఫైల్ చూసుకుంటూ ఉండిపోయాడు ఏఈవో శ్రీనివాస్.

"అయ్యా నేనిక ఎల్లిపోతానయ్యా" అడిగాడు కిత్తన్న

"ఏరా ! ఇంకా నువ్వు పోలేదా? పో ! పోయి ఆ పసువుల సంగతి చూడు." అంటూ మళ్ళా ఫైల్లో తల దూర్చేసాడు ఏఈవో

ఆ రోజంతా ఊర్లోకి వెళ్ళి మోయగలిగినన్ని నీళ్ళు బిందెతో మోస్తూ ఊరవతల ఉన్న గోశాలకు తెచ్చి గోళాలు నింపుతూనే ఉన్నారు కిత్తన్న అతని సహాయకుడు. దూడపిల్ల ఎండకి తట్టుకోలేక సొమ్మసిల్లి పడిపోతే పాకలో పడుకోబెట్టి నోట్లో నీళ్ళు పోసాడు. నీళ్ళతో నింపుతున్న గోళాలు క్షణాల్లో ఖాళీ అయిపోతున్నాయి.

ఇంతలో ఇంటి దగ్గర నుండి అంబలి తీసుకువచ్చింది కిత్తన్న కూతురు. ఉదయం నుండి కావిడితో నీళ్ళు మోస్తున్న కిత్తన్నకి అప్పటికే డొక్కమాడిపోయి నకనకలాడుతోంది. కూతురు తెచ్చిన అంబలి ఆబగా తాగేసి తపేలా కూతురు చేతికిచ్చాడు కిత్తన్న

"అయ్యా ! ఆ లేగదూడని మనింటికి తీసుకెళ్ళి కుడితి తాగిస్తానయ్యా" ఆశగా లేగదూడ కేసి చూస్తూ అడిగింది కిత్తన్న కూతురు.

కూతురు కోరిక విన్న కిత్తన్న ఆలోచనలో పడ్డాడు. ఇంటి దగ్గర అయితే ఈ లేగదూడ ఈ వడదెబ్బ నుండి తేరుకుంటుందనుకుంటూ "అలాగే తీసుకెళ్ళమ్మా. కొంచెం సేదదీరాక తీసుకువద్దువుగాని" అన్నాడు కిత్తన్న.

తండ్రి అలా అన్నాడో లేదో ఛెంగు ఛెంగున గెంతుకుంటూ వెళ్ళి లేగ దూడని తీసుకుని ఆనందంగా ఇంటికి వెళ్ళిపోయింది కిత్తన్న కూతురు.

సాయంత్రం వరకూ దూడల్ని సాకుతూనే ఉన్నాడు కిత్తన్న. అందిన దగ్గరల్లా గడ్డి గోక్కొచ్చి దూడలకు మేతేస్తున్నాడు. చుట్టు ప్రక్కల ఉన్న ఇళ్ళన్నీ తిరిగి కుడితి సేకరించి గోళాల్లో పోస్తున్నాడు. అవి క్షణాల్లో ఖాళీ అయిపోతున్నాయి.

గోళాల్లో కుడితి పొయ్యగానే దూడలన్నీ ఒకదాన్నొకటి తోసుకుంటూ ఆవురావురంటూ గడగడా తాగేస్తున్నాయి. అలుపు లేకుండా తిరుగుతున్నాడు. ఎండు గడ్డి ఎలాగూ లేదు. కనీసం దాణా కన్నా కుడితిగాని ఆఖరికి నీళ్ళు కూడా దొరక్కపోయేసరికి డీలా పడిపోయాడు కిత్తన్న

ఏం చేయడానికి కాళ్ళూ చేతులూ ఆడటం లేదు కిత్తన్నకి. సాయంత్రానికి దూడలన్నీ వడదెబ్బకి ఎక్కడివక్కడ సొమ్మసిల్లి పడిపోతున్నాయి. అంత వరకూ సహాయంగా ఉన్న కూలోడు కూడా ఏడయ్యేసరికి చేతులు దులుపుకుని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా దూడల కేసి చూస్తూ అటూ ఇటూ తిరుగుతూ నిద్రపోకుండా గడిపాడు కిత్తన్న. ఏ అపరాత్రికో అలసట అనిపించి అలాగే పాకలో దూలానికి చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు కిత్తన్న. క్షణాల్లో కునుకు పట్టేసింది. ఉన్నట్టుండి దూడ అరుపులకి ఉలిక్కిపడి లేచాడు కిత్తన్న. పరుగు పరుగున పాకలో నుండి వచ్చి ముంజూరు దగ్గరున్న దూడ దగ్గరకొచ్చి చూసి అదిరిపడ్డాడు. అప్పటికే ఆ దూడ ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి.

భయం భయంగా పాకలో నుండి బైట కొచ్చి చూసాడు కిత్తన్న. గోశాల్లో దూడలన్నీ క్రిందపడి నాలుగు కాళ్ళు తన్నుకుంటూ నోటంబట నురగలు కక్కుకుంటూ పడిఉన్నాయి. కిత్తన్నకి గుండె చెరువయిపోయింది. ఒకో దూడ దగ్గరకు పరుగెట్టుకెళ్ళి చూసాడు. కిత్తన్నకేసి బేలగా చూస్తూ కళ్ళల్లో నీళ్ళు దించుకుంటూ ఒకో దూడ ప్రాణాలొదిలేస్తుంటే కిత్తన్న గిలగిల్లాడిపోయాడు.

దూడలన్నీ కళ్ళముందే గిలగిలా తన్నుకుంటూ ప్రాణాలొదిలేస్తుంటే ఏం చేయలేని నిస్సహాయుడై జీవశ్చవంలా అచేతనంగా కూలబడిపోయాడు కిత్తన్న.

◆◆◆

"కిత్తన్నా నేను కబురెట్టే వరకూ ఇంటి దగ్గరే ఉండిపోరా! గోశాల పని వేరే మాలీకి అప్పగిస్తాను" అన్నాడు ఏఈవో శ్రీనివాస్

ఆ మాటకు ఉలిక్కిపడి తలెత్తాడు కిత్తన్న

ఆ రోజుకు రెండు రోజులవుతోంది గోశాలలో దూడలు కట్టకట్టుకుని చనిపోయి. అప్పట్నుండీ కిత్తన్న గోశాల్లో పని చేస్తున్నాడే గాని మనిషి మనిషిలో లేడు.

"అదేంటయ్యా ఈడే కదా నా పని. మరి నన్నేటి సెయ్యమంటారు" దిగాలుగా అడిగాడు

"నీకు కొన్నాళ్ళు రెస్ట్ ఇమ్మన్నార్రా ఈవో గారు. ఈ గోవులగోల చల్లారే వరకూ నువ్వు ఇంటి దగ్గరే ఉండిపో" అంటూనే కిత్తన్న దగ్గర వేలి ముద్ర తీసుకుని ఓ కాగితం కిత్తన్న చేతిలో పెట్టాడు ఏఈవో శ్రీనివాస్.

రెండు రోజులు ఇంటిపట్టునే కూర్చుండిపోయాడు కిత్తన్న

ఏఈవో శ్రీనివాస్ ఇచ్చిన కాగితంలో ఏముందో అర్థం కాలేదు కిత్తన్నకి. కానీ మనసెందుకో కీడు సంకిస్తోంది. పెళ్ళాం పిల్లలు అడిగినా ఏమీ చెప్పలేదు. ఒంట్లో నలతగా ఉండి సెలవు పెట్టానని మాత్రమే చెప్పాడు.

ఆ రోజు ఉదయాన్నే మొహం కాళ్ళూ చేతులూ కడుక్కుని బంగారమ్మ గుడి దగ్గరున్న హైస్కూల్ హెడ్ మాష్టారింటికి వెళ్ళాడు కిత్తన్న. ఆయనింటికి రోజూ పాలుపోస్తుంది కిత్తన్న పెళ్ళం.

కిత్తన్న ఇచ్చిన కాగితం తీసుకుని చదివిన హెడ్ మాష్టర్ ఒక్కసారే ఉలిక్కిపడి కిత్తన్న కేసి ఆశ్చర్యంగా చూసాడు.

"ఏరా కిత్తన్నా ! నీకీ విషయం తెలుసా?" ఆశ్చర్యంగా అడిగాడు హెడ్ మాష్టరు

"ఏమైందయ్యా ? ఏందాఇషయం?" అయోమయంగా అన్నాడు కిత్తన్న

"నిన్ను ఉద్యోగంలో నుండి సస్పెండ్ చేసారట కదరా. ఇదే ఆ కాగితం" అన్నాడు హెడ్ మాష్టరు. కిత్తన్నకి కాళ్ళ క్రింద భూమి కంపిస్తున్నట్టనిపించింది. తానేం తప్పు చేసాడని? ఎందుకు తనని సస్పెండ్ చేసారు? మనసులోనే అతలాకుతలం అయిపోయాడు కిత్తన్న

"నీ వలనే వంద దూడలు చనిపోయాయట కదరా. అంతే కాదు. గోశాలలోని దూడల మేత కోసం కొన్న ఎండు గడ్డి తవుడు వగైరా దాణా అంతా నువ్వు దూడలకు పెట్టకుండా అమ్మేసుకున్నావని, దేవుడికి కానుకగా వచ్చిన చిన్న లేగ దూడ లెక్కల్లో దొరకలేదని ఆ లేగదూడని కూడా నువ్వు ఎవరికో అమ్మేసుకున్నావని అంటున్నార్రా మీ అధికారులు. గోశాల్లో దూడల మూకుమ్మడి చావుకు నువ్వే కారణమని సస్పెండ్ చేస్తూ నీ మీద పోలీసు రిపోర్టు ఇవ్వడానికి పై అధికారుల అనుమతి కోసం రాస్తున్నట్టూ ఇందులో రాసార్రా కిత్తన్న. అంతే కాదు ఇదంతా ఈ రోజు పేపర్లలో కూడా రాసారు. ఇంకో విషయం తెలుసా? నువ్వు పట్టించావే దూడలు. వాళ్ళు నిర్ధోషులని కోర్టు కేసు కొట్టేసిందట. వాళ్ళు దూడల్ని కబేళా కోసమే కొని తీసుకుపోతున్నట్టు పోలీసులు నిరూపించలేకపోయారట. వెంటనే వాళ్ళు వేలం పాటలో పాడుకున్న దూడల్ని వాళ్ళకు అప్పగించాల్సిందిగా కోర్టు ఆర్డర్. దూడలు మూకుమ్మడి చావుకు కారకులైన వారి మీద చట్టపరమైన చర్యలు తీసుకోమని కూడా కోర్టు ఆర్డర్ జారీ చేసిందట. అదీ ఈ రోజే పేపర్లో వచ్చింది" ఏఈవో ఇచ్చిన ఆర్డర్ కాగితం మొత్తం చదువుతూ అన్నాడు హెడ్ మాష్టరు

కిత్తన్నకి నోట మాట రాలేదు. కళ్ళల్లో నీళ్ళు దించుకుంటూ నిలబడిపోయాడు.

ఇంతలో కిత్తన్న కూతురు పరిగెట్టుకుంటూ అక్కడకు వచ్చింది.

"అయ్యా... అయ్యా... నీ కోసం పోలీసులొచ్చారయ్యా. ఆళ్ళతో పాటు ఎవరో ముగ్గురు నలుగురు మామూలు మనుషులు కూడా వచ్చారయ్యా!" ఆయాస పడుతూ అంది కిత్తన్న కూతురు

కిత్తన్నకి ముచ్చెమటలు పట్టేసాయి.

"అయ్యా ! మేష్టరుగోరు. నానేటి తప్పు సేసానయ్యా.



# తెలుగు వెలుగు

- బి. గోవర్ధనరావు
9441968930

వేమన్న వెలుగుకు వందనం
తెలుగు పలుకుకు స్వాగతం

పద్యానికి పదును పెట్టి
ఆటవెలదని అదను చూపి
ప్రజల భాషకు పట్టం కట్టి
నిజాలను నిలువెత్తుగ నాటి
వున్న మాటను ఎలుగెత్తి చాటి

నవ యుగానికి నడక నేర్పి
యువతరానికి హితవు చెప్పిన ॥వేమన్న వెలుగుకు॥

హేతువాదంతో హెచ్చరించి
మనువాదానికి స్వస్తిపలికి
పండితులకు పథము చూపి
కవనమూర్తుల కళ్ళు తెరిపించి

వేషాలను విప్పిచూపి
మోసాలను ఎండగట్టి
సమాజాన్ని నిలదీసి
సమతను నిలబెట్టిన ॥వేమన్న వెలుగుకు॥

సంఘంలో కుళ్ళును కడిగేసి
అంతరాలను ఆవలకు నెట్టేసి
మూర్ఖులకు మంచిమాటలను చెప్పి
మూఢాచారాలను తుదముట్టించిన ॥వేమన్న వెలుగుకు॥

కులతత్వాన్ని చీల్చి చెండాడి
మతమౌఢ్యాన్ని మట్టి కరిపించి
వర్గ విభేదాన్ని వ్యతిరేకించి
వర్ణ విధానాన్ని పరిహసించిన ॥వేమన్న వెలుగుకు॥

శ్రమతత్వమే సఖ్యతనీ
మానవతయే నిత్యమనీ
మనిషితనమే ముఖ్యమనీ
అదియే సత్యమనీ - లోకానికి హితమనీ

చాటి చెప్పితివయ్యా
పద్యాల వెలుగలయ్యా ॥వేమన్న వెలుగుకు॥

మల్లెల మాటలతో
నిప్పుల తేటలతో
జానపదుల ఊటలతో
జనం మెచ్చిన పదాలతో

ఏం, పల్కితివయ్యా
ఎంత నిల్చితి వయ్యా
తెలుగుజాతి క్రాంతివయ్యా
జగమెరిగిన వేమనయ్యా
విశ్వదాభి రామయ్య వినుర వేమయ్యా ॥వేమన్న వెలుగుకు॥

---

పోలీసులెందుకయ్యా వొచ్చీసినారు" భయంగా హెడ్మాష్టారు కేసి చూస్తూ అడిగాడు కిత్తన్న. ఆయన కూడా అచేతనంగా నిలబడిపోయాడు. కిత్తన్నకి ఏం చెప్పాలో అర్థం కాలేదు.

కూతుర్ని తీసుకుని ఇంటికేసి పరుగులు పెట్టాడు కిత్తన్న

అప్పటికే కిత్తన్న ఇంటి ముందు వీధిలో వాళ్ళంతా గుమ్మిగూడి గుసగుసలాడుకుంటున్నారు. పోలీసులు, వాళ్ళతోపాటు ఏఈవో శ్రీనివాస్, వేలం పాటదారులు కనిపించేసరికి కిత్తన్నకి ముచ్చెమటలు పట్టేసాయి.

ఇంతలో ఒక పోలీసు లేగదూడని లాక్కొచ్చి వేలం పాటదారులకు అప్పగిస్తున్నాడు. రెండో పోలీసు కిత్తన్న దగ్గర కొచ్చాడు.

ఏఈవో శ్రీనివాస్ తన పనైపోయిందన్నట్టూ స్కూటర్ ఎక్కి వెళ్ళిపోయాడు.

అతని అంతరాత్మ మాత్రం మూగగా రోదిస్తూనే ఉంది.

తమని తాము రక్షించుకోవడానికి కిత్తన్నని బలిచేసామన్న నిజం అతన్ని నిలువునా అతలాకుతలం చేస్తూనే ఉంది.




# లిప్‌స్టిక్

ఎల్. శాంతి
7680086787

***కాలేజీ రిహార్సల్స్ రూం నుంచి ప్రగతి నెమ్మదిగా బయటకు వచ్చింది. అక్కడ్నుంచి ఏడ్చుకుంటూ పరుగు పరుగున హాస్టల్ రూంకు చేరుకుంది. మంచంపై బోర్లా పడింది. తలగడలో ముఖం దాచుకొని వెక్కివెక్కి ఏడుస్తోంది.***

ఏం చేశానని నాకింత అవమానం? నాకేమీ చేతకాదా? నా ముఖాన్ని శరీరాన్ని కూడా నేను అందంగా దిద్దుకోలేనా? పెదవిపై లేచింది ఎంగిలి కురుపా? లెక్చరర్లు, సిబ్బంది, ఫ్రెండ్స్, బాయ్స్ మొత్తం అందరి ఎదుటా అంతలేసి మాటలా? జరిగిన అవమానం మనసును తొలిచేస్తోంది. దు:ఖం పొంగుకొస్తోంది. గుండె బరువెక్కింది. ధారాపాతంగా కన్నీళ్లు జారుతున్నాయి. అమ్మ గుర్తుకొస్తోంది. అమ్మ ఒడిలో వాలిపోయి బోరున ఏడ్వాలనిపిస్తోంది.

♦

ప్రగతి వైజాగ్ సీతమ్స్‌లో ఇంజనీరింగ్ చదువుతోంది. చిన్ననాటి నుంచీ చదువులో, ఆటపాటల్లో ముందుండేది. బడిలో పోటీ ఏదైనా గెలుపు తనదే! మాస్టార్ల ప్రోత్సాహమూ ఉండేది. స్కూల్లో ఏ కార్యక్రమం జరిగినా ప్రగతి నోట వేమన శతకాలూ, జాషువా పద్యాలూ, దేశభక్తి గీతాలూ మారుమోగుతూ ఉండేవి. అమ్మ శారద చదువుకున్న గృహిణి. తండ్రి చిన్ననాడే చనిపోతే అన్నీ తానై ప్రగతిని సాకింది. అభ్యుదయ భావాలు గల ఇంట్లో పుట్టిన శారద డిగ్రీ వరకూ చదువుకొంది. ఊళ్లో బంధువుల మధ్య ఉన్నా, జరుగుబాటుకు లోటు లేకున్నా బిడ్డను హంగూ ఆర్భాటాలకు దూరంగా పెంచింది. ఊళ్లోని పిల్లలందరికీ ఉచితంగా ట్యూషను చెప్పేది. ప్రగతిని ఎప్పుడూ పదిమంది పిల్లలతో కలిపి సందడి వాతావరణంలో ఉంచేది.

ట్యూషన్‌కు వచ్చే పిల్లలకు శారద చదువుతో పాటు ఆటపాటలు నేర్పేది. కథలు చెప్పేది. జాతీయ పండగలప్పుడు ఆగస్టు 15, రిపబ్లిక్‌డే, గాంధీ జయంతి .. ఇలాంటి సందర్భాల్లో పిల్లల చేత ఇంటి ముందర మువ్వన్నెల జెండాలు ఎగురవేయించేది. దేశభక్తి గీతాలు నేర్పి మరీ పాడించేది. ప్రగతి అందర్లో ఒకతై ఉరకలెత్తే ఉత్సాహంతో పాటలు పాడేది. ఆటలాడేది. అమ్మతో ఆదివారం సాయంత్రాలు తమ పొలంలోకి వెళ్లేది. పొలం గట్లపై పరుగుల తీసేది. చింతతోపులో ఊయలలూగేది. వాళ్ల పొలం పక్కనే అల్లూరి సీతారామరాజు పార్కు ఉంది. అక్కడికెళ్లి పిల్లలంతా ఆటలాడేవారు. ఆ మన్యంవీరుడి గాథలను పిల్లలకు కథల్లా చెప్పేది శారద. ప్రగతి ఆ కథల్లో లీనమైపోయేది. అందుకే మన్యం ప్రజలకోసం పోరాడిన రామరాజంటే ప్రగతికి ఎంతో ఇష్టం.

పదో తరగతి వరకూ సొంతూరు కృష్ణదేవీపేటలోనే చదివిన ప్రగతి ఇంటర్లో నర్సీపట్నంలోని ఓ ప్రయివేటు కాలేజీలో చదివింది. అక్కడా అన్నింటా భేష్ అనిపించుకుంది. ఎంసెట్‌లో మంచి ర్యాంకు సాధించి విశాఖలో పెద్ద పేరున్న సీతమ్స్‌లో మెరిట్ కోటాలో సీటు సాధించింది. అక్కడ చేరాకే తొలిసారి అమ్మకు దూరంగా హాస్టల్లో ఉండాల్సి వచ్చింది. ఊరిని విడిచి ఉండడం కూడా అదే మొదటిసారి.

*వైజాగ్ ఫెస్ట్ 2017*
*పోటీలలో తృతీయ బహుమతి*
*గెలుపొందిన కథ*

♦♦♦

సీతమ్స్ కాలేజీలో నూటికి 80 మంది అంతా డబ్బున్నవాళ్ల పిల్లలు. హాస్టల్లో అమల, హారతి, ప్రగతి రూమ్మేట్స్. హారతికి అందం, ఆకర్షణల పట్ల ఆసక్తి ఎక్కువ. అమల అందుకు భిన్నం. మార్పులను గమనిస్తూ ఉంటుంది. తనకు నచ్చకున్నా

దేన్నీ గట్టిగా వ్యతిరేకించదు. హాస్టల్లో హారతి లాంటి పిల్లలే ఎక్కువ.

'ప్రగతీ.. అందం, తెలివీ.. ఉన్న నువ్వు .. మరీ బొమ్మలా ఆలోచిస్తావేంటి? ఓ లిప్‌స్టిక్ వేయవు. గోళ్ల రంగు పెట్టవు. అసలు ఈ కాలం అమ్మాయివేనా?' అనేది హారతి.

'నీలా మేం ఉంటే ఎంత క్రేజీనో తెల్సా..' అంటుండే వాళ్లు కావ్య, ఇతర క్లాస్‌మేట్స్.

'లిప్‌స్టిక్, మేకప్ అలవాటు లేదు. నా కిష్టం ఉండదు.' అనేది ప్రగతి.

♦♦♦

ఆ రోజు ఫ్రెషర్స్ డే. 'పాడుదమా స్వేచ్ఛాగీతం..' గీతాన్ని కాలేజీ వేదిక మీద పాడటానికి ప్రిపేరైంది ప్రగతి. తను వెళ్లటానికి తయారవుతున్నప్పుడు హారతి జుట్టు సరిచేస్తానని చెప్పి, నెమ్మదిగా ముఖానికి మేకప్ పౌడర్ అద్దింది. తను వద్దు వద్దు అంటుండగానే– పెదాలకు లిప్‌స్టిక్ రాసింది. 'అబ్బా ఎంత బాగున్నావో... అదిరిపోయావ్' అన్నారు ఫ్రెండ్స్. ఫ్రెషర్స్ డేకి ఇలాగే వెళ్లాలని బలవంతం చేశారు. ఒకసారి అద్దంలో తనను తాను తేరిపారా చూసుకుంది ప్రగతి. కొత్తగా అనిపించింది. పెద్దగా ఇష్టం లేకున్నా కాలేజీకి అలాగే వెళ్లింది.

'వావ్ ... చాలా స్పెషల్‌గా ఉన్నావు ఈ రోజు' అన్నారు అంతా. ప్రగతి స్టేజీపై మెరిసింది. చాలా ఉత్సాహంగా పాడింది. తన చురుకైన వ్యక్తిత్వంతో అందర్నీ ఆకర్షించింది.

క్రమంగా కాలేజీ వాతావరణం రంగుల ప్రపంచంలా తోస్తోంది. ఊరు వేరు. ఈ మెట్రో సిటీ వేరు. అమ్మ తరం వేరు. తమ తరం వేరు అనిపించటం మొదలెట్టింది ప్రగతికి. హారతి సహచర్యంతో తనలో చాలా మార్పు వచ్చింది. మొదటిగా లిప్‌స్టిక్ పూత మొదలు పెట్టింది. హారతితో పాటు తాను ఒక లిప్‌స్టిక్ కొంది. జుట్టును పొట్టిగా కత్తిరించింది. హైహీల్స్ కొనుక్కొంది. అడుగులు తడబడుతున్న ఎత్తైన చెప్పులతో కొత్త నడక మొదలుపెట్టింది.

కాలేజీ ఈవెంట్స్ వచ్చాయి. ప్రగతి రకరకాల ఈవెంట్స్‌తో పాటు ఫ్రెండ్స్ ప్రోత్సహించడంతో సరదాగా ఫ్యాషన్ షోకి కూడా పేరిచ్చింది. మొదటి ఎంపికలో చురుకైన కదలికతో.. మాటలతో.. అందమైన నవ్వుతో ఆకట్టుకుంది. కల్చరల్ వింగ్ కో ఆర్డినేటర్ జమునా మేడం దృష్టిలో పడింది. ఆమె సిటీలో వేరే సంస్థ ఆధ్వర్యాన త్వరలో జరగనున్న ఈవెంట్‌కి, మిస్ వైజాగ్ పోటీలకు కాలేజీ నుంచి ప్రగతి పేరును కూడా పంపించింది. ఆ విషయం తెలిసి ఫ్రెండ్స్ ప్రగతిని ఆకాశానికి ఎత్తేశారు. జమునా మేడం తన రూంకి పిలిచింది. 'ప్రగతీ, నీ కళ్లు చాలా చురుగ్గా ఉన్నాయి.. నవ్వు నేచురల్‌గా ఉంటుంది. కాస్త బొద్దుతనం తగ్గాలి. నడుము, చేతులు సన్నబడాలి. అక్కడ శ్రద్ధ పెట్టు. రోజూ జిమ్‌కు వెళ్లు. ఏం చేయాలో ట్రైనర్ జరీనాకి నేను చెబుతాను.' అంది.

'అలాగే మేడం' అంటూ మాటిచ్చింది ప్రగతి.

ఇప్పుడు తీవ్ర అవమానానికి, అంతులేని దు:ఖానికి అదే కారణం అయింది.

♦

వారం రోజుల క్రితం కాలేజీలో... కల్చరల్ మేడమ్ జమున నుంచి కబురు వస్తే వెళ్లింది ప్రగతి.

'ఏంటమ్మాయ్.. ఈవెంట్ దగ్గర పడుతోంది. నీలో ఆ సీరియెస్‌నెస్ కనిపించడం లేదు. ఈ రోజు జిమ్‌కు వెళ్లలేదట?' అని అడిగింది మేడం.

'ఉదయాన్నే స్పెషల్ క్లాసులు ఉండడం వల్ల వెళ్లలేదు మేడమ్..' అంది ప్రగతి.

'క్లాసులు ఉంటే ఏంటట? మిస్ వైజాగ్ పోటీలంటే ఆషామాషీ అనుకుంటున్నావా? ఈవెంట్ పూర్తయిన మర్నాడే పోటీలు. ఇది మన కాలేజీ ప్రెస్టేజ్ ఇష్యూ కూడా. నీకిచ్చిన ఇలాంటి అవకాశం కోసం ఎంతమంది చూస్తున్నారో తెలుసా నీకు?' అందామె కోపంగా.

'ఇకపై యూజ్‌లెస్ రీజన్స్ చెప్పకు. సీరియస్‌గా వర్కవుట్ చెయ్యి. నీ డ్రెస్ ఆల్‌రెడీ ఐడల్ మెజర్‌మెంట్స్‌తో రెడీ అయిపోయింది. దాంట్లో నువ్వు ఒదిగిపోవాలి. నడుం బాగా సన్నబడాలి. స్లీవ్‌లెస్ కదా చేతులు కూడా తగ్గాలి. జరీనాకు అన్నీ చెబుతాను. ఆమె చెప్పినట్టు విను' అంది.

'ష్యూర్ మేడమ్..' అంది ప్రగతి.

♦♦♦

ప్రగతికి టెన్షన్ మొదలైంది. 'ఏంటీ డ్రెస్ నాకు సరిపోవడం కాదా? నేనే ఆ డ్రెస్‌కి సరిపోవాలా? అందాల పోటీలు ఈ కాలేజీ ప్రెస్టేజ్ ఇష్యూనా? ఏదో సరదాగా ఈవెంట్‌కు పేరిస్తే ఇదేంట్రా బాబూ' అనుకుంది – మేడమ్ చెప్పిన ప్రకారం రోజూ

వాకింగ్ చేస్తోంది. జిమ్‌కు వెళ్తోంది. కొలత ప్రకారమే తిండి.. ఆశా, ఆందోళనతో కూడిన కలత నిద్ర. అద్దం దగ్గర గంటలకొద్దీ నిలబడుతోంది. ఫెయిర్ క్రీములు పూసుకుంటోంది. రోజూ నడుముకు కొలతలు వేసుకుంటోంది. ఫ్రెండ్స్ మధ్య ఎప్పుడూ అవే కబుర్లు నడుస్తున్నాయి. అమ్మకు రోజుకు నాలుగుసార్లు ఫోన్ చేసే ప్రగతి ఇప్పుడు నాలుగు రోజులకు ఒకసారి చేస్తోంది. అమ్మ ఫోన్ చేస్తే బిజీగా ఉన్నానంటోంది.

♦♦♦

మధ్యలో కల్చరల్ మేడమ్ కొలతలు వేసింది.

'పర్లేదు. కాస్త బెటర్. ఈవెంట్ వరకూ సరే ! కానీ.. 'మిస్ వైజాగ్'కి ఇలా అయితే కుదరదు. జరీనా నువ్వు చార్టు స్ట్రిక్టుగా ఫాలో అవ్వు.' అని ట్రైనర్‌కి చెప్పింది.

ప్రగతి శరీరం మీద జరీనా మరింత కేంద్రీకరించింది. ప్రతి రోజూ ప్రగతి పేరు స్థానంలో అన్నీ కొలతలు.. అవయవాల పేర్లు. ఫిగర్ .. ఫిగర్ ...ఇవే వినబడుతున్నాయి.

ఇదంతా కాస్త ఇబ్బందిగానే అనిపిస్తోంది ప్రగతికి. మొదట్లోలా ఉత్సాహం లేదు. కానీ, ఉత్సాహంగా ఉన్నట్టే, ఆసక్తి ఉన్నట్టే పరుగులు పెడుతోంది. చదువు ధ్యాస ఎప్పుడో పక్కకిపోయింది. తనకు తెలియకుండానే తనను మొత్తం ఈవెంటే ఆక్రమించేసింది.

పొద్దున లేవగానే పరుగో పరుగు. నిద్ర లేచిన దగ్గర నుంచి ఒంటిని అక్కడక్కడ తడిమి చూసుకోవడం... తిన్నా, తాగినా, పడుకున్నా ఏదో భయం భయం.. కాస్త బుగ్గలు కనిపిస్తే ఆందోళన.. అయినా, జరీనా చెప్పినట్టే చేస్తోంది. గీచిన గీత లోపలే పరిభ్రమిస్తోంది. ప్రగతికి క్రమంగా ప్రశాంతత దూరమైంది. లిప్‌స్టిక్ పూసిన ఆమె పెదవులపై స్వచ్ఛమైన నవ్వులేదు. ముఖంలో మునుపటి కాంతి లేదు. రోజువారి జీవితం దేని కోసమో పరుగులు తీస్తున్నట్టుగా ఉంది. గమ్యం అయోమయంగా ఉంది. ఈవెంట్‌కు ఇంకా రెండు రోజులే టైముంది. మిస్ వైజాగ్‌కు మూడు రోజులే సమయం మిగిలి ఉంది.

♦♦♦

ఆ రోజు ప్రగతికి రాత్రంతా నిద్ర రాలేదు. రెప్పపడలేదు. కానీ, ఉదయానికి కళ్లు తెరవలేదు. జ్వరంతో ఒళ్లు కాలిపోతోంది. హారతి, అమల కంగారు పడ్డారు. కాలేజీ డిస్పెన్సరీకి తీసుకెళ్లారు. డాక్టర్ మెడిసిన్ ఇచ్చారు. ప్రగతి ఆ రోజంతా లేవలేకపోయింది. రూమ్మేట్స్ దగ్గర ఉండి టాబ్లెట్స్ వేశారు. రెండో రోజు ఉదయమూ జ్వరంగానే ఉంది. వేడికి పెదవి మీద కురుపులు లేచాయి. నడవలేనంత నీరసం.. అప్పుడే.. ఉన్న ఫళాన రిహార్సల్ రూంకి రమ్మని కల్చరల్ మేడమ్ నుంచి కబురు...

నెమ్మదిగా లేచి రెడీ అయి వెళ్లలేక వెళ్లింది ప్రగతి. హారతి, అమల వెంట తోడుగా వెళ్లారు.

రిహార్సల్స్ రూమంతా హడావిడిగా ఉంది. ఈవెంట్‌కు ఒక్కరోజే సమయం ఉండడంతో విద్యార్థులంతా వివిధ రకాల ఈవెంట్స్‌కి గ్రూపులు గ్రూపులుగా ప్రిపేర్ అవుతున్నారు. లెక్చరర్లు, డాన్స్ మాస్టర్లు ...అందరితో హాల్ కిట కిటలాడుతోంది.

అప్పుడే డీన్ రూమ్ నుంచి రిహార్సల్స్ హాల్‌కి వస్తోంది జమునా మేడమ్. ఆమె ముఖం అసహనంగా ఉంది.

'ప్రగతి ఏంటి నీ తీరూ? అవతారం ? నిన్నా, ఈ రోజూ జిమ్‌కి వెళ్లలేదట..' అంది కోపంగా.

ఆమె ప్రగతి ముఖం వైపు చూడడం లేదు. నడుము వైపే చూస్తోంది. నీరసం గురించి పట్టించుకోలేదు. లావు గురించే ఆలోచిస్తోంది. అంత మందిలో మేడమ్ గొంతు పెంచి మాట్లాడుతుండడం ప్రగతికి గాబరాగా ఉంది.

'నిన్నటి నుంచి ఫీవర్ మేడమ్..' చిన్నగా చెప్పింది ప్రగతి

'ఫీవరు నీకు కాదు .. నిన్ను సెలెక్టు చేసినందుకు నాకు వస్తోంది. డీన్ పిలిచి ఇప్పుడే చీవాట్లు పెట్టారు. నీకు చీమ కుట్టినట్టు లేదు. చూడు ప్రగతీ... ఈవెంటు, 'మిస్‌వైజాగ్' రెండూ మన ముందున్నాయి. మేము పడుతున్న హైరానా చూశాకైనా పరిస్థితి నీకు అర్థం కావడం లేదా? ఈ ఈవెంటులో, మిస్‌వైజాగ్ పోటీల్లో మనం మెరుస్తాం అనుకున్నాను. నువ్విప్పుడు దేబిరి ముఖం వేసుకొని వస్తే నేనేం చేయాలి? అసలు జ్వరం వస్తే రూమ్‌లో ఎందుకున్నావు? వెంటనే హాస్పటల్లో చేరాలి కదా.. ఏం మాట్లాడవేం?" మేడమ్ దాదాపుగా అరుస్తోంది.

ఆమె మాటల ధాటికి ప్రగతి కళ్లు తడిసిపోతున్నాయి. కాళ్లు వణుకుతున్నాయ్.

'మేడమ్ .. ఈవెంటుకు నేను ప్రిపేరవుతున్న క్రమంలోనే ఫీవర్ వచ్చింది. నిన్న ఉదయానికి నా స్థితి నాకే తెలియదు. ఫ్రెండ్సే అన్నీ చూసుకున్నారు. నాకసలు బాగోలేదు మేడమ్.. పెదవి పుండు పడింది. చూడండి.. నేను డ్రాపైపోతాను. సారీ..మేడమ్' అంది ప్రగతి ప్రాధేయపూర్వకంగా.

అంతే! ఆ మాట విన్నాక..

జమునా మేడమ్ కోపంతో ఊగిపోయింది.

'ఏంటీ..! డ్రాపైపోతావా? నీకసలు మతి ఉండే మాట్లాడుతున్నావా?' మేడమ్ ఒక్కసారిగా గట్టిగా కేకవేసింది. కళ్లు పెద్దవిచేసింది.

రిహార్సల్స్ రూమంతా ఒక్కసారిగా సైలెంట్ అయిపోయింది. అంతా ప్రగతి వైపు తిరిగారు. గుమిగూడారు.

మేడం ఆపడంలేదు. "అసలు ఎందుకు ఒప్పుకున్నావు ఈవెంటుకి, అందాల పోటీలకీ ? నువ్వేదో పెద్ద అందగత్తెవనుకుంటున్నావా? నిన్ను సెలెక్టు చేయడం నాదే తప్పయింది. చిట్టచివర్లో ఇప్పుడు డ్రాప్ విషయం డీన్‌కి తెలిస్తే ఇంకేమైనా ఉందా? అసలు మూతి మీద లేచింది జ్వరం కురుపేనా? ఎంగిలి కురుపా? అడ్డమైన వేషాలూ వేస్తే ఇలాగే ఉంటుంది.

ఏం చేతనౌను నీకు? నీ ముఖాన్ని, నీ శరీరాన్ని కూడా నువ్వు అందంగా దిద్దుకోలేవూ? ఛీ.. ఎంత పనిచేశాను. నిన్ను నమ్మడం నాదే బుద్ధి తక్కువ .. అంతా తారుమారైంది, గెటౌట్.. ఐసె.. గెట్ ఔట్ .." తీవ్ర స్వరంతో అరిచింది.

క్లాస్‌మేట్స్ అబ్బాయిలు, స్టూడెంట్స్, లెక్చరర్స్ అంతా తనముఖంలోకే చూస్తున్నారు. ప్రగతి బిక్కచచ్చిపోయింది. నిలువెల్లా నీరైపోయింది. సిగ్గుతో, బాధతో చుట్టుకుపోయింది. దు:ఖాన్ని దిగమింగుకొని, లేని బలం తెచ్చుకొని ..నెమ్మదిగా రిహార్సల్స్ రూం నుంచి బయటకు వచ్చింది. హాస్టల్ రూమ్‌కి పరుగు తీసింది. మంచం పై బోర్లా పడి, వెక్కివెక్కి ఏడ్చింది.

◆◆◆

ప్రగతికి దు:ఖం ఆగడం లేదు.

ఏదో సరదాగా ఈవెంట్‌కి అప్లైచేస్తే, అనుకోకుండా జ్వరం వస్తే ఇంత రాద్ధాంతమా? అందరి ముందూ అంతలేసి మాటలా? నేనేం తప్పుచేశాను. ?" అనుకుంది. అమ్మ గుర్తుకొచ్చింది. 'లేదు.. నేనే తప్పు చేశాను. నేను నాలా ఉండలేకపోయాను.. అమ్మా! నేను నువ్వు దిద్దిన ప్రగతిలా ఉండలేకపోయానమ్మా.. అందుకే ఇలా.. సారీ అమ్మా .. సారీ..' అనుకుంటూ కన్నీళ్లు తుడుచుకుంటూ పైకి లేచింది. అద్దం ముందుకు వెళ్లింది. పెదవిపై నొప్పి పెడుతున్న కురుపును చేతితో సుతారంగా ఒత్తుకుంది. టేబుల్ డెస్క్‌ను తెరిచింది. అందులోని రంగు రంగుల లిప్‌స్టిక్స్‌ను బయటకు తీసి.. విసిరి కొట్టింది. మేకప్ పౌడర్లను అవలికి విసిరేసింది.

ఆ వెంటనే మంచంపై వెల్లకిలా పడింది. 'అమ్మా! ఒక్కసారి కనబడవూ..' అనుకుంటూ ఏడుస్తూ నిద్రలోకి జారిపోయింది.

◆◆◆

'ప్రగతీ ..అమ్మ! అమ్మ వచ్చింది లే..లే.. అని ఫ్రెండ్స్ చెబుతుంటే కలేమో అనుకొంది. కాదు; నిజమే! అమ్మ వచ్చింది. ప్రగతి లేవలేని స్థితిలో ఉండడం వల్ల శారదను హాస్టల్లోకి అనుమతించారు వార్డెన్.

అమ్మా! ..అంటూ ఒక్క ఉదుటున పైకి లేచింది ప్రగతి. ఎన్నో ఏళ్ల తరువాత చూసినట్టుగా తల్లిని గట్టిగా చేతులతో చుట్టేసింది. వెక్కి వెక్కి ఏడ్చింది. ఏడుస్తూనే ఉంది. బిడ్డను ఈ స్థితిలో చూసి శారద గుండె తరుక్కుపోతోంది. చెంగు చెంగున గెంతులేసే నా ప్రగతి.. నా బంగారు తల్లేనా ? ఇలా.. ఈ రోజు ముఖం పీక్కుపోయి, కళ్లు ఉబ్బిపోయి.. చిగురుటాకులా వణికిపోతోంది అనుకుంటూ.. వెన్ను తడుతూ బిడ్డను గట్టిగా పొదివి పట్టుకుంది.

◆◆◆

సూర్యుడు అలల పల్లకిలోంచి నెమ్మదిగా ఆకాశ రథం ఎక్కుతున్నాడు. ఉదయ ప్రశాంతత అంతటా అలముకొని ఉంది.

ఆర్‌కె బీచ్ ఇసుక తిన్నెల్లో కూర్చున్నారు ఆ ఇద్దరూ. అమ్మ ఒడిలో తల పెట్టుకొని పడుకొని ఉంది ప్రగతి.

'అమ్మా, అయాం సారీ అమ్మా.. తప్పు చేశాను. నేనసలు అలా ఫ్యాషన్ షో ఆలోచనలోకి వెళ్లి ఉండాల్సింది కాదు.. సరదాగా అనిపించింది తొలుత. తరువాత

బిగుచుకుపోతున్నట్టు, ఊపిరి ఆడనట్టు అనిపించింది... వాళ్లు రాద్ధాంతం చేశారు.' అంటూ కంటతడి పెట్టింది.

'కన్నా .. ఊరుకో! ఇందులో నీ తప్పేం లేదు. మన చుట్టూ ఉన్న వాతావరణంలో ఉంది. మీ కాలేజీలో ఉంది.' అని ఊరడించింది అమ్మ.

'అదిగో.. అటు చూడు... దూరంగా పడవపై జాలర్లు అలలపై ఊగిసలాడుతూ వేటాడుతున్నారు... ఆ ఒడ్డున ఆడవాళ్లు చేపలు ఆరబోస్తున్నారు. ఆ పక్కన చూడు.. బీచ్‌లో రాత్రంతా వేలాది జనం తిని పడేసిన జొన్నపొత్తులు, కాగితాలూ, ఇతర తొక్కునంతా ఆ మున్సిపాలిటీ సిబ్బంది, ఆ మహిళలు ఒక్కక్కొటీ చేత్తో ఎలా ఎత్తుతున్నారో. కాసేపట్లో ఈ బీచ్‌ని మళ్లీ జనం ఆటపాటలకు అనువుగా అందంగా ఎలా సిద్ధం చేస్తున్నారో..

అందం అంటే ఏంటి ప్రగతీ..? ముఖం, మెడ, కాళ్లూ చేతులు, శరీర భాగాలూనా? కాదమ్మా. మంచి మనసు. మనం బాగుంటూ అందరూ బాగోవాలని మనం చేసే శ్రమ, మనం పడే తపన. అలా చూసినప్పుడు ఈ బీచ్‌ను ప్రతిరోజూ సుందరంగా తీర్చిదిద్దుతున్న ఆ శ్రామిక మహిళల కన్నా సౌందర్యవంతులు ఎవరుంటారు? ప్రాణాలకు తెగించి బిడ్డల పోషణ కోసం ప్రతి రోజూ సాగరానికి ఎదురీదుతున్న ఆ జాలర్ల కంటే సాహసవంతులు ఎవరుంటారు? మన చుట్టూ ఉన్న లోకం స్వచ్ఛంగా ఉండేది శ్రామికుల కారణంగానే. కాలం ముందుకు నడిచేది వారి వల్లే కానీ మేకప్పు పూతల వల్లా, మిస్ యూనివర్సుల వల్లా కాదు కదా. ఇప్పుడు అందం అనేది ఒక ఎర. ఒక వ్యాపారం. ప్రపంచం మొత్తమ్మీద నడుస్తున్న ఓ వ్యూహాత్మక ఎత్తుగడ. ఈ ఫ్యాషన్ షోలు అందుకే. ఈ అందాల పోటీలూ అందుకే. నీలాంటి అమ్మాయిలు చాలా మంది ఆ ఉచ్చులో చిక్కుకుపోతున్నారు. నాకు నిన్ననే అమల జరిగిందంతా చెప్పింది. నీ స్థితిని తలచుకొని నిన్ననే బయల్దేరి వచ్చాను. నువ్వు బాధపడాల్సిన అవసరంలేదు. ఆ ఈవెంట్లు, ఆ పోటీల నుంచి వైదొలగి చాలా మంచిపని చేశావు. ఎంపికై ఉంటే నీ ఆలోచనలు వేరుగా ఉండేవేమో! ఏడవకు బంగారం... అంతా మనమంచికే. నీలాంటి పిల్లలు గట్టిగా మాట్లాడాలి. ఇలాంటి అర్థం లేని ఈవెంట్లు, అందాల పోటీలు కాలేజీల్లో ఎందుకని నిలదీయాలి. మా తరంలో మేం చాలా అన్యాయాలపై అలా చేశాం. అనవసరపు ఆందోళన వద్దు. ధైర్యంగా ఈ రోజే క్లాస్‌కి వెళ్లు. ఆరోగ్యం జాగ్రత్త. వెక్కిరించే వాళ్లకు నీ మాటలు కాదు నడవడికే సమాధానం కావాలి? గుర్తుంచుకో" అని చెప్పింది శారద. అలా వాళ్లు చాలాసేపు మాట్లాడుకుంటూ గడిపారు. తేలికపడిన హృదయంతో.. మనసు నిండా కొత్త బలం నింపుకుంది ప్రగతి. అమ్మను గట్టిగా వాటేసుకొని వీడ్కోలు చెప్పింది. ఆటో ఎక్కి బస్టాండు వైపు వెళుతున్న అమ్మను చూస్తే తనలో ధైర్యాన్ని నింపి వెళుతున్న సముద్రంలా అనిపించింది.

◆◆◆

ఆ రోజు సాయంత్రం కాలేజీలో ప్రతి క్లాసుకూ ఒక సర్క్యులర్ వెళ్లింది. ఫ్యాషన్ షో ఈవెంట్‌ను రద్దు చేస్తున్నామని, మిస్ వైజాగ్ పోటీల నుంచి కళాశాల వైదొలుగుతోందని దాని సారాంశం. సాయంత్రం అమ్మకు చాలా హుషారుగా ఫోను చేసింది ప్రగతి.

'అమ్మా.. నీకో గుడ్‌న్యూస్. మేం పోట్లాడకుండానే మా కాలేజీ మేనేజ్‌మెంటు ఫ్యాషన్ షోను కేన్సిల్ చేసింది.' అంది.

'అవునా.. మీ తరం వాళ్లు పోరాడకపోతే మీ అమ్మతరం వాళ్లు పోరాడి ఉండొచ్చు కదా..' అంది నవ్వుతూ శారద. 'నిన్న నిన్ను కలవడానికి ముందు కాలేజీకి వెళ్లాను. ప్రిన్సిపాల్‌ని, డీన్‌ని కలిసి, ఫ్యాషన్ షోల సంస్కృతిపై గట్టిగా నిలదీశాను. అప్పుడే వాళ్లు సందిగ్ధంలో పడ్డారు. అక్కడ ఉన్న లెక్చరర్లు కొందరు నా మాటలను సపోర్టు చేశారు కూడా. అప్పుడే అనిపించింది నాకు; ఇలాంటి నిర్ణయం వస్తుందని. అలా రాకపోతే ఏం చేయాలో కూడా నా ఫ్రెండ్స్‌తో నిన్నే మాట్లాడాను కూడా..' అంది అమ్మ.

'మీ తరం వాళ్లు చాలా గ్రేట్ అమ్మా ... తప్పుని అసలు సహించరు. ధైర్యంగా అడుగుతారు.' అంది ప్రగతి, సంతోషపడిపోతూ.

'లేదురా.. మీరు ఇంకా చాలా గ్రేట్.. మీకు అవకాశాలు చాలా పెరిగాయి. స్వేచ్ఛా, స్వతంత్రతా చాలా వచ్చాయి. ఎక్కడ ఏం జరిగినా చాలా వేగంగా తెలుస్తోంది. చేయాలి అనుకుంటే మీరు చాలా చేయగలరు. మంచికోసం మాట్లాడండి. పోట్లాడండి.. ' చాలా ఆశాభావంతో అంది అమ్మ.

'అవునమ్మా .. అవును..' సాలోచనగా అంది ప్రగతి

అమ్మ మాటల్లోంచి ఏదో కర్తవ్యం, బాధ్యత, ధైర్యం అందినట్టుగా...

# ఉత్తమ కథ

- కనుపర్తి వరలక్ష్మమ్మ

06.10.1896 - 13.10.1978



తొలితరం రచయిత్రి
సంఘ సేవకురాలు

**"రాజేశ్వరీ! మీ కథలు ఏం బాగుంటాయండీ అని అంటూనే ఉన్నావు. వాటిమీద దిన దినమూ ప్రశంసా పూర్వక విమర్శలు పత్రికల్లో వెలువడుతూనే ఉన్నవి" అంటూ లోపలికి వచ్చాడు రాఘవరావు టౌన్ హాలు నుండి. రాజేశ్వరి అందుకు బదులేమీ చెప్పకుండ నవ్వి వూరుకుంది.**

"మధుర భారతి పత్రిక ఇప్పుడే టౌన్‌హాల్లో చూచి వచ్చాను. దానిలో నా కథా సంపుటిపై ఎటువంటి విమర్శక వ్యాసం పడ్డదనుకున్నావు! నా కెరుక లేని శిల్పమూ, సౌందర్యమూ, మధురిమా నా కథల్లో ఉన్నదని సోదాహరణంగా యెత్తి చూపాడా విమర్శకుడు" అన్నాడు రాఘవరావు మురుస్తూ.

" ఆ విమర్శకుడెవరు? మీ స్నేహితుడే గాదూ!" అన్నది రాజేశ్వరి కొంచెం పరిహాసంగా నవ్వుతూ.

"ఎబ్బే! స్నేహితుడు గాడు."

"పోనీ మీ మిత్ర మండలి సభ్యుడా?"

"ఏమో తెలియదు"

"పూర్తిపేరు రాయలేదు. పో.నూ. అని పొడి అక్షరాలున్నాయి."

"మీ స్నేహితుడు కాకుండ ఉండడు. బాగా జ్ఞాపకం చేసికోండి"

"సరి సరి. ఇంకా అంత మతిమరపు రాలేదు., బహుశా అతడు నా స్నేహితుడై ఉండడు."

"అదిగో బహుశా అంటున్నారే. ఏదో దూరపు స్నేహితుడై ఉండొచ్చు."

రాఘవరావు ఫక్కున నవ్వి 'బంధువుల్లో దూరపు వాళ్ళనీ, దగ్గర వాళ్ళనీ అనటం యెఱుగుదుం కాని స్నేహితుల్లో ఈ మాట నీ దగ్గరే వింటున్నాను."

"ఒకవేళ మీ క్లాసుమేటేమో ఆలోచించారా?"

"ఎందుకింత తీవ్ర శోధన? ఎవరైతేనేమీ?"

"మీ మీద ప్రశంసాత్మక వ్యాసం వ్రాసేవాళ్ళు తప్పక మీ స్నేహితులై ఉండవలెగదా యని."

"విమర్శకు మిత్రులే కావలెనా?" వస్తువు నాణ్యమైందయితే యెవరైనా బాగున్నదంటారు."

"కానప్పుడు?"

"ఓ ఇదా నీ అనుమానం! మా స్నేహితుల్లో రంధ్రాన్వేషణ పండితులే ఎక్కువ. బాగాలేని దాన్ని బాగా ఉన్నదని వాళ్ళు యెన్నటికీ అనరు."

"అది ఇతరుల నెఱసు లెన్నడంలోనేమో గాని, మీలో మీకు గాదు."

"మాలో మేము విమర్శించుకోమా?"

"మీ మిత్రమండలి వారు మంచి కలిసి కట్టుతనం కలవారు. ఒకరి నొకరు ఆదుకోవడం మీ సఖ్యరీతి!".

"అంటే....!

"మీలోనే ఒకరు గ్రంథం రాయడం, ఇంకొకరు పీఠిక రాయడం, మరొకరు దానిని పత్రికా ముఖాన ప్రశంసించడం

– దానినెవరైనా పొరపాటుగా అంటే వేరొకరు వారిని గట్టిగా మందలించడం – ఆ విధంగా జయించుకొస్తున్నారు. యెంతెంత వారనీ మీరు. మొత్తం మీద మీ కలిసికట్టుతనానికి ముచ్చట అవుతున్నది."

"అయితే మా రచనలు బాగా ఉండకపోయినా మా ప్రచారం వల్లనే వ్యాప్తికి తెస్తున్నామని నీ అభిప్రాయమా?"

"మీకు బాగానే ఉంటాయిలెండి. మీవి మీకే బాగుండకపోతే ఇంత అట్టహాసం ఎందుకు చేస్తారు? ఇతరుల బాగోగుల పరిశీలనతో మీకు నిమిత్తం లేదు. మీ మిత్రమండలి ప్రచురించే పుస్తకాలు, పీఠికలు, అభిప్రాయాలు, విమర్శలు అన్నీ చూస్తూ ఉంటాము కాదా! ఆ పరిచితమైన పేర్లే తప్ప క్రొత్తవి కన్పడవు. ఇవ్వాళ మీ మధుర కథా సంపుటిపై వారు ప్రశంసా వాక్యాలు కురిపిస్తే, రేపు వారి కన్నీటి కెరటాలపై మీరూ... మొత్తం మీద ఒకరి రచనల కొకరు వంధిమాగదులు కావడం మీ పద్ధతి."

"మా నవీన రచయితలను నీ వింత నవ్వుటాలు పట్టిస్తున్నావు గాని మేము కలం పట్టిన తర్వాతనే వ్యవహార భాషకూ, గేయ కవితకూ, భావ గీతాలకూ, కథా రచనకూ చక్కని బాట యేర్పడ్డది. నేడు కథకూ, గీతానికి చోటివ్వని దినపత్రికగాని, వారపత్రిక గాని, పక్షపత్రిక గాని, మాసపత్రిక గాని, వార్షిక పత్రిక గాని ఒక్కటైనా ఉన్నదేమో చూపగలవా? ఇది మా నవ్య సాహితీపరుల పరిశ్రమా ఫలితమని చెప్పుకొని గర్వింపవలసిన విషయమేనంటావా? కాదంటావా?".

ఈ మాత్రానికి గర్వించవలసిన విషయం ఏమీ లేదు. కథా వాఙ్మయం గాని, గేయ వాఙ్మయం గాని ఆంధ్ర భాషా వధూటికి సరిక్రొత్త సొమ్ములు కావు. భట్టి విక్రమార్కుడి కథలు, కాశీ మజిలీ కథలు, పంచతంత్ర కథలు, పన్నిద్దరు రాజుల కథలు అంటూ ఎన్నెన్నో కథలు ఆనాది నుంచీ మనదేశంలో వాగ్రూపకంగాను, గ్రంథస్తంగాను గూడ వాడుకలో ఉన్నవే. ఇక మా జోల పాటలు, దంపుళ్ళ పాటలు మున్నగు పాటలలో ఉన్న మాధుర్యం ఏ భావ కవితకూ తీసిపోదు గదా! మానవులకు కథా ప్రియత్వం సహజ సిద్ధం. మన చిన్నవాడు చూడండి, కథంటే యెంత చెవి కోసుకుంటాడో! కథ చెపుతానంటే చాలు అదేమి చిత్రమో ఎంత ఏడ్పు మానుతాడో. అభము శుభము ఎరుగని పసిబిడ్డకదా వాడికెందుకు కథంటే అంత ప్రేమ? పిల్లలే గాదు పెద్దవాళ్ళకూ కథంటే ప్రాణమే. మొన్న మా సమాజ భవనంలో బాలికా సమ్మేళనం జరిపి పిల్లలకు చెప్తూ ఉంటే పెద్దవాళ్ళు కూడా చెవులు దోరగిల పెట్టి విన్నారు. ఎంతో శ్రద్ధతో, అందుకనే కథా ప్రియత్వం మానవులకు సహజ సిద్ధమంటున్నాను. కనుక తెలుగు వారికి ప్రీతి మేము కలుగ చేశామని జెబ్బలు చరచుకుంటే మేము ఒప్పుకోము. అసలు బిడ్డలకు వలెనే కథలకు కూడా మాతృత్వం మాది" అన్నది రాజేశ్వరి సగర్వంగా.

ఆ మాట విని రాఘవరావు పకపకా నవ్వి "ఇప్పటికి గుట్టు బయట పడింది. ఎన్ని మెలికలు తిప్పినా యే యొక్క గౌరవమూ మీ సంఘానికి చెందించాలని చూస్తావు. పాపం నీ జాత్యభిమానం అసమానం" అన్నాడు.

"అయితే నేను చెప్పింది అబద్ధమంటారా? నిజం ఆలోచించండి. మీ శైశవంలో మీకు కథా ప్రీతి కలిగించింది మీ తల్లిగారు. నాకు కల్గించింది మా అమ్మ. నేనూ, మీరూ అనేమిటి? లోకంలో ప్రతి తల్లి, ప్రతి బిడ్డకు కథా బోధ వల్లనే లోక జ్ఞానం కలుగజేస్తున్నది. కనుక మీరెంత నవ్వినా సౌధానికి పునాది మాది. వృక్షానికి బీజావాసన మాది."

"సరే సరే కాని. నీవు యేదో తిప్పలు పడి మీ స్త్రీ సంఘానికి అధిక్యత కలిగించాలని ప్రాకులాడుతుంటే నేనెందుకు కాదనాలె. నీవే కాదులే, ఇప్పుడు మతాలవారేమి, కులాలవారేమి, వృత్తులవారేమి అందరూ ఇదే పద్ధతి, ఏ పాత పురాణాల్లో పెళ్ళగించి ఏదో ఒక గౌరవం తమ సంఘానికి చెందించవలెనని పాట్లు పడుతున్నారు. అట్లాగే నీవూ!"

"చెప్పింది సత్యమైనా అంగీకరించకుండ మనుష్యులను డీలా చేయడంలో మీకున్నంత నేర్పు యెవ్వరికీ లేదు."

"నా కథలు బాగున్నవని లోకమంతా పొగడుతూ ఉంటే నీవు బాగున్నాయని ఒప్పుకుంటావా?"

"ఓహో! అందుకు బదులా ఇవి? మీ కథలు బాగున్నాయని అంగీకరించటానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఏదో చాకచక్యంగానే రాస్తారు. కాని ఉత్తమ శ్రేణికి చెందటానికి తగిన లక్షణాలు మీ కథలకింకా తక్కువే అని నా అభిప్రాయం. ఉండవలసిన లక్షణాలన్నీ లేనప్పుడు సర్వాంగ సుందరంగా ఉందని ప్రశంసించడం నా చేతగాదు సుమండి. అయినా మీ కథలను బాగా విమర్శింపజేసి లోపాలు తెలుసుకుంటే మీకు లాభం గాని బలవంత పెట్టి బాగున్నాయనిపించుకుంటే ఏమి ప్రయోజనం చెప్పండి?" అన్నది రాజేశ్వరి.

ఇంతలో వంటమనిషి సుబ్బమ్మ వంట ఇంట్లోంచి వచ్చి మెల్లగా, ''అమ్మగారూ!'' అన్నది ''అవునండోయ్ మరచిపోయినా, మనం త్వరగా భోజనాలు కానివ్వాలి. ఇవ్వాళ సుబ్బమ్మ కనకతార చూడడానికి పోతానని పెందలాడే వచ్చి వంట చేసి మీ కోసం కనిపెట్టుకొని కూర్చున్నది. మనం త్వరగా భోజనాలు చేస్తేనే గాని ఆమె పని అయి రెండో ఆటకు అందుకోలేదు" అన్నది రాజేశ్వరి.

"ఏముందా కనకతారలో? డబ్బిచ్చి యేడ్పు కొని తెచ్చుకోవడమేగా. ఊఁ. సరే. వడ్డించమను వస్తున్నా" అన్నాడు రాఘవరావు. రాజేశ్వరి దోడ్లోకి పోయి పెనిమిటికి కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు తెస్తూ "సుబ్బమ్మా! నాకూ వడ్డించు. నీకు పని త్వరగా తెములుతుంది" అన్నది.

సుబ్బమ్మ ఇద్దరికీ వడ్డించడానికి వెండి పళ్ళేలు పెట్టి గ్లాసులు పెట్టింది. రాఘవరావు కాళ్ళు కడుక్కుని ఉతికి ఆరవేసిన చెంగావి పంచె తువ్వాలు భుజాన వేసికొని భోజనాల ఇంట్లోకి వచ్చాడు. అతని వెనుకే రాజేశ్వరి కూడ వచ్చింది.

"పిల్లలు అన్నాలు తిన్నారా యేమిటి?'' అన్నాడు రాఘవరావు.

"అవును వాళ్ళకు వంటకాగానే పెట్టేశాను. తిని నిద్రపోయినా"రన్నది రాజేశ్వరి.

భోజనాలు త్వరగా ముగించాలనుకుంటూ ఉండడం చేత భోజనాల వద్ద మాటలు పెట్టుకోకుండా త్వరగా తిని లేచారు. రాఘవరావు రాజేశ్వరి. భోజనానంతరం రాజేశ్వరి కూరలు వగైరాలు సర్దుకుంటూ ఉంటే రాఘవరావు వరండాలో పచార్లు చేస్తున్నాడు. సర్దుబాటు పూర్తి చేసి రాజేశ్వరి తమలపాకుల పొందాను తీసుకుని సావిట్లోకి వచ్చేసరికి రాఘవరావు గూడ పచారు ముగించి సావిట్లోకి వచ్చి పడక్కుర్చీలో విశ్రమించాడు. ఇంతలో ఆదరా బాదరా తాను కూడా అన్నం తిని వెండి కంచాలు తెచ్చి రాజేశ్వరికి యెదురుగా గోడకానించి పెట్టి, పాలకుండ తెచ్చి నడవాలో పెట్టి, ఇల్లు కడిగి తలుపులు వేసి వచ్చి. "అమ్మగారూ! నేను వెళ్ళుతున్నాను. పాలు వేడిగా ఉంటే నడవాలో పెట్టాను. కొంచెం తాళి తోడు వేసికోండి" అన్నది. "సరే వెళ్ళు, ఇదిగో, ఈ పావలా తీసుకుపోయి టికెట్టు కొనుక్కో, వేళైంది త్వరగా వెళ్ళు" అంటూ సుబ్బమ్మను పంపించింది రాజేశ్వరి.

సుబ్బమ్మ వెళ్ళగానే రాఘవరావు, రాజేశ్వరి వంక చూచి "రాజేశ్వరీ! ఇందాక నా కథల్లో లోపాలేమిటో వెల్లడిస్తానంటివే, ఏదీ కొంచెం వెల్లడించుదూ..." అన్నాడు.

"ఏదో తమాషా కంటే అదే మాట పట్టుకున్నారేమిటి?"

"తమాషా యేమిటి? నే నొప్పుకోను. విమర్శింపజేసి లోపాలు తెలిసి కోవడం ప్రయోజనమని నీవు చెప్పుతున్నప్పుడు ఆ ప్రయోజనం అర్ధాంగ లక్ష్మివైన నీవే కలుగజేస్తానంటున్నప్పుడు, ఆ అవకాశం నేనెందుకు పోగొట్టుకోవాలి?"

"నేను ఒక్క మీ కథల మాటే చెప్పలేదు సుమండి. మొత్తం మీద ఇప్పుడు వస్తున్న కథల గురించి అన్నాను."

"ఓ మరీ మంచిది. నా మీద ఆరోపణలు లేకుండ వినడమంటే మంచిదేగా. కానీ త్వరగా నాకు మళ్ళీ నిద్ర వస్తుంది."

"నిద్ర వస్తే పొండి. ఈ చర్చలకేమి? ఇవ్వాళ కాకపోతే రేపు."

"అట్లా కాదు. శుభస్య శ్రీఘ్రమన్నారు. ఈ సంగతి ఇప్పుడే తేల్చుకోవాలి. లేకపోతే నిద్ర వచ్చినా తేలిపోతుంది. హాయిగా పట్టదు ఊ.... కానీ...."

"ఏదైనా ఒక కథ రాశాము అంటే అది సర్వవిధాకర్షణ కలదిగా ఉండాలె."

"అనగా కొంచెం వివరంగా సెలవివ్వాలె."

"అబ్బా మీతో మాట మాట్లాడితే ఇదే తంటా. మాట మాటకు వెక్కిరిస్తుంటారు."

"కోపపడకు, ఇంకేమి అననుగా..."

"మనోహరమైన ఒక గులాబి పువ్వు యొక్క ఆకృతి, రంగు, మృదుత్వము, పరిమళము, మకరందము మననెట్లా ఆకర్షిస్తూ వుంటాయో అలాగే కథా కుసుమం కూడ కల్పన అనే ఆకృతీ, వర్ణన అనే రంగూ, శైలి అనే మృదుత్వము, రసమనే పరిమళము, నీతి అనే మకరందము గలిగి ఆకర్షవంతమైనదిగా ఉండాలె. ఇందులో ఏది లోపించినా కథా కుసుమం రాణించదు. ఇప్పుడే రాయబడే కథల్లో ఒకటుంటే ఒకటుండదు. చూస్తున్నారో లేదో."

"నీవు పొరపాటు పడుతున్నావు. ఇప్పుడు వ్రాయబడే కథలన్నీ నీవు చెప్పిన లక్షణాలన్నీ కలిగే ఉంటున్నవి.... వింటున్నావా... మా నవీనులు కల్పనలో అసదృశ్యులు గదా?"

"అ ౦ ఆ ౦. అ సభ్య కల్పనలో ఫస్టు"

"ప్రకృతే మా విహార మందిరం కనుక, మేము ప్రకృతి వుపాసకులం కనుక సహజ వర్ణనా వైదగ్ధ్యంలో మాకెవరూ సాటిరారు."

"సహజమని ఉచితానుచితాలెరుగకుండ అన్నీ వర్ణిస్తే అసభ్యమనిపించుకుంటుంది. ఇప్పటి కథలు వెగటు పుట్టించడానికి ముఖ్య కారణం ఇటువంటి వర్ణన లుండటమే. వర్ణన సహజమయినా ఉచితాన్ని మీరకూడదు."

"మార్దవం మన తెలుగు భాషలోనే సహజంగా చెఱకు ముక్కలో తీపిలాగా ఉన్నది కనుక దానికి ప్రత్యేకంగా ప్రాకులాడవలసిన పని లేదనుకుంటాను."

"సహజంగా వుంటేనేమి, ఉపయోగించే వారి నేర్పును బట్టే మృదువు మృదువుగా కనబడుతుంది. మృదువైన మన తెలుగులోనే కఠోర శబ్దజాలంతో గూడిన గ్రంథాలెన్ని లేవు? వసుచరిత్ర పాండిత్య విశేషం చేత గొప్ప గ్రంథ మైనప్పటికీ మృదుత్వం లేక పోబట్టే గదా మను చరిత్రంత లాలిత్యం గలది గాదనిపించుకొంటున్నది."

"ఇక రసమంటావా? ప్రతి కథలోను యెక్కీ తక్కీ ఇది రసయుగం. ఇప్పటి కవులందరు రస జగద్విహారులు. కనుక రస విషయమై నీవు చెప్పిన ఆక్షేపణ చెల్లనే చెల్లదు."

"రసమెప్పుడూ పూవులో తావివలె వాక్యంలో మిళితమై యుండాలె. అందులో హాస్య రసం విషయంలో అది ఎంత గర్భితంగా వుంటే అంత మనోహరంగా ఉంటుంది. నవ్వించడానికే అని రాసే ఆకటా వికటపు వ్రాతలు చక్కిలిగిలిపెట్టి నవ్వించినట్లు మొరటుగా ఉంటాయి. ఏ రసమైనా ప్రయత్నపూర్వకంగా పైకి చిందిస్తే అసహ్యం వేస్తుంది. ఒక కథలోనే కాదు, ఉపన్యాసంలోనైనా హాస్యం అధికంగా కనిపిస్తే వికృతంగా ఉంటుంది. కూరలో ఉప్పు వేయకపోవడం ఎంత అరుచికరమో, అధికంగా వేయడమూ అంత అరుచికరమే. ఆ మధ్య టౌనుహాల్లో యెవరో కవి పండితుడు ఉపన్యాసమిస్తారని పిలుచుకుపోయినారు జ్ఞాపకమున్నదా? మాటమాటకు నవ్వించారాయన. ఉపన్యాసం విన్నంత సేపూ ఆ యికిలించడం బాగానే ఉన్నది. తీరా ఇంటికి వచ్చి ఆలోచిస్తే అంత ఉపన్యాసంలోనూ నిలవ చేసుకోవడానికి యేమీ కన్పడలేదేమా అని ప్రాణం వుస్సురు మనిపించింది."

"అదే నీ తెలివి తక్కువ. నిలవేమి చేసికోవాలె. ఆయన గొప్ప విద్వత్కవి. మంచి చమత్కారి. కమ్మని పద్యాలు చదివినాడు. వినోదకరమైన విషయాలు చెప్పాడు. అందరూ ఉల్లాసంగా ఆనందించారు. ఇంకా ఇంటికేమి తెచ్చుకోవాలె?"

"కాదండీ. ఒక మహా పండితుడు చేసిన ఉపన్యాసం విని నవ్వేసేదిగా నేనా ఉండవలసింది? జ్ఞాన మధువును కొంచెమో గొప్పో సేకరించుకోవలసిందిగా వుండవద్దా? గులాబి పువ్వు సౌందర్యము సౌరభమూ సౌకుమార్యము ఒక్కనాటితో నశించిపోతుంది. దాని నుండి మధుపము గూర్చిన తేనె యెంత కాలముంటుందో ఎన్నింటికి వినియోగిస్తుందో చూచారా? అట్లాగే ప్రతి రచనలోను ప్రతి ప్రసంగంలోను నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్య వస్తువు కూడా వుండాలె. అట్లా వుంటేనే రచయిత యొక్క శ్రమ స్థారకమవుతుంది. ఆ విధంగా కాకుండ ఇప్పటి మీ నవీన రచయితల్లాగా తాత్కాలికోల్లాసమే కథ యొక్క ఉద్దేశమయితే, అందు ప్రణయ వ్యవహారాలే కథకు ముఖ్య వస్తువులయితే, అంతకంటే మంచివి మీరు వ్రాయలేకపోతే, అవే తప్ప పాఠకులకు రుచించకపోతే కథలు, కథకులు, కథా పాఠకులు, భ్రష్టమార్గం పట్టినారనే చెప్పవచ్చును." అంటూ రాజేశ్వరి ఏదో జ్ఞాపకం వచ్చి చివాలున లేచి లోపలకు వెళ్ళింది.

రాఘవరావు తింటూ తింటూ వుండగా అయిపోయిన రుచిర పదార్థము కొరకు ఎదురు చూస్తున్న వాడిలాగ కుతూహలంతో రాజేశ్వరి రాకకోసం ఎదురు చూడసాగాడు. రాజేశ్వరి పాలల్లో తోడువేసి ఉట్టిమీద పెట్టి "మాట్లాడుతూ కూర్చుంటే పాలు చప్పగా చల్లారిపోయినాయి. సుమా" అంటూ సావిట్లోకి వచ్చింది.

"అవును ఏ పనైనా పదును మీద వుండగానే కానివ్వాలి. ఇప్పటి నీ విమర్శక వాదం గూడ అంతే. చప్పగా చల్లారిపోతే నిస్సారమే అయిపోతుంది. వేడిమీద వుండగానే కానివ్వ" మన్నాడు రాఘవరావు.

"కథలలో ఉత్తమ మధ్యమాధమాలున్నాయి. శైలీ మాధుర్యము, వర్ణనా చాతుర్యము, కల్పనా సౌందర్యము, రసౌచిత్యము, నైతికాదర్శనము గలవే ఉత్తమ శ్రేణికి చెందిన కథలు. ఇటువంటి కథలు వాఙ్మయంలో స్థిరమైన స్థానం సంపాదించుకుంటాయి. ప్రజాదరణ పొందుతాయి. వీటికి పాతగిలిపోవటమంటూ ఉండదు. రవీంద్రుని కథలు ఇటువంటి శ్రేణికి చెందినవే, అతడు ఏ నీతినీ యే ధర్మాన్ని వెల్లడిగా యేకరువు పెట్టడు. అయినా ప్రతి కథా ఏదో ఒక

ఉత్తమాదర్శాన్ని వ్యక్తీకరిస్తూనే ఉంటుంది. అన్ని గుణాలు కలిగి నైతికాదర్శం లుప్తమైనవే మధ్యమ తరగతికి చెందిన కథలు. ఈ నడిమి రకం కథలు కూడ జవము జీవము గల భాషలోనే రాయబడుతాయి. వర్ణన గూడ సహజంగానే ఉంటుంది. పాత్ర పోషణాది కల్పనా విధానం కూడ బాగానే ఉంటుంది. రస పోషణకూ లోపం ఉండదు. కాని నైతికమైన ఒక ఉత్తమాదర్శం లేనందువల్ల ప్రజా హృదయంలో స్థిరమైన ఉనికి సంపాదించుకోలేవు. పాఠకులకు తాత్కాలికానందం కలిగించడంతో ఈ కథల పని పూర్తవుతుంది. ఏ నేర్పు లేక యేదో చిత్తం వచ్చినట్లు వెకిలిగా యే యువతీ దర్శనం వల్ల కల్గిన భావోద్రేకంతో రాయబడినవే అధమ తరగతికి చెందిన కథలు. ఇప్పుడు కొన్ని తెలుగు పత్రికల్లో ప్రచురింపబడే కథలు చాలావరకు ఈ జాతికి చెందినవే. ఇటువంటి కథలు వ్యాప్తి పొందడం వల్ల ప్రజలకు గాని భాషకు గాని యేలాటి ప్రయోజనం లేదు. బిడ్డల క్షేమం కోరే తల్లిదండ్రులు, వీటిని తమ పిల్లలు చదవడానికి ఒప్పుకోరు. విద్యార్థుల శ్రేయం కోరే ఉపాధ్యాయుడు ఇటువంటి కథలను తన విద్యార్థి చదవడానికి అంగీకరింపడు. ఇక నైతిక శిక్షణ అత్యవసరమగు బాల వితంతువులు వీనిని చదవడం వారి అయోగ్యతకు చిహ్నంగా భావించి వానిని స్పృశించటానికే భయపడిపోతారు. ఇంత ఎందుకు పెద్ద మనుష్యులనబడే వారెవ్వరూ ఇట్టి కథలు గల పుస్తకాన్ని చేతబట్టుకొని బయటకు రావడానికే సంకోచిస్తారంటే నమ్మండి. రాను రాను ప్రజల కత్యంత ప్రీతి పాత్రమైన కథా వాఙ్మయం ఇట్టి హీన మార్గం పట్టి భయోత్పాతం కలిగించేదిగా అయిపోవడం శ్రేయస్కరమనే అంటారా?".

రాఘవరావు, రాజేశ్వరి చెప్పిన మాటలన్నీ శాంతంగా విని "రాజేశ్వరి నీవు కథలను గూర్చి చేసిన పరిశీలనకు చాలా సంతోషం. కాని నీతి లౌల్యంలో పడి కథ ఎటువంటి వస్తువో తెలుసుకోలేక పోయినందుకు విచారంగా ఉన్నది. కథ "వినరావేమ", "కదరా సుమతీ" వంటి నీతి శతకం గాదు. నీతి నిబద్ధమైన కథలూ ఉండవచ్చును. కాని ప్రతి కథనూ నీతి చట్రములోనే బిగించవలెననడం తెలివి తక్కువ. స్వేచ్ఛగా, ఉల్లాసంగా బుద్ధినైశద్యం కొద్దీ వికసింపవలసిన కథా కుసుమం ఇందువల్ల సంకుచితమై సౌందర్య భ్రష్టమైపోతుంది. అసలు కథా రచన ఒక కళా విశేషం. దానిని ప్రయోజనాలకు వినియోగించుకోవలెనని యత్నించడం అరసికుల పని" అన్నాడు.

"మీ యువ కవుల అభిప్రాయాన్ని అచ్చున దీసినట్లు ఒకటిగానే ఉంటాయి కాబోలు. ఆ మధ్య నెవరో గూడ పత్రికల్లో ఇట్లాగే వ్రాయంగా చూచాను. కళంటే నాకూ ఇష్టమే. వట్టి బంగారపు ముద్దకంటే ఆ బంగారంతో చేయబడిన ఆభరణం యెక్కువ అందమైనదిగా, విలువగలదిగా ఉంటుందని నాకు తెలియక పోలేదు. అసలు కళంటే యథేచ్ఛగా రాయడం గాదు. నేను చెప్పిన లక్షణాలన్నీ కలిగి వుండాలి. కళనే పేరుతో సంభాషణ గాని వర్ణన గాని అవినీతిని చొప్పించటం యుక్తం గాదు. బంగారాన్ని యెంత నగిషీ వస్తువుగా నైనా తయారు చేయవచ్చును గాని అందులో ఇత్తడి వగైరాలు కలిపి దాని విశుద్ధత చెరపడం యుక్తం కాదు గదా!" అన్నది రాజేశ్వరి.

"సరి, సరి, ఇంత మడికట్టుకొని నీతిబద్ధమైన కథలు రాస్తే వాటి అందం చెప్పనక్కర్లేదు. చదువకుండానే ప్రజలు సంతోషిస్తారు."

"మరేమీ భయం లేదు. ఆ విధంగా నీతి బద్ధమైన కథలు రాసినప్పుడే వాటి విలువ ఎక్కువౌతుంది. ప్రజల ఆదరం విస్తరిస్తుంది. తెలుగువారే కాక ఇతరులు కూడా వారిని తమ తమ భాషలలోకి తర్జుమా చేసికొని మరీ చదువుతారు. టాల్‌స్టాయ్ కథలు, ప్రేమ్‌చంద్ కథలు చూడండి. మన తెలుగులోకి ఎట్లా అనువదింపబడుతున్నాయో! వానికా గౌరవం ఎందువల్ల వచ్చిందీ? మీరేమైనా చెప్పండి. అది కథ కానీ, కావ్యం కానీ, గేయం గానీ, గీతం గానీ, చిత్రం గానీ, శిల్పం గానీ, మానవ కళ్యాణానికి ఉపయోగించగల ఉత్కృష్టత అంతర్గర్భితమై యుంటేనే దానికి.."

ఇంతలో వుయ్యాల త్రాళ్ళు చల్లగా కదలడం మొదలు పెట్టాయి. నోరు మాటలాడుతున్నా దాని యందు దృష్టి యేమరకుండ ఉన్న రాజేశ్వరి ఆ సవ్వడి కనిపెట్టి "పిల్ల లేచినట్టున్నది" అంటూ చివాలున లేచి పిల్లకు పాలు పట్టే ప్రయత్నంలో నిమగ్నురాలైంది.

రాఘవరావు కూడా గడియారం వంక తల త్రిప్పి చూచి "అబ్బో పదిన్నరైందే." అంటూ వెన్ను విరుస్తూ లేచి వెళ్ళి గదిలో మంచం మీద మేను వాల్చాడు.

**(కథ పేరు 'కథ ఎట్లా ఉండాలె?' ను 'ఉత్తమ కథ'గా మార్చడం జరిగింది.)**

# ఇక మీరు మా వైపు చూడండి

- డాక్టర్ కత్తి పద్మారావు
9849741695

చలి పులిలా ఘాండ్రిస్తుంది
ముదుసలులు వణుకుతున్నారు
శిశువులు తల్లుల గుండెలకానుకొని నిద్రిస్తున్నారు
హాస్టళ్ళలో పిల్లలు కప్పుకోవడానికి
దుప్పట్లు లేక గజగజలాడుతున్నారు
గుంపులు గుంపులుగా దోమలు
మురికి కూపాల్లో పేదలు
నిద్రలేని రాత్రులు
కొందరికి వేడిపుట్టే మిషన్లు
రగ్గుల్లో వెచ్చని నిద్రలు
ఆ పడతి సాలోచనలో వుంది
దు:ఖానికి సుఖానికి మధ్య
అంతరాన్ని అధిగమించింది
ఒంటరి తనంలో వున్న స్వేచ్ఛ
స్వతంత్ర్యాన్ని సాధించినంత ఉత్సాహం
నిజమే సేవలోనూ ఒక ఉద్విఘ్నత
ఒక రాత్రిని దాటిస్తున్న పుస్తకం తోడు
ఒక మిత్రురాలి సంభాషణ
ఓ వృద్ధురాలికి చేయందించిన స్ఫూర్తి
ఓ దీపానికి నూనె పోసిన తృప్తి
వారిపుడే పాలపుంతల్లోని
విశ్వ సౌందర్యాన్ని చూస్తున్నారు
భూమి దేవత కాదు
అది ఒక గోళమని
ఇప్పుడే తెలుసుకొంటున్నారు
చైనా వీరుడు చూటే జీవితం రాసింది స్త్రీ అని
తెలుసుకుంటున్నారు
అమ్మను చిత్రించింది రచనా శిల్పి గోర్కి
వాస్తవ దృశ్యాలను ఇప్పుడే చూస్తున్నారు
అవును। అక్షరాల్లో ఇన్ని శిల్పాలు దాగున్నాయా!
దు:ఖం, సంతోషం, వేదన, వెన్నల, చీకటి
అన్నింటిని అక్షరాలు మన మనస్సుకు
అనుభూతం చేస్తాయి సుమా!
తాపీ ధర్మారావు ఇనుప కచ్చడాలు
బద్దలౌతున్న చప్పుడు
చలం మైదానంలోని



ఇసుక రేణువులు జడలు విప్పుకుని
చేస్తున్న నృత్య గానాన్ని వీరు వీక్షిస్తున్నారు
శరత్ సృష్టించిన పురుష దౌర్బల్యం
స్త్రీ ధీర శీలతను వీక్షిస్తున్నారు వీరు
అవును, వీరు ఒంటరిగా
ఉన్నారని ఎవరన్నారు ?
వారొక సైన్యంగానే వున్నారు
వారి మాటల్లో కవాతులు వినిపిస్తున్నాయి
భ్రమలు, భ్రాంతులు పోయి
ఆత్మ స్థైర్యంతో వారు నడుస్తున్నారు
'ఆత్మహత్య'కు గురయ్యే వారిని చూసి
ఇది మానసిక దౌర్భల్యం
'మనిషిగా పుట్టాక
పోరాడుతూనే బ్రతకాలి' అంటున్నారు
ఆధిపత్యాలన్నింటికి వీరు
సవాలు విసురుతున్నారు
ఇదేంటి? స్త్రీ సదస్సుల్లో
పురుష ప్రశ్నలు అని నిలదీస్తున్నారు
వారు కళ్ళతో మాట్లాడుతున్నారు
ఆ భాషరాని వారు నిరుత్తరులవుతున్నారు
పురుషులు కనులెత్తి చూడలేనంత
ఎత్తుకు వారు ఎదుగుతూ వున్నారు
నన్ను నేను గుర్తిస్తున్న యుగమిది
'నీ గుర్తింపు కోసం నేను ప్రాకులాడటం లేదు'
అన్నపుడు ఆకాశం నుండి వర్షం కురిసింది
కొత్త పంటలు పండాయి
అవును? ఆలోచనా స్రవంతికి
ఎండ, వాన, చలి ఏముంది?
అధీనం కాని వారెవరైనా
ఆకాశమంత ఎదుగుతున్నారు
ఈ యుగ సంకేతాలం మేము
ఇక మీరు మా వైపు చూడండి. ♦



# విలువలున్న సాహిత్యమే కాలానికి నిలబడుతుంది

**- పి. సత్యవతి**

### మీ కుటుంబ నేపథ్యం చెప్పండి

నేను గుంటూరు జిల్లా కొలకలూరులో ఒక మధ్య తరగతి వ్యవసాయ కుటుంబంలొ పుట్టాను, హైస్కూల్ వరకు అక్కడే చదువుకున్నాను .ఆడపిల్లల మీద పెద్దగా ఆంక్షలు, అణకువగా వుండాలనే అధికారాలూ లేవు మా ఇంట్లో. కాక పోతే డబ్బు, ఇతర వ్యవహారాలూ అన్నీ మా నాన్న చేతుల మీదుగానే నడిచేవి. ఆడవాళ్ళ సలహా సంప్రదింపులు లేవు .ఆయన దగ్గర ఎవరికీ చనువు లేదు. ఆ రోజుల్లో అంటే 1950-60 లలో మా కుటుంబాలలో ఎస్ ఎస్ ఎల్సీ (అంటే స్కూల్లో ఆఖరి క్లాసు. ఇప్పటి పదో క్లాసులాగా) అమ్మాయిల చదువుకి కటింగ్ పాయింట్. కానీ మానాన్న నన్ను కాలేజీకి పంపించారు. నేను హైదరాబాద్ కోఠీ విమెన్స్ కాలేజీలో చదువుకోవడం నాకొక గొప్ప అవకాశం. నేను మా మేనమామ పి ఎస్ రావు గారి ఇంట్లో వుండి చదువుకున్నాను. ఆయన ఇంగ్లీష్ లెక్చరర్. తరువాత వివేక వర్ధినీ కాలేజి ప్రిన్సిపాల్ గా చేసారు. సాహిత్యం అన్నా కళలన్నా చాలా ఇష్టం. చాలా మంచి పుస్తకాలు వుండేవి వాళ్ళింట్లో. ఆయన మా అత్తయ్యను ఒక స్నేహితురాలిలా చూసేవాడు. మా నాన్న దగ్గర లేని చనువు అయన దగ్గర వుండేది నాకు. ఇంటి వాతావరణం ఎట్లా వుండాలి అనేది అర్థమైంది అక్కడే. నేను చదువుకునేటప్పుడు హైస్కూల్ లెవెల్ లో " స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలా చెయ్యకూడదా?" అనే విషయం మీద వక్తృత్వ పోటీలు నడిచేవి. స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలని మాట్లాడేదాన్ని. స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం వుండాలని కట్నం పెళ్ళిళ్ళు పోవాలని మాట్లాడేదాన్ని. నా చుట్టుపక్కల స్త్రీలను, మా బంధువులను పరిశీలించిన మీద నాకు అలా అనిపించేది. మా కుటుంబాలలో స్త్రీల మీద ప్రత్యక్ష హింస వుండేది కాదు కానీ అధీనత వుండేది. కనపడని హింస అది. దానికి మూలం ఆర్థిక పరాధీనతే అని నాకు అనిపించేది.

### మీ రచన నేపథ్యం

మాది సంప్రదాయాలకు పెద్దగా విలువ ఇచ్చి, వాటికి అంటుకుపోయే కుటుంబం కాక పోవడం కూడా నేనివాళ వ్రాయగలగడానికి ఒక కారణం. ఇంట్లో పెత్తనం అంతా మా నాన్నదే. ఆయనంటే పెద్ద చనువు లేదు కానీ మమ్మల్ని తిట్టడం శాసించడం చేసే వాడు కాదు. నేను హైస్కూల్లో చేరక ముందు మా వూళ్ళో హైస్కూల్ లేదు. దుగ్గిరాల వరకూ నడిచి పోవాలి ఆడపిల్లలు కూడా. అప్పట్లో ఆడపిల్లలెవరూ సైకిల్ తొక్కేవారు కాదు. అందుకోసం వూళ్ళో హైస్కూల్ పెట్టించడానికి కష్టపడి తిరిగిన వాళ్ళలో మా నాన్న ఒకరు. 56 వరకూ మా ఊళ్ళో కరెంట్ లేదు. అప్పుడు మానాన్న ఒక బ్యాటరీ రేడియో కొన్నాడు. దానికి పెద్ద బ్యాటరీ వుండేది. నాలుగు నెలలో మూడు నెలలో వచ్చేది అది. రోజూ పొద్దున్న ఎనిమిదింటికి ఖచ్చితంగా ఇంగ్లీష్ వార్తలు వినాలి. విని ఏమి అర్థం అయిందో చెప్పాలి. ఆయన చదివింది కూడా హైస్కూల్ వరకే గానీ అప్పుడు తెలుగు మీడియం లేదనుకుంటా ధారాళంగా ఇంగ్లిష్ మాట్లాడే వాడు. ఇంగ్లీష్ భాషపై ఇష్టం పెరగడానికి కల కారణాలలో అదొకటి. పత్రికలూ పుస్తకాలు కొనేవాడు. చదివేవాడు కూడా. మా అమ్మ మంచి చదువరి. మా ఊళ్ళో మంచి లైబ్రరీ వుండేది. అమ్మకి అక్కడినించీ శరత్ నవలలు, అడవి బాపిరాజు, విశ్వనాధ సత్యనారాయణ నవలలు అన్నీ తెచ్చి పెట్టేవాళ్ళం. మా అమ్మ చలం నవలలు కూడా చదివేది. అట్లా నేను హైస్కూల్లో వుండగానే మైదానం చదివాను. కానీ ఆవిడకీ నాకూ కూడా అది సరిగ్గా

అర్థమయిందొ లేదో తెలీదు. తరువాత సాహిత్యం చదవడం మొదలు పెట్టాక మళ్ళీ చదివాను. అవ్వన్నీ చదివి విశ్లేషించే జ్ఞానం లేకపోయినా బహుశా ఇంటి పనుల విసుగు లోనుంచీ విముక్తి కోసం చదివేదనుకుంటా. మా నాన్నకి కర్ణాటక సంగీతం చాలా ఇష్టం. రేడియోలో సంగీత కచేరీలు విని తను కూడా రాగాలు తీసేవాడు. ఆయన అటు వెళ్ళగానే మేం రేడియో సిలోన్ పెట్టేవాళ్ళం. ఇప్పుడు నాకూ సంగీతమిష్టం. పుస్తకాలు చదవడం, సంగీతం వినడం నా తల్లి తండ్రుల వారసత్వం కాగా సాహిత్యం పట్ల ప్రేమ మా మామయ్య వల్లా, హైదరాబాద్‌లో వుండి చదువుకోడం వలనా కలిగింది. మా ఇంటికి వార పత్రికలూ, భారతి కూడా వచ్చేవి. హైదరాబాద్ వెళ్ళాక తెలుగు స్వతంత్ర చదివే దాన్ని. మా కాలేజి లైబ్రరీలో జాగ్రఫిక్ మాగ్జిన్ దగ్గర్నుంచీ టైమ్, లైఫ్ దాకా అన్నీ వుండేవి. అవ్వన్నీ కాక మాలతీచందూర్ పరిచయం చేసే నవలలు కూడా డిక్షనరీ పెట్టుకుని చదివేదాన్ని. చదవగా చదవగా వ్రాయాలనే కుతూహలం కలిగింది. కాలేజి మాగజైన్‌కి ఒక సంవత్సరం సంపాదకురాలిగా చేసాను. తరువాత తెలుగు స్వతంత్రలో కథలు వ్రాసాను. ఏవీ కూడా ఆకాశంలో విహరిస్తూ వ్రాసినవి కాదు. అవి ఎవరడిగితే వాళ్ళకిచ్చి పారేసుకున్నాను. 70 ల తరువాత పురాణం గారి సంపాదకత్వంలో వచ్చిన ఆంధ్రజ్యోతి వారపత్రికలో వచ్చిన కథల దగ్గర నుంచీ వున్నాయి. నా జీవన విధానానికి గానీ ఆలోచనా పథానికి గానీ దోహద పడినది నేను చదివిన సాహిత్యమే. సాహిత్యంలో నుంచీ స్నేహాల లోనుంచీ పరిశీలన లోనుంచీ పుట్టింది నా రాత.

***మీ కథా సంపుటాలు, నవలలు, వ్యాసాలూ...***

70ల నుంచీ 90ల వరకూ వచ్చిన కథలన్నీ సత్యవతి కథలు అనే సంకలనంలో వచ్చాయి. 77 అనుకుంటా నా కథ 'గ్లాసు పగిలింది' కి ఆంధ్రజ్యోతి వారపత్రిక దీపావళి కథల పోటీలో ప్రథమ బహుమతి వచ్చి నాకు కాస్త గుర్తింపు తెచ్చింది. తరువాత 90 నుంచీ వచ్చిన కథలతో 'ఇల్లలకగానే..' అనే సంపుటం ప్రచురించాను. బహుళ పాఠకాదరణ పొందిన ఆ కథ అనేక భాషల్లో అనువాదం అయింది. దాని ఇంగ్లీష్ అనువాదం ప్రస్తుతం పదో క్లాసు ఇంగ్లీష్ విద్యార్థులకి పాఠ్యాంశంగా వుంది. తరువాత వరుసగా 'మంత్రనగరి', 'మెలకువ' అనే కథా సంపుటాలు వచ్చాయి. ఇప్పుడు వాటన్నిటిలోని 40 కథలతో సత్యవతి కథలు అనే సంకలనాన్ని విశాలాంధ్ర ప్రచురించింది. కథలు వ్రాసిన కొత్తలో అయిదు నవలలు కూడా వ్రాసాను. అవేవీ ఇప్పుడు నా దగ్గర కూడా లేవు. నవల నా **'cup of tea'** కాదనిపించింది. కథలు వ్రాయడం ఇష్టమూ సులువూ కూడా. భూమిక పత్రికలో వ్రాసిన కాలం "రాగం భూపాలం "వ్యాస సంపుటి వచ్చింది. స్వాతంత్ర్యానంతర తొలి కథా రచయిత్రులను పరిచయం చేస్తూ వ్రాసిన వ్యాసాలూ వున్నాయి. అవి ఇప్పుడు పుస్తకంగా వేస్తున్నాను. మహమ్మద్ ప్రవక్త జీవితం, ఇస్మత్ చుగ్తాయ్ కథలు, మా నాయన బాలయ్య, రేవతి జీవితం అనువాదం చేసాను. హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణలు అవ్వన్నీ.

***మీ కథ 'ఇల్లలకగానే..' బలమైన స్త్రీ వాద కథ. మరో కథ 'సూపర్ మామ్ సిండ్రోం" ప్రపంచీకరణ కారణంగా పెరిగిన వస్తువినియోగం పై వ్రాసిన కథ. ఈ రెండు కథల మధ్య ప్రయాణాన్ని ఎట్లా విశ్లేషిస్తారు ?***

'ఇల్లలకగానే పండగౌనా' 90లో వ్రాసాను. అస్తిత్వ ఉద్యమం ఊపందుకుంటున్నవేళ. అప్పటికింకా గృహిణుల సంఖ్య కొంచెం ఎక్కువగానే వుంది. నిజానికి ఇది ఎనభైల్లోనే వ్రాయవలసిన కథ. స్త్రీలు చైతన్య వంతులౌతున్న దశ అది. 90ల నాటికే పరిస్థితి మారింది. నింపాదిగా ఇల్లు దిద్దుకుంటూ కూర్చునే దశ తిరిగిపోయింది. స్త్రీలపైన భారం పెరిగింది. నూతన ఆర్థిక విధానం ప్రపంచీకరణ, వస్తువుల వెల్లువ అన్నీ స్త్రీల జీవితాలపైన పెను భారాన్ని పెట్టాయి. పైగా పెరిగిన చైతన్యంతో తమ బలాన్నీ తెలివినీ అవగాహన చేసుకుంటున్న స్త్రీలు ఇచ్ఛాపూర్వకంగానే ఈ భారాన్ని తలకెత్తుకున్నారు. ఇంటి పని నుంచీ అధీనత నుంచీ తమదైన ఏ స్పేస్ కోసం అలమటించారో, అతి తెలివితో ఆ స్పేస్‌ని పోగొట్టుకుని యంత్రాలలా మిగిలారు. స్త్రీ పురుషులు ఇంటి పని పంచుకోడం, పిల్లలకి తమ చదువులు, వివాహాల పట్ల ఒక అవగాహన మొదలైన కొత్త ఆలోచనలు కలిగించదానికి బదులు, ఒక యాంబిషన్ వలలో చిక్కుకుపోయారు. ఇల్లు చక్క బెట్టడానికి తోడు అనేక వ్యవహారాలు తగిలించుకున్నారు. పట్టించుకోవడం, పంచుకోవడం అనే పద్ధతి పురుషులకు అలవాటు చెయ్యలేకపోయారు. ఇప్పటికీ చెయ్యలేక పోతున్నారు. పితృస్వామ్య భావజాలం పురుషులలోనే కాదు, దాని అవశేషాలు ఇంకా చాలా మంది స్త్రీలలో మిగిలే వున్నాయి. మగ పిల్లల్ని పెంచడంలో వివాహాలు నిర్ణయించే పద్ధతుల్లో అట్లాంటి అనేక విషయాల్లో. సూపర్ మామ్ కథతో చాలా మంది స్త్రీలు ఐడెంటిఫై అయ్యారు.

***మీ మొగ్గు అస్తిత్వ వాదాల వైపు అనుకోవచ్చా?***

అస్తిత్వ వాదాల, ఉద్యమాల వల్లనే అనేక విషయాలు

వెలుగులోకొచ్చాయి. అవి సమాజాన్నీ సాహిత్యాన్నీ కూడా ప్రభావితం చేసాయి. తెలుగు సాహిత్యాన్ని సంపద్వంతం చేసాయి. కుల మత జెండర్ వివక్ష చెక్కు చెదరకుండా వున్న మన దేశంలో అస్తిత్వ వాదాలు, ఉద్యమాల అవసరం తప్పకుండా వుంది.

***తెలుగు సాహిత్యంలో మార్క్సిస్టు సాహిత్య విమర్శ ఇంతకు ముందు కేంద్ర స్థానంలో వుండేది. ప్రస్తుత సాహిత్య విమర్శ ఎటుగా ప్రయాణం చేస్తున్నది అనుకోవచ్చు?***

విమర్శ కన్నా సమీక్షలే ఎక్కువ గా వస్తున్నాయనిపిస్తుంది, కాలమాన పరిస్థితులను బట్టి విమర్శ స్వరూప స్వభావాలు కూడా మారతాయి కదా? స్త్రీవాద దళిత మైనారిటీవాద దృక్కోణం నుంచీ కూడా విమర్శ రావాలి కదా? మార్క్సిస్టు కేంద్రక విమర్శ ఒక్కటే ఇప్పుడు చాలదు. సామాజిక సంక్లిష్టత ను బహు కోణాల నుంచీ దర్శించి అంచనా వేసే విమర్శ ఇప్పటి అవసరం. కొందరు విమర్శకులు ఆ కార్యాన్ని నేరవేరుస్తున్నారని అనుకుంటున్నాను.

***ఇప్పుడు వస్తున్న కథలు వర్తమాన సంక్లిష్ట జీవితాన్ని రికార్డు చేయాగలుగుతున్నాయంటారా?***

తప్పకుండా చేస్తున్నాయి. అయితే ఇప్పుడు కొన్ని పత్రికలు సీరియస్ రచనల కన్నా కాలక్షేపపు కథలకు ప్రాముఖ్యం ఇవ్వడం మొదలు పెట్టినా, కొన్ని పత్రికలు వర్తమాన జీవన సంక్లిష్టతను ప్రతిబింబించే కథలను ప్రచురిస్తున్నాయి. అటు రాయల సీమ నుంచీ, తెలంగాణా నుంచీ, ఉత్తరాంధ్ర నుంచీ మంచి కథలు వస్తున్నాయి. కొత్తరాజధాని గురించి కూడా వస్తున్నాయి. స్త్రీల జీవన సంక్లిష్టతను దళిత, మైనారిటీ జీవితాన్ని చిత్రించే మంచి కథలు వస్తున్నాయి. వాటిని గమనించుకుని చదవాలి. పత్రికలూ ప్రోత్సహించాలి. ఏ కొద్ది మందో తప్ప రచయితలు వాస్తవ దూరం కాని రచనలు చెయ్యడం లేదు అనుకుంటాను. అయితే ఎక్కువగా నలుపు తెలుపు తీర్పులతో కూడిన రచనలు ముమ్మరంగా వస్తున్నాయి. జీవితంలోని, సమాజంలోని వివిధ ఛాయలని సంక్లిష్టతలని పట్టుకునే రచనలు తక్కువగా వున్నాయి. ఏకపక్ష తీర్పులు. ఉదాహరణకి వృద్ధుల సమస్యలపై వచ్చే కథలు. సంతానాన్ని మరీ హీనంగా చిత్రించే కథలు. సమస్యల మూలాలను, విశ్లేషించే కథలు తక్కువే. వెతికి పట్టుకుని వెలుగులో పెట్టాలి. మంచి కథలకు మనం ఇచ్చుకునే నిర్వచనాలు వేరు వేరుగా వుంటాయి. దాన్ని బట్టి మంచి కథలు వస్తున్నాయా లేదా అని నిర్ధారించుకోవాలి. నేనిచ్చుకునే నిర్వచనానికి అయితే కొంత నిరాశా జనకంగానే వుంది. కథలో జీవితం వుండాలి. ఏదో ఒక విషయం వుండాలి. రచయిత తీర్పరి కాకూడదు. తనను కలవర పరచిన, లేదా సంతోష పెట్టిన విషయాన్ని సూచన ప్రాయంగానైనా చెప్పాలి. చదివించాలి. చదువరికి కథ అర్థం కావాలి. ఒక సారి నాతో కారా మేష్టారు అన్నారు. కథ పాఠకుల కోసమే, కానీ కథకుల కోసం వ్రాయకూడదమ్మా అని. అయితే కథను ఒక డాక్యుమెంటరీ లాగానో వార్తా కథనం లాగానో సూక్తి ముక్తావళి లాగానో వ్రాసి చదువరుల తెలివిని అవమానించకూడదు. గొప్ప గొప్ప రచయితలైన వారి మాజిక్ రియలిజం కూడా అర్థం అవుతుంది. ఇటీవల ఒక ఇంటర్వ్యూలో రష్దీ చెప్పినట్లు మార్క్వెజ్ మాజిక్ రియలిజంలో అంతా రియలిజమే వుంది మాజిక్ కన్నా అని. ఎంత శిల్ప నైపుణ్యం వున్నా వస్తువు అర్థం కాకపోతే విసుగే. ఎంత అర్థం కాకుండా వ్రాస్తే అంత బాగుంది అని ప్రశంసించడం కూడా ఒక ఫాషన్ అయింది. తెలుగు కథలలో మణి మాణిక్యాలున్నాయి. మల్లె పూలున్నాయి. వాటిని వెతుక్కుని చదవాలి. అటువంటి కథల్ని బహుళ ప్రచారంలో వున్న పత్రికలు ప్రచురించాలి. అట్లా లేని కాలం దాపురిస్తోంది. మంచి కథలు ఎక్కువ ప్రత్యామ్నాయ సాహిత్య పత్రికల్లో, వెబ్‌లో చదువుకోవలసి వస్తోంది.

***మన దేశంలోని కుల మత వ్యవస్థకు బలైన ప్రజల జీవితాన్ని గురించి ఇటీవల వారిలో నుంచి వస్తున్న రచయితలు శక్తివంతమైన రచనలు చేస్తున్నారు. కానీ మెజారిటీ ప్రజానీకంలో ముఖ్యంగా మత ఛాందస భావాల వ్యాప్తి తగ్గుముఖం పట్టడంలేదు. ప్రపంచీకరణ యుగంలో ఈ ధోరణిని ఎట్లా అర్థం చేసుకోవాలి? దాన్ని మన రచయితలూ తమ కథల్లో ఎలా ప్రతిబింబించాలి?***

మెజారిటీ ప్రజానీకం సాహిత్యం చదవదు. సాహిత్యాన్ని దృశ్య మాధ్యమం కమ్మేసింది. అది వెయ్యి నాలుకలతో ప్రజల అభిరుచుల్ని చప్పరించేసింది. ప్రపంచం కుడి వైపుకు మొగ్గుతున్న ఈ కాలంలో మతానికి, కులానికి, నమ్మకాలకి మళ్ళీ మంచిరోజులొచ్చాయి. మనిషికి తనపైన తనకి నమ్మకం లేకుండాపోతోంది. హేతువును ఒక అభద్రత కమ్మేసింది. దానికి మతం దోహదం చేస్తోంది. మనిషి వినిమయదారుడు అయ్యాడు. కొనుగోలు శక్తి కోసం తాపత్రయ పడుతున్నాడు. స్త్రీలు ముందే వినియోగదారులైనారు. వాటికి ప్రచార సాధనాలు కూడా వారే అయినారు. ఈ పెనుగులాటలో సాహిత్యం అది

ఎంత మేలుకొలుపు అయినా పట్టించుకునే వెసులుబాటులేదు. ఇవతల ఆకర్షణ బలమైనది. రచయితల లోపం లేదు. వాళ్ళలో ఎంత ఆవేదన వున్నా ఎంత ఆర్తి వున్నా అవి సామాన్య జనానికి చేరి ఒక చైతన్యాన్ని తెచ్చే వాతావరణం లేకుండా చెయ్యడమే ప్రపంచీకరణలో ఒక మాయ. అట్లా ప్రజలు మత్తులో వుండడం కూడా ప్రభువులకు క్షేమం .

***పుస్తకాలు చదవడం, ముఖ్యంగా తెలుగులో చదువరుల సంఖ్య బాగా తగ్గిపోయిందని ప్రచారం జరుగుతున్నది. త్వరలో లిఖిత సాహిత్యం అదృశ్యం కానుందా?***

చదవడం తగ్గిందన్నది కొంత నిజమే. లిఖిత సాహిత్యం అదృశ్యం ఏమీ కాదు. ఇప్పటికే చాలా మంది మధ్య తరగతి వారికి దృశ్య మాధ్యమాల మీద విసుగు పుట్టేసింది. అయితే జీవితంలో పెరిగిన పనులతో వేగంతో అవసరాల సాధన కృషిలో చదవడానికి సమయం కూడా తక్కువగానే వుంది. పిల్లలకైతే అసలు లేకుండా చేసారు కార్పోరేట్ చదువుల వ్యాపారులు. తల్లి తండ్రుల మీద కూడా వత్తిడి పెరిగింది. చందమామ, బాలమిత్ర, టిన్ టిన్ కామిక్స్ లేవు. చదువు, లేదా స్మార్ట్ ఫోన్ గేములతో విద్యార్థి దశ ముగిసిపోతుంది. కానీ ఇది మారే రోజు తప్పకుండా వస్తుంది. లిఖిత సాహిత్యం వుంటుంది. పుస్తక ప్రదర్శనలు జరుగుతున్నాయి. లిటరరీ ఫెస్టివల్స్ జరుగుతున్నాయి. మొక్కుబడి సాహిత్య తిరునాళ్ళు కాకుండా సీరియస్ సాహిత్య చర్చలతో కూడిన తెలుగు లిటరరీ ఫెస్టివల్స్ కూడా జరగాలి. కొత్త రచయితల్ని గుర్తించి ప్రోత్సహించాలి. ఇందుకు కొంత నిష్పక్షపాత ధోరణి సిన్సియారిటీ వుండాలి. నవలల పోటీలు బహుమతులు అటు ఇంగ్లీష్‌లో బాగా పెరిగాయి. తెలుగులోనూ పెరుగుతాయి. బాల సాహిత్యానికి కూడా ప్రోత్సాహం మొదలైంది. పరిస్థితి ఆశాజనకంగా వుందనుకోవాలి.

***కొత్త తరం కెరీర్ కోసం పోరాడడంలోనే మునిగిపోతున్నది. మానవ సంబంధాల గురించి సామాజిక అవగాహన కొత్త తరంలో కొరవడుతున్నదన్న అభిప్రాయం సరైనదేనా?***

కొంత నిజమే. మానవ సంబంధాల గురించిన అవగాహన అటు తల్లి తండ్రుల నుంచో, ఇటు చదువు నుంచో లేదా పుస్తక పఠనం నుంచో రావాలి. లేదా సామాజిక సాంస్కృతిక ఉద్యమాల నుంచో రావాలి. తల్లి తండ్రులకి పిల్లల మార్కుల మీద, చదువులు ర్యాంకుల మీదే దృష్టి. స్కూళ్ళల్లో చెప్పేది పూర్వంలాగా పాఠాలు కాదు. ట్యూషన్ మాత్రమే. సాంస్కృతిక ఉద్యమాలు లేవు. కొత్త తరానికి పీర్ ప్రెషర్ కూడా ఎక్కువ. మంచి ఉద్యోగం కావాలి. ఎక్కువ జీతం కావాలి. అన్నీ త్వరత్వరగా అమిరి పోవాలి. పోటీ తత్త్వం. ఇంక ఏ సంబంధాలని గురించైనా ఆలోచించే తీరిక ఎక్కడ? అది వాళ్ల లోపం కాదు. విద్యా వ్యవస్థది. తల్లి తండ్రులది. మారుతున్న సామాజిక సాంస్కృతిక పరిస్థితులది. మారుతున్న పరిస్థితులలో ఇమిడిపోయే సౌకర్యానిది. ఆవరిస్తున్న అభద్రతది. మార్కెట్ ప్రభావానిది.

***మీరు తెలుగు టైపింగ్ చేస్తున్నారు. ఫేస్‌బుక్, వెబ్‌సైట్, బ్లాగుల్లో కొత్త తరం తమకు తోచింది వ్రాస్తున్నారు. ఈ పరిణామాలు తెలుగు వ్యాప్తికి దోహద పడతాయా? ఈ అధునాతన పరిణామాలు చూస్తే మీకేమనిపిస్తున్నది?***

తెలుగు టైప్ చెయ్యడం వలన దస్తూరీ అర్థం కాక పోవడం వుండదు. వ్రాసి కొట్టేసి మళ్ళీ వ్రాసే పని వుండదు. బ్లాగుల్లో కొత్త తరం తమకి తోచింది వ్రాయడంలో తప్పేముంది? దాని మీద చర్చ జరుగుతోంది. వాళ్ళు చెప్ప దలుచుకున్నది చెబుతున్నారు. ఒక్కొక్క పత్రిక్కి ఒక్కొక్క భావజాలం వుంటుంది. దానికి సరిపడే కథలనే వాళ్ళు వేస్తారు. అట్లా వెయ్యని ఆలోచింప జేసే ఎన్నో కథలు నెట్‌లో వస్తున్నాయి. వీలున్న వాళ్ళు చదివి బాగుంటే ప్రోత్సహిస్తారు. విమర్శిస్తారు. ఇది మంచి పరిణామమే అని నేను అనుకుంటాను. తెలుగు పత్రికలు దొరకని విదేశీ పాఠకులకి కూడా నెట్ అందుబాటులో వుంటుంది. సమయం వున్నప్పుడు చదువుతారు. పత్రికల్లో వచ్చిన సాహిత్యం మాత్రం అందరికీ ఒకే విధంగా నచ్చదు కదా? ఇదీ అంతే. భావ వ్యక్తీకరణకి ఒక మాధ్యమం. దీని వలన తెలుగు వ్యాప్తి చెందుతుందే కాని మాయమవదు. ఈ సాంకేతికత నాకు నచ్చింది. ప్రయాణాల్లో ఎక్కడైనా వేచి వుండవలసిన సమయాలలో చదువుకోడానికి వీలువుంది నెట్ వలన. ఎందులో వచ్చినా విలువలున్న సాహిత్యమే కాలానికి నిలబడుతుంది. సాంకేతికతని సద్వినియోగం చేసుకోగలగాలి.

***మీరు ఇంగ్లీష్ సాహిత్యం చదువుతారు. అక్కడి కథల్లో వస్తు శిల్పాలలో ఎటువంటి మార్పులు వస్తున్నాయి. మీ మీద వాటి ప్రభావం ఏవైనా వుందా?***

ఇంగ్లీష్ సాహిత్యంలో వివిధ ప్రయోగాలు వున్నాయి. అన్ని దేశాల సాహిత్యం ఇంగ్లీష్ అనువాదంలో చదువుతాం కనుక ఆయాదేశాల సాహిత్యం, సమాజం అర్థం అవుతాయి. సాహిత్యం మీద భౌగోళిక ప్రభావం కూడా వుంటుంది. అక్కడి

## ఆ కళ్ళు

- ఉదయమిత్ర
9985203376



ఎంత అద్భుతమైనవి ఆ కళ్ళు
పున్నమివెన్నెల కలబోసి
తీర్చిదిద్దిన కళ్ళు
వొచ్చే పొయ్యే బాటలల్ల
నిరీక్షణల తోరణాలు గట్టిన కళ్ళు

ఈ కళ్ళ కోసమేనా
నేను తల్లిపొత్తిళ్ళలో
కేర్ మని ఏడ్చింది

ఈ కళ్ళ కోసమేనా
నేను అలల్ని చీల్చుకు
మయన్మార్‌ను చేరేది
ప్రాణాలకు తెగించి
రొహింగ్యాల్ని కాపాడేది

ఈ కళ్ళేనేమో
నాకు దిక్సూచికలయ్యాయి
నా నిరీక్షణకు విరామం పలికాయి
◆

మృత్యువు వెంటాడుతుంటె
ఆ రోజు ఆకళ్ళ
నా బోటును
వెతుక్కుంటూ వొచ్చాయి

ఏం చెయ్యను ?
నా హృదయంలో చోటిచ్చానే గాని
క్రిక్కిరిసిన నా బోటులో
చోటియ్యలేకపోయాను

భోరున కురిసే వర్షంలో
బోటులో చోటుకోసం
ఆమెచేసిన యుద్ధం జూసి
'నాఫ్' నది మెలికలు తిరిగింది
బంగాళాఖాతం బోరుమన్నది

బోటు కనుమరుగవుతూ ఉంటె
తనదిగాని తన ఊరి వైపు
దిక్కులేని దిక్కుల వైపు
శూన్యాకాశం వైపు
నిస్సహాయంగా చూస్తూ
శిఖరంలా కుప్పగూలింది
◆

ఇక్కడంతే,
రెప్ప పాటున జీవితం
శకలాలు శకలాలుగ శవాలు శవాలుగ
విసిరేయబడ్తుంది
మరుసటి రోజు చూద్దును గదా
ఏ ట్రిగ్గర్ ఖుషీ సైనికుల చేతజిక్కిందొ
ఆమె రక్తపు మడుగులో తేలింది

అవే కళ్ళు
ప్రశ్నిస్తూ, వెంటాడుతూ ◆

---

ప్రజల జీవన విధానం నమ్మకాలు వారి ప్రభుత్వ విధి విధానాలు, అక్కడి వివిధ సమూహాలపై వుండే వివక్షలు వారి ఆకాంక్షలు అన్నీ ప్రతిబింబిస్తాయి. ఇంగ్లీష్ సాహిత్యం అంటే కేవలం అమెరికా బ్రిటన్ సాహిత్యం కాదు. ఎన్నో భాషల నుంచీ దేశాల నుంచీ వచ్చే సాహిత్యం. అక్కడి స్థానిక వాతావరణాన్ని ఫ్లేవర్‌ని నింపుకుని వస్తుంది. నా మీద ప్రత్యక్షంగా ఎవరి ప్రభావమూ లేదు. పరోక్షంగా వుందేమో నాకు తెలియదు.

***కవిత్వం చదువుతారా? వర్తమాన కవిత్వంపై మీ అభిప్రాయం ఏమిటి?***

కవిత్వం చదువుతాను. శ్రీశ్రీని, కృష్ణ శాస్త్రినీ చదువుతూ పెరిగాను. అందర్నీ చదువుతాను. ఆధునిక కవులని తప్పకుండా చదువుతాను. ఇప్పుడు మంచి కవిత్వం వస్తోంది. తాత్వికత వుంది. జీవితం వుంది. సమాజం వుంది. కలలున్నాయి. బాధలున్నాయి. ఆకాంక్షలున్నాయి. వివక్ష రూపాలు వున్నాయి. వస్తువుతో పాటు మంచి అభివ్యక్తి వున్న కవిత్వం వస్తున్నది. పత్రికలలో విపులమైన సమీక్షలకు చోటులేదు. కొలతల ప్రకారం పుస్తక సమీక్షలు వుంటాయి. ఎవరికి వాళ్ళే మంచి కవిత్వాన్ని ఎంచుకుని చదువుకోవాలి. ఒక విధంగా ఫేస్‌బుక్ ఆ పని చేస్తున్నది. మంచి హిందీ కవిత్వాన్ని శాంత సుందరిగారు, ఇంగ్లీష్ తెలుగు కవిత్వాన్ని వాడ్రేవు చిన వీరభద్రుడు గారు పరిచయం చేస్తున్నారు. నాకు మనసు వ్యాకులమైనప్పుడు నచ్చిన కవిత్వాన్ని పాతదైనా కొత్త దైనా మళ్ళీ మళ్ళీ చదువుతాను. కవిత్వం ఒక సాంత్వన. సంగీతంలాగే.

***ప్రస్తుతం ఏం వ్రాస్తున్నారు ?***

మెనీ రామాయణాస్ అనే వ్యాస సంపుటిని అనువాదం చేస్తున్నాను . హెచ్ బీ టీ కోసం.

ఇంటర్వ్యూ : వొరప్రసాద్ ◆

# మనాది

- అనిల్ డ్యాని
9703336688



నీలమ్మ వేపచెట్టు మొదట్లో ఏమో వెతుకుతున్నట్టు
కంగారుగా తిరుగుతున్న గండుచీమల గుంపు
ఇక్కడ చెట్టుకి పట్టిన తేనె తుట్టెని
ఇప్పపూల చెట్ల మీద వదిలిపెట్టిపోయిన
దాహాన్ని తలుచుకుంటూ నగరం రోడ్లమీద
తిరుగుతున్న ఒకానొక ప్రాణాత్మ కంట్లో ఎర్రని జీర

సాలూరవతల సవర్ల కొండ మీదుగా
పసిపాపల్లా పారాడుతున్న ఖాళీ మబ్బుల్లో
ఒక దిగులు మేఘం కూడా అలాగే తిరుగుతుంది

ఎక్కడిది ఇంత పచ్చదనం
మనుషుల్లోంచి అడివిలోకి పాకిందా
అడవిలోంచి మనుషుల్లోకి పాకిందా
ఏమో మరి ఒక ఊదురుగొట్టాన్ని పొయ్యి ముందేసుకుని
పొగలేవకుండా ఊపిరిని పొయ్యిలోకి నెట్టి
కళ్లవెంబడి కారిన తల్లుల కన్నీళ్లతో అలా పారుతున్న
ఈ బంగాళాఖాతాన్ని అడగాలి

ఎవడో ఏసీగదులలో పడుకుని
ఈ కనుమల మధ్యన ఒక వ్యాపారాత్మక కలకంటాడు
ఇక్కడి చేపల్ని వేటాడి విదేశి ఎండకు ఎండబెడతాడు
ఇక్కడి మకరందాన్ని సీసాలో బంధించి
తెల్లతోలువాడికి కప్పులో కాఫీలా కలిపిస్తాడు
ఏళ్ళ తరబడి గిరిజనుల కడుపునింపుతున్న
అడవితల్లి మౌనంగా దుఃఖించిన సందర్భం అది

ఎన్ని దేహాలలా వలస పోతాయి ఈ ఊరు చెట్టుమొదలు
వదిలి
బరంపురమా ? దట్టమైన దివాణం వైపా ఎటు పోవాలి
అగనంపూడి ఆకాశవాణైనా ఒక్క నిజాన్ని పలకదు
నిలువునా పాతుకుపోయిన చిమ్మచీకటిలో
సాయం కోసం అరచిన ఆదివాసీ అరుపులా అంతా
అయోమయం

ఏపుగా పెరిగిన నగరం కైపు గా
పల్లె మనుషుల వీపుల మీదకెక్కి నృత్యం చేస్తుంది
మనదికాని దాన్ని మనకి పులిమి
దానికి నాగరికత అని పేరుపెడుతుంది

మంచుకురిసే వేళలో ఉక్కపోత అనుభవం
ఇప్పుడు ఉక్కునగరం డాల్ఫిన్ ముక్కున చేప పిల్ల

మూడు రాళ్ల మీద కుండలో వండుకున్న
అన్నం కుండలో వాడెవడో చేయి పెడతాడు
నిండారా పిండుకున్న తేనెని తన బ్యూటీ టిప్స్‌కి
వాడుకుంటాడు
జలపాతాల మధ్యన స్నానమాడుతున్న ఒక వనకన్యని
వాడు ప్రపంచ విపణిలో ఒక చిత్తరువుగా గీసి అమ్మేస్తాడు
ఈ నలుపుదేహాల మీద ఒక్కసారైనా సూరీడు ఎండకురిపిస్తే
బాగుండు

ఏం పిల్లడో ఎల్దుమొస్తవా
ఎత్తైన రాత్రి మెరుపుల కైలాసనగరము
ఎల్లమ్మతల్లి చౌరస్తాలోంచి మెల్లగా
సాగిపోతున్న బతుకునావలు

ముగ్గురు కాళికల మహానగరం
ఒక్క గాలీ వానకి కుప్పకూలగా మిగిలిన మూగజీవాలు
ఇసకకొండమీదుగా ఎర్రమట్టిదిబ్బల గాలి వాసన
తన శరీరాన్ని గుండ్రగా చుట్టేసుకుని
పడుకున్న కొండచిలువలా మెలికలు తిరిగిన
ఈ రహదారి మీదుగా
ఇంత ప్రపంచం వచ్చి చూస్తున్న చోట
ఒక్కడంటే ఒక్కడు కూడా మనాదిగా
తిరుగుతున్న మనిషిని చూడలేదు
నగరం నిద్రపోతున్న వేళ
ఒక్క లైట్ హౌస్ మా జగదాంబా జంక్షన్లో పాతండి
ఆ సముద్రం ఆరిపోయే లోపు ఒక్క మడిసైనా
అగపడతాడు ♦



# భాషా వైవిధ్యాలు వైరుధ్యాలు కావు

- తెలకపల్లి రవి

***తిరుపతిలో 2012లో తెలుగు మహాసభలు జరిగాయి. ప్రస్తుతం హైదరాబాద్‌లో జరగబోతున్నాయి.. ఇలాంటి మహాసభలు మన మాతృభాషాభివృద్ధికి ఏ విధంగా దోహదం చేస్తాయంటారు..?***

మన భాషను, సాహిత్యాన్ని స్మరించుకోవటానికి.. తద్వారా మనలో ఉత్సాహం నింపుకోవటానికి, భాషా కోవిదులు, సాహితీవేత్తలు ఒక దగ్గర కలుసుకోవటానికి ఇవి తప్పకుండా ఉపయోగపడతాయి. భాషా స్ఫూర్తిని రగిలించటానికి అవి దోహదపడతాయనటంలో ఎలాంటి సందేహం లేదు. గతంలోని ఘనకీర్తిని, తెలుగు భాషా వైభవాన్ని నెమరు వేసుకోవటానికి కూడా ఇవి ఉపయోగపడతాయి. ఇదే సమయంలో అధికార భాషకు సంబంధించిన ఉత్తర్వులు పూర్తిగా అమలు కానప్పుడు ఒకట్రెండుమార్లు నిర్వహించే సభల వల్ల తెలుగు పరిస్థితి మారుతుందని ఆశించలేం.

***అభ్యుదయ సాహిత్యంపట్ల అసహనం కొనసాగుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో మహాసభల పాత్ర ఎలా ఉండాలంటారు..?***

పురోగామి దృష్టితో జనాన్ని చైతన్యపరిచే ప్రజాసాహిత్యానికి పట్టం కట్టినప్పుడే ఎలాంటి సభలైనా సార్థకం అవుతాయి. అంతేగాని గత వైభవాన్ని కీర్తించి వదిలేసినప్పుడో, వ్యక్తిగత భుజకీర్తులవల్లో సమాజానికి ఉపయోగం ఉండబోదు. తెలంగాణ సాంస్కృతిక సారథుల్లో ప్రముఖులైన సురవరం ప్రతాపరెడ్డి.. ఈ కమ్యూనిస్టుల్లో ఏ ఇంద్రజాలమున్నదోగాని 'బానిసోణ్ని దొరా..' అన్న ప్రజల్లో కూడా పోరు చైతన్యం కలిగించారంటూ అభినందించారు. తెలంగాణ పోరాటం అంటే ఒక కఱ్ఱ, ఒక బుఱ్ఱ అంటూ ఆయన అభివర్ణించారు. మరోవైపు పెద్ద బాలశిక్ష ఫెయిల్, ప్రజాశక్తి పాస్ అంటూ సామాన్య ప్రజలు చేసిన సాహిత్య సృష్టిని అధికార ఆశ్రితులు అపహాస్యం చేశారు. ఇలాంటి చీకటి కోణాల నుంచి అలాంటి ఘట్టాలను వెలికి తీయాలి. ఇప్పటికైనా అలాంటి ఆలోచనా ధోరణిని తోసిపుచ్చాలి. రాజకీయాల్లో కోరుకునే ప్రజాస్వామ్యం.. భాషా, సాహిత్య రంగాల్లో కూడా రావాలన్నది గురజాడ సూక్తి. దేశంలో ప్రస్తుతం పునరుద్ధరణవాదం కొనసాగాలని చాలా మంది భావిస్తున్నారు. అభ్యుదయ భావాలపట్ల అసహనం, భావ స్వేచ్ఛను అణచివేయటంలాంటి దుష్పరిణామాలు కొనసాగుతున్నాయి. మహాసభల్లో పాల్గొనే సాహితీ మిత్రులు.. ఇలాంటి వర్తమాన వాస్తవ పరిస్థితులన్నింటినీ గమనించాలని కోరుతున్నా.

***మహాసభల ఆహ్వానాలు, రిజిస్ట్రేషన్లు, రుసుములకు సంబంధించి కొన్ని విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. దీనిపై మీరేమంటారు..?***

రిజిస్ట్రేషన్ ఫీజులు, వాటిలో తేడాలు, వాటికి పరిష్కారాలు, ఆహ్వానాల్లో హెచ్చు తగ్గులు.. ఇవన్నీ నిర్వహణకు సంబంధించినవి. కొత్త రాష్ట్రంలో గతం నుంచి ఉన్న కొన్ని అభిప్రాయాలు, ఆకాంక్షలను బాగా చూసుకునే క్రమంలో నిర్వాహకులు మహాసభలను వేదికగా వాడుకోవడానికి ప్రయత్నిస్తుండవచ్చు. అయితే ఒక రాష్ట్రంలోని జిల్లాలు, కులాలు, స్త్రీ, పురుషులు, మెజారిటీ, మైనారిటీల మధ్య తేడాలు, వాటికి సంబంధించిన ఫిర్యాదులున్నప్పుడు మొదట్లో కలిసి, ఆ తర్వాత విడిపోయి, మళ్లీ కలిసి మళ్లీ విడిపోయి మనుగడ సాగించిన తెలుగు ప్రజల ప్రస్థానంలో వర్తమాన, వాస్తవాన్ని ప్రతిబింబించే విషయాలుగానే వీటిని మనం చూడాల్సి ఉంటుంది. ఏదేమైనా ఈ మహాసభలను తెలంగాణ తెలుగు

మహాసభలుగా జరపాలన్న సూచనలను ముఖ్యమంత్రి కేసీఆర్ అంగీకరించకపోవటంలో రాజకీయ, సాంస్కృతిక వాస్తవికత గోచరిస్తున్నది. రాష్ట్రం ఏర్పడిన మూడున్నరేండ్లలోనే తెలుగు భాషా ప్రాతిపదికన ఇంత పెద్ద సభలను నిర్వహించటాన్ని ఒక సుహృద్భావ, స్వాంతన ప్రక్రియగా చూడాలి. నిజానికి రాజకీయ నాయకులు ప్రదర్శిస్తున్న ఈ వాస్తవికతను చరిత్రకారులు, సాహిత్యకారులు అనబడే కొందరు ప్రదర్శించలేకపోవటమే ఆశ్చర్యకర అంశం.

***మహాసభలను బహిష్కరిస్తున్నామంటూ విరసం ప్రకటించింది. ఇవి ప్రజల సభలు కాదు.. పాలకవర్గాలవంటూ ఆ సంస్థ పేర్కొంది...దీనిపై మీ కామెంట్...?***

ప్రభుత్వాలు ప్రతి సందర్భాన్నీ వాడుకోవటం ఊహించదగినదే. అదే సమయంలో ఆ ఒక్క కారణంతోనే ప్రతి సందర్భాన్నీ వ్యతిరేకించే అవసరం ఉందా? లేదా? అన్నది ఆయా సంస్థల ఆలోచనలబట్టి ఉంటుంది. 1975లో తెలుగు మహాసభలను పునరుద్ధరణవాది విశ్వనాథ, మహాప్రస్థాన కవి శ్రీశ్రీ కలిసి బహిష్కరించారు. ఆ తర్వాత విశ్వనాథ మహాసభలకు హాజరయ్యారు. శ్రీశ్రీ అరెస్టయ్యారు. అప్పటికీ, ఇప్పటికీ ఆయా సంస్థల్లో చాలా మార్పులు వచ్చాయి, వస్తున్నాయి. ఇంతకముందు నేను చెప్పినట్టు.. 'తెలంగాణలో ప్రథమ మహాసభలు'గా వీటిని పరిగణించాలి, ఆ విధంగా అర్థం చేసుకోవాలి.

**తెలుగు రాష్ట్రాల్లోని ప్రముఖ గ్రంథాలయాలన్నీ ఇప్పుడు నిధులు, నిర్వహణ లేక దీనస్థితిలో కొట్టుమిట్టాడుతున్నాయి. వీటిని పునరుద్ధరించకుండా తెలుగును ఉద్ధరించటం సాధ్యమా..?**

వీరోచిత తెలంగాణ సాయుధ పోరాటంలోగాని, స్వాతంత్ర్య సంగ్రామంలోగానీ గ్రంథాలయాలు కీలకపాత్ర పోషించాయి. వీటి ద్వారా ప్రజల్లో చైతన్యం ప్రసరించింది. ఈ కారణంతోనే ఆ రోజుల్లోనే నిజాం రాజు ప్రజాశక్తి పత్రికను నిషేధించాడు. భాష అనేది పుస్తకాలు, చర్చల ద్వారా వికసిస్తుంది. ఆధునిక అవసరాలకు తగ్గట్టుగా పదజాలాలను పెంచాల్సిన అవసరం ఉంటుంది. ఇలాంటి విషయాల్లో తెలంగాణ, కేరళ, బెంగాల్ లాంటి రాష్ట్రాలు ముందుండగా.. తెలుగు రాష్ట్రాలు వెనుకబడిపోయాయి. ఉభయ రాష్ట్రాల్లోని అనేక ప్రసిద్ధ గ్రంథాలయాలు ఇప్పుడు నిధుల్లేక వెలవెలబోతున్నాయి. సిబ్బందికి జీతభత్యాలివ్వటం కనాకష్టంగా మారింది. నిజం చెప్పాలంటే రచయితలు, సాహితీవేత్తలను శాలువాకప్పి సత్కరిస్తే సరిపోదు.. పుస్తకాలను పునర్ ముద్రించాలి.. తద్వారా గ్రంథాలయాలను తిరిగి బతికించాలి. అప్పుడే తెలుగు బతికే అవకాశం ఉంటుంది.

***పన్నెండో తరగతి వరకూ తెలుగును తప్పనిసరి చేస్తామంటూ ముఖ్యమంత్రి చెప్పారు. తెలుగు చదివిన యువతకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు మెండుగా కల్పిస్తామంటూ ఆయన ప్రకటించారు. ఇది సాధ్యమేనంటారా...?***

దీనికంటే ముందు మనం కొన్ని అంశాలను పరిశీలించాలి. తెలుగు పిల్లలు మాతృభాషను చదవకుండా నెట్టుకొచ్చే పరిస్థితి పోవాలి. ఇందుకు సంబంధించిన ఉత్తర్వుల అమల్లో ఉన్న ఆటంకాలను అధిగమించాలి. బోధన, పాలన, సాహిత్య రంగాల్లో ఏకకాలంలో సమానంగా తెలుగును అమలు జరపాలి. అప్పుడే తెలుగు నిజంగా అభివృద్ధి చెందుతుంది. మాతృభాషలో చదివిన వారికి దాని ఫలాలు దక్కుతాయి. ఈ ప్రక్రియలో ఆధునిక మీడియా కూడా బృహత్తర పాత్రను పోషించాల్సి ఉంటుంది. ఇందుకోసం విద్యాపరంగానూ, మీడియా రంగంలోనూ కూడా తగిన తోడ్పాటునందించాలి.

**ఇంటర్వ్యూ – ఎం.వి.ఎస్. పద్మరాజు**

***నవతెలంగాణ 08.12.2017 సౌజన్యంతో***

♦♦♦

**భా**రీగా జరిగిన సభల్లో పదివేలమందికి పైగా పాల్గొన్నారు. యాభై కోట్లనుకున్న ఖర్చు వందకోట్లు దాటినట్టు వార్తలు వచ్చాయి. సభల నిర్వహణ తీరు ఈ వ్యాఖ్యల సమంజసత్వాన్ని ధృవపరచింది. సంప్రదాయ సాహిత్యానికి అవధాన విన్యాసాలకు అత్యధిక ప్రాధాన్యత నివ్వగా అభ్యుదయ సాహిత్యం మరీ ముఖ్యంగా తెలంగాణ సమర సాహిత్యం, అమూల్యమైన జానపద కళలు సముచిత స్థానం పొందలేకపోయాయి. సామూహిక సమ్మేళనాల్లో కవులూ రచయితలకు తగిన గుర్తింపు లేని తొక్కిసలాట జరిగిందంటూ నిరసన తెలిపారు. సత్కారాల సమరంలో ఒక్క శాలువాతోనే వందలాది మందికి సత్కారం చేసిన వైపరీత్యం ఆగ్రహం తెప్పించింది. అయితే గొంతెమ్మ కోర్కెలు కోరవద్దంటూ నిర్వాహకులు కొందరు మందలించారు. ఇక వేడుకలకు ప్రజాగాయకుడు గద్దర్ వంటివారిని, పొరుగు తెలుగు రాష్ట్ర ముఖ్యమంత్రిని ఆహ్వానించి వుంటే బావుండేదన్న విమర్శ వచ్చింది. సినిమా తారలు భారీ ఎత్తున పాల్గొని సత్కారాలు పొందడమే గాక ముఖ్యమంత్రిని పొగడ్తలతో ముంచెత్తారు. చివరలో తెలుగు భాషాభివృద్ధికి చర్యలు ప్రకటిస్తారని భావించినా తర్వాత చర్చించి ప్రకటిస్తామని ఆయన చెప్పారు. ఇప్పటి నుంచి ప్రతిఏటా డిసెంబరులో తెలుగు మహాసభలు జరుగుతాయన్నారు. ♦




# ఘనంగా తెలుగు మహాసభలు వెలిగేనా భాషాప్రభలు?

- సత్యాజీ
94900 99167

హైదరాబాదులో ఐదు రోజులపాటు ప్రపంచ తెలుగు సభలు ఘనంగా జరిగాయి. వేలాదిమంది హాజరయ్యారు. వందలాదిమంది ప్రసంగించారు. 1500 మంది దాకా కవిత్వం చదివారు. హైదరాబాదు మొత్తం సాహితీ శోభ సంతరించుకొంది. సభలు జరిగిన తీరు నభూతో నభవిష్యతి అన్నారు – సభల నిర్వాహకులు, తెలంగాణా సాహిత్య అకాడమీ అధ్యక్షుడు నందిని సిధారెడ్డి. పేరుకు ఇవి ప్రపంచ తెలుగు మహాసభలు అయినప్పటికీ– తెలంగాణ సాహిత్యానికి పట్టం కట్టే సభలని, మరుగున పడిన తెలంగాణ సాహితీవేత్తలను వెలుగులోకి తెచ్చే సభలని నిర్వాహకులు ముందే చెప్పారు. 40 వేల మంది కూచొని వీక్షించగల లాల్ బహుదుర్ శాస్త్రి స్టేడియంలో ప్రధాన వేదిక ఏర్పాటు చేశారు. సభల ప్రారంభం, ముగింపు కార్యక్రమాలు అక్కడ జరిగాయి. రెండు సందర్భాల్లోనూ స్టేడియం జనంతో కిక్కిరిసిపోయింది. ఈ స్పందన తెలుగు ప్రజల భాషాభిమానానికి నిలువెత్తు నిదర్శనం. వేదికలను తీర్చిదిద్దటంలో, తెలంగాణ సాంస్కృతిక, చారిత్రిక విశేషాలను లఘుచిత్రాలుగా ప్రదర్శించటంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించారు. వీక్షకుల భావోద్వేగాలను బంధించి ఉంచటంలో అవి బాగా తోడ్పడ్డాయి. ఆరంభ, ముగింపు సభల్లో వెలుగు జిలుగుల బాణాసంచా, లేజర్ కిరణాల తళతళలూ మంచి ప్రచారం తెచ్చిపెట్టాయి. అయితే, సభల లక్ష్యమూ, పరమార్థమూ అది కాదు. తెలుగు భాష పరిరక్షణ, పరివ్యాప్తి; నూతన తరాల్లో దాని వాడుక, రోజువారీ వ్యవహారాల్లో తెలుగు చెల్లుబాటు... వంటివి సభలకు చర్చనీయాంశాలు.

ఇవి 5వ ప్రపంచ తెలుగు మహాసభలని మీడియా పేర్కొంది. కానీ, తెలంగాణ ప్రభుత్వం అలా భావించలేదు. ప్రపంచంలోని అన్ని ప్రాంతాల నుంచి తెలుగువారు వస్తున్నారు కాబట్టి– ఇవి ప్రపంచ తెలుగు మహాసభలు. తిరుపతిలో జరిగిన 4వ ప్రపంచ తెలుగు మహాసభలకు కొనసాగింపు మాత్రం కాదు. అందుకనే '5వ' అని పేర్కొనకుండా 'ప్రపంచ తెలుగు మహాసభలు' అని మాత్రమే రాశారు, ప్రస్తావించారు. వీటిని తెలంగాణ తెలుగు మహాసభలుగా జరపాలనే చర్చ తొలుత జరిగింది. దానికి ముఖ్యమంత్రి కెసిఆర్ అంగీకరించలేదు. 'అన్ని ప్రాంతాల నుంచి తెలుగువారిని పిలుద్దాం. మన తెలంగాణ భాషను, చరిత్రను వివరిద్దాం.' అనే దృక్పథం తీసుకున్నారు. ఆ విధంగానే నిర్వహించారు.

తెలుగు భాష తెలంగాణాలోనే పుట్టిందని, అక్కడే వర్థిల్లిందని, ఉమ్మడి రాష్ట్రం హయాంలో ఆ ప్రభావాన్ని కోల్పోయిందని, పైగా చిన్నచూపు చూడబడిందని ఈ సభల్లో కొంతమంది వక్తలు చెప్పారు. అందుకు అనేక ఉదాహరణలు ఉటంకించారు. ఆదికవి నన్నయ కాదని, అంతకుముందే తెలంగాణలో తెలుగు కావ్యాలు ఉన్నాయని ఉదహరించారు. పాల్కురికి సోమన తదితరులు చేసిన సాహిత్య సేవలను ఉదహరించి, ఆ కీర్తి వారికి చెందాలని చెప్పారు. ఈ విషయంలో అభ్యుదయవాదులు మొదటినుంచి ప్రాంతాలకు అతీతంగా వినిపిస్తున్న వాదన ఒకటి ఉంది. తెలుగు భాష, తెలుగు కావ్యాలు, తెలుగు కథలూ ప్రాచుర్యంలో లేకుండా హఠాత్తుగా మహా కావ్యాలు పుట్టుకురావు. ఆదికవుల ఆరాధనలో పడి మనం సోదికవులను మర్చిపోయామని, అందుకనే మన భాషాసాహిత్యాల చరిత్రను, విస్మృతిని మనకు మనమే కుదించుకున్నామని ప్రగతిశీల సాహితీవేత్తలు చెబుతూనే ఉన్నారు. ఇలాంటి విషయాలను ప్రాంతాలపరంగా కాక దృక్పథాలపరంగా, పాలకవర్గ ప్రయోజనాలపరంగా అవలోకిస్తేనే వాస్తవం అవగతమవుతుంది. ఏ కాలంలోనైనా భాషాసాహిత్యాలు బలమైన ఆయుధాలు. వాటిపై పాలకవర్గాలు అదుపాజ్ఞలను కలిగిఉండాలని ప్రయత్నిస్తాయి. రాచరిక ప్రభువుల కాలంలో, సంస్థానాల హయాంలో జరిగింది ఇదే! సమాజం యథాతథంగా సాగిపోవడమే పాలవర్గాలకు కావాలి. దానిలోని డొల్లతనంపైనా, లొసుగులపైనా, అప్రజాస్వామిక వాతావరణంపైనా విరుచుకుపడడం కవులూ, రచయితల లక్షణం, లక్ష్యమూ. ఏ కాలానికైనా ఇది వర్తిస్తుంది. ప్రభువులను కీర్తించటం కాక ప్రజాస్వామిక భావనను వ్యక్తీకరించే ఏ కవి అయినా పాలకులకు కంటగింపే! ప్రాంతాలతో, దేశాలతో సంబంధం లేకుండా అలాంటి కవులు అన్ని చోట్లా అణచివేతకో, విస్మరణకో గురవ్వడం చారిత్రక సత్యమే! తెలంగాణాలో నిజాం హయాంలో తెలుగు పలుకుబడి చెల్లుబాటు కాలేదు. ఉర్దూ అధికారిక భాషగా

రుద్ధబడి, తెలుగు భాష ప్రజలకే పరిమితం అయింది. ప్రాచీన కాలంలోని సోమన, పోతనలే కాదు, ఆధునిక కాలంలో వేమన, ఆ తరువాత గురజాడ, కందుకూరి లాంటివారు కూడా విస్మరణకు గురైనవారే! 1930ల నుంచి మన ప్రజాసాహిత్య వారసత్వాన్ని వెలికితీసే పనిని కమ్యూనిస్టు ఉద్యమం పెద్దఎత్తున చేపట్టింది. దరిమిలా గురజాడ, కందుకూరి వంటివారి రచనలు ఎన్నో వెలుగు చూశాయి. ఇప్పటికీ ఎక్కడికక్కడ ప్రజాసాహిత్యవేత్తలను, వారి రచనలనూ వెలికితీసి ప్రాచుర్యం కల్పించాల్సిన అవసరం ఉంది.

కానీ, అలాంటి దిశానిర్దేశం ఈ సభల్లో జరగలేదు. ఈ సందర్భాన్ని ఒక సాంస్కృతిక సంబురంగా జరపటానికి ఇచ్చిన ప్రాధాన్యం తెలుగు భాషాసాహిత్యాలపై విస్తృత చర్చకు, కార్యాచరణకు ఇవ్వలేదు. సాంప్రదాయ పద్యానికి, అవధానానికి ఇచ్చిన ప్రాముఖ్యం వర్తమాన అంశాలకు ఇవ్వలేదు. సారస్వత పరిషత్ వేదికగా శతావధానం నాలుగు రోజుల పాటు జరుగుతూనే ఉంది. రవీంద్ర భారతి మినీ వేదికపైనా అవధానాల సందడి దండిగానే నడిచింది. ప్రధాన వేదికపైనా కెసిఆర్ పద్యాలాపన, ప్రాచీన సాంప్రదాయాల ఉద్ఘాటన ఘనంగా జరిగింది. అవధానాల వేదికను కెసిఆర్ స్వయంగా సందర్శించి, అందులో పాల్గొని, అందరి అభినందనల పద్యమాలలు అవధరించి మరీ సంతోషపడ్డారు. ప్రజాసాహిత్యంతో, ప్రజాస్వామిక భావనలతో సంబంధం లేని పద్యం, అవధానం వంటి ప్రక్రియలు భాషాభివృద్ధికి, తెలంగాణా సాహితీ తేజస్సు పరివ్యాప్తికీ ఏ విధంగా దోహదపడతాయన్నది ప్రశ్న. అవధానం అనేది ఒక సాహిత్య క్రీడ. ధారణతో, చతురతతో ప్రదర్శించే ఒక వినోదం. దానిలోనూ సమకాలీన అంశాలు, వర్తమాన సమస్యలూ కొన్ని చొప్పిస్తున్నప్పటికీ– ఎక్కువ భాగం పొగడ్తలకు, అవధాని ప్రజ్ఞా ప్రదర్శనకే పరిమితం. తెలుగు భాషా సొగసును పొగడడం, కెసిఆర్‌ను కీర్తించటం చాలా పద్యాల్లో చర్విత చర్వణంగా ప్రతిధ్వనిస్తూనే ఉంది. ప్రజాస్వామిక యుగంలోనూ ఈ తరహా ఫ్యూడల్ భావజాలం, స్తోత్రాల పఠనం హర్షణీయం కాదు.

వర్తమాన సమాజాన్ని అన్ని విధాలా ప్రతిబింబించే, ప్రశ్నించే కథ, నవల, విమర్శ, పాట, కవిత్వం వంటి ఆధునిక ప్రక్రియలు మనకు ఉన్నాయి. వాటికి ఈ మహాసభల్లో 12 అంశాలుగా 40 గంటల సమయం కేటాయిస్తే– అవధానాలకు, పద్యాలకు దాదాపు 80 గంటల సమయం కేటాయించారు. ప్రజా సాహిత్యానికి, భాషాభివృద్ధికి దోహదపడని అంశాలకు అత్యధిక సమయం కేటాయించటం విమర్శల పాలైంది. అలాగే, సాహిత్యం నేడు బహుముఖాలుగా, బహు గళాలుగా విస్తరించి ప్రవహిస్తోంది. మహిళలు, మైనార్టీలు, దళితులు, గిరిజనులు వంటి విస్మరిత తరగతులు రెండు మూడు దశాబ్దాలుగా బలంగా గళమెత్తి సాహిత్య సృజన చేస్తున్నాయి. అనేక వాదనలను, ఆలోచనలను సాహిత్య రంగం మీదికి తెచ్చాయి. కానీ, ఈ మహాసభల సందర్భంగా అలాంటి భావధారకు అవకాశం ఇవ్వలేదు. పాట ద్వారా, సాహిత్య సృజన ద్వారా ప్రజాబాహుళ్యంపై గట్టి ముద్ర వేసిన గద్దర్, విమల వంటి వారిని సభలకు పిలవకపోవడం అప్రజాస్వామికమే అనిపించుకొంది. తోటి తెలుగు ముఖ్యమంత్రిని సభలకు ఆహ్వానించకపోవడం కూడా చర్చనీయాంశం అయింది.

తెలుగు భాష వాడుక, దానికి సంబంధించి చేపట్టాల్సిన చర్యలపై మహాసభల్లో తూతూమంత్రంగానే చర్చ నడిచింది. వేదికలపై భాషానిపుణులకు స్థానం ఇవ్వలేదనే విమర్శ ఉంది. 200 మంది ప్రేక్షకులు మాత్రమే పట్టగలిగిన చిన్న వేదికలను ఈ అంశాలపై చర్చకు ఉపయోగించారు. న్యాయస్థానాల్లో, పరిపాలనా విభాగాల్లో తెలుగు ద్వారా పనులు జరుగుతాయా? అధికార యంత్రాంగాన్ని, ఉపకరణాలను అందుకు అనుగుణంగా సంసిద్ధం చేయగలరా? అని ఈ సదస్సుల్లో విషయ నిపుణులు ప్రశ్నలు గుప్పించినా– సమాధానం చెప్పే పెద్దలెవరూ వేదికల మీద లేరు.

ఈ సభల్లో నిబద్ధతతో కూడిన చర్చ కన్నా ఉత్సవ వాతావరణానికే అధిక ప్రాధాన్యం కనపడింది. సాహిత్యంపై సమగ్ర అవలోకనం కంటే పద్యం, కవిత్వం వంటి ఉద్వేగ ఇతివృత్తాలకే పెద్ద పీట దొరికింది. పద్యాలూ కవిత్వమూ చదివిన ప్రతి ఒక్కరికీ సన్మానాలూ, నగదు బహుమానాలు అందించారు. 900 మందిని కవిత్వానికి ఆహ్వానిస్తే 1500 మంది పోటీ పడి మరీ చదివారని నిర్వాహకులు చెప్పారు. ఇంకా ఎంతోమంది తమకు అవకాశం ఇవ్వలేదని ధర్నా చేశారు. అసంతృప్తి వ్యక్తంచేశారు. ముగింపు సభలో తెలుగు సాహిత్య భాషాభివృద్ధికి ముఖ్యమంత్రి కెసిఆర్ మరికొన్ని అకాడమీల పునరుద్ధరణ, నిధుల కేటాయింపు వంటి ప్రకటనలు చేస్తారని ప్రతినిధులు ఆశించినా అలాంటిదేమీ జరగలేదు. సంబరాలు, పద్యానికి నజరానాలతోనే భాషోద్ధరణ అనుకుంటే పొరపాటు. మాతృభాష వికాస ప్రకాశాలకు అంతకుమించి చేయాలి. భావోద్వేగాలతో గతాన్ని కీర్తించుకోవడంతో వదిలేయకుండా వర్తమానంలో, అది కూడా ప్రజాస్వామిక పద్ధతుల్లో పటిష్ఠమైన చర్యలు చేట్టాలి. అప్పుడే మహాసభలకు సార్థకత. భాషాసాహిత్యాలకు బాసట. ◆

# ఐతిహాసిక రంగస్థలం - బ్రెహ్ట్ ప్రయోగాలు

ఆంగ్ల మూలం: వాల్టర్ బెంజిమన్
తెలుగు: పోపూరి అనంత లక్ష్మి



10.02.1898 - 14.08.1956

సోఫా మీద పడుకొని ఒక నవల చదవడం కంటే ఆహ్లాదకరమైన విషయమేమీ వుండదు – గత శతాబ్దంలోని ఒక మహాకావ్య రచయిత మాట ఇది. కథానిక చదువరులకు ఎంతటి ఉపశమనాన్ని కలిగిస్తుందో ఈ వ్యాఖ్యానం తెలియచేస్తుంది. కాని ఒక నాటకానికి వచ్చిన వ్యక్తిని తీసుకుంటే మనం ఎపిక్ థియేటర్‌లో అందుకు భిన్నమైన దృశ్యం వూహించుకోవలసి వస్తోంది.(ఎపిక్ థియేటర్ భావనను పెంపొందించిన వ్యక్తి బెరోల్ బ్రెహ్ట్. తన కవిత్వానికి తానే ప్రాతినిధ్య సిద్ధాంతాలు కనుగొన్నవాడు) ఈ దృక్పథంలోని ఉద్దేశం హాయిగా కొలువుతీరిన ప్రేక్షకులను ఆకర్షించడమే. వారైతే తీరికగా ఆస్వాదిస్తారు. ఇలాంటి ప్రేక్షకులు నవలా పాఠకుల లాగా ఒంటరిగా వుండరు. ఒక సమూహంగా వుంటారు. వారు చూసిన దానిపట్ల వైఖరిని త్వరగానే వెల్లడిస్తారు. ఈ వైఖరిని పరిగణనలోకి తీసుకోవాలని బ్రెహ్ట్ భావించాడు. ఎందుకంటే ఆ చెప్పే వారికి విశ్రాంతితోపాటు ఆసక్తి కూడా వుండటం ఆయన భావనకు మూలం. ప్రేక్షకుల ఆసక్తి మేరకు రెండు అంశాలు సమకూర్చబడ్డాయి. ఒకటి సంఘటనలను రంగం మీద చూపించడం. ఇవి ఎలా వుండాలంటే కొన్ని కీలకమైన సన్నివేశాలలో ప్రేక్షకులు తమ అనుభవం మేరకు వాటిని పరీక్ష చేయాలి. రెండవది : మొత్తం నాటక ప్రదర్శన కళాత్మక శక్తికి పనిపెట్టేదిగానే గాక పారదర్శకంగానూ వుండాలి. ఈ పారదర్శకత మామూలుగా చెప్పుకునే 'సరళత'కు భిన్నమైంది. దీన్ని సాధించాలంటే నిర్దేశకుడికి నిజమైన కళాత్మక మేధస్సు, నైపుణ్యం వుండాలి ఎపిక్ థియేటర్ ఆసక్తి కలిగిన ప్రేక్షక సమూహాలకు అవసరం వుంటే తప్ప ఆలోచించని వారికి ఉద్దేశించారు. బ్రెహ్ట్ జనం గురించి నిరంతరం తెలుసుకునేవారు. వారు ఆలోచనాశక్తిని ఉపయోగించడానికి కొన్ని షరతులున్నాయనేది దృష్టిలో వుంచుకుని ఈ పద్ధతి తీసుకున్నారు. ఈ సూత్రం ద్వారా ఆయన ఆలోచలను పదును పెట్టాడు. బ్రెహ్ట్ ప్రేక్షకులకు థియేటర్‌లో ఆసక్తి కలిగించాలనుకోవడానికి సాంస్కృతిక దృష్టి కారణం కాదు. తన రాజకీయ భావన కోసమే ఆయన ఆ పని చేశారు

### కథ

రంగం మీద చూపించినది సంచలనం రేపకుండా వుండటం కోసం ఎపిక్ థియేటర్ సిద్ధం చేయబడింది. ఎక్కువ

సార్లు ఇందుకు క్రొత్త కథ కంటే పాత కథే ఉపయోగంగా వుంటుంది. ఎపిక్ థియేటర్‌లో చూపించే సంఘటనలు తెలియనివై వుండాలా అనే ప్రశ్నను కూడా బ్రెష్ట్ పరిగణనలోకి తీసుకున్నాడు. ఎపిక్ థియేటర్‌కు, దాని కథకు వున్న సంబంధం బాలే టీచర్‌కు విద్యార్థులకు మధ్య వున్న సంబంధం లాంటిది. బాలే టీచర్ మొదటి పని విద్యార్థి కీళ్ళను వీలైనంతవరకు సడలించేట్లు చేయడం. (చైనా రంగస్థలం ఖచ్చితంగా ఈ పద్ధతినే అనుసరిస్తుంది. చైనా నాలుగవ గోడ అన్న తన గ్రంథంలో బ్రెష్ట్ తాను ఈ రంగస్థలానికి రుణపడివున్నట్టు చెబుతాడు) రంగస్థలంపై తెలిసిన విషయాలనే చూపించాలనుకుంటే చారిత్రక విషయాలు బాగా సరిపోతాయి. ఈ విషయాలను నటన ద్వారా, పోస్టర్స్ ద్వారా, కాప్షన్స్ ద్వారా కొనసాగించినట్లయితే ప్రేక్షకులలో సంచలనాన్ని తగ్గించవచ్చు. బ్రెష్ట్ ఒక నాటకంలో గెలీలియో జీవితాన్ని విషయంగా తీసుకున్నారు. గెలీలియోను అన్నిటినీ మించి గొప్ప ఉపాధ్యాయుడుగా చూపించాడు. గెలీలియో నూతన భౌతిక శాస్త్ర జ్ఞానాన్ని బోధించడమే కాదు, కొత్త పద్ధతిలోనూ చెప్పాడు. అతని చేతిలో ఒక విజ్ఞాన శాస్త్ర ప్రయోగము విజ్ఞాన శాస్త్ర విజయంగానే కాకుండా ఒక నూతన బోధనా పద్ధతిగా కూడా రూపుదిద్దుకుంటుంది. ఈ నాటకంలో ప్రధానమైన కేంద్రీకరణ గెలీలియో నూతన రూపంపైనే కాదు. ముగింపునకు ముందు సన్నివేశంలో ఈ ఐతిహాసిక ప్రక్రియ గోచరిస్తుంది. '1633-1642. మతాధిపతుల బంధీగా వున్న గెలీలియో చనిపోయేంతవరకు అన్వేషకుడిగానే శాస్త్రీయ పరిశోధనను కొనసాగించాడు. అంతేకాకుండా తన ప్రధానమైన ప్రయోగాలను రహస్యంగా ఇటలీ సరిహద్దులు దాటించాడు. కాలం గడిచేకొద్దీ ఎపిక్ థియేటర్‌కు, ట్రాజిక్ థియేటర్‌కు(విషాదాంత నాటకం) సంబంధం కొత్తరూపాలు తీసుకుంటుంది. ఇక్కడ ముగింపు కంటే అందుకు దారితీసే వివిధ సంఘటనలపట్ల ఎక్కువ ఉత్కంఠ వుంటుంది. ఆ విధంగా ఎపిక్‌థియేటర్ చాలా సుదీర్ఘ కాలాలను చూపించగలుగుతుంది.

### విషాద రహిత నాయకుడు

ఫ్రెంచి సంప్రదాయ రంగస్థలంలో ఉన్నత వర్గాల ప్రేక్షకుల కోసం నటుల మధ్యలో కొంతస్థలం వదలివేసేవారు. వారి పడక్కుర్చీలు బహిరంగ రంగస్థలంలో అడ్డుగా నిలిచివుండేవి. ఇది అసందర్భమని మన ఉద్దేశం. దీనికి సంబంధించి కొన్ని భిన్నాభిప్రాయాలున్నాయి. థియేటర్ అంటే 'నాటకీయత' అని మనం అంగీకరించిన భావం. రంగం మీద చూపించే సంఘటనల మధ్య వాటితో సంబంధం లేకుండా ఆలోచించే మనుషులతో కూడిన తటస్థ తృతీయ పక్షం కనిపించేట్టయితే నాటకీయ భావన నిలబడదు. కాని ఇలాటి ఆలోచనలే బ్రెష్ట్‌కు తరచూ వస్తుండేవి. మనం ఇంకొంచెం ముందుకు వెళ్ళి చెప్పాలంటే బ్రెష్ట్ ఆలోచనాత్మకమైన మనిషని, నిజానికి తెలివైన మనిషిని వాస్తవిక నాటక హీరోగా చేశాడు. ఈ కోణంలోనే ఆయన రంగస్థలాన్ని ఎపిక్ రంగస్థలం అనొచ్చు. ఈ ప్రయత్నం గ్లెగే పాకర్ అనే పాత్ర రూపంలో తారస్థాయికి చేరింది. 'ఎ మాన్స్ ఎ మాన్' నాటకం లోని హీరో గ్లెగే శూన్య రంగస్థలం లాగా సమాజంలోని వైరుధ్యాలను ఆవిష్కరించాడు. బ్రెష్ట్ ఆలోచనను మనం ఒక విధంగా అర్థం చేసుకోవచ్చు. "వివేకవంతమైన మనిషి" అసలైన ఖాళీ రంగస్థలం వంటి వాడే. ఏ విధంగా చూసినా గ్లెగే వివేకవంతమైన మనిషి. నాటకీయ స్వభావం లేని అత్యున్నత మానవుడు ఋషి - అని ప్లేటో ఎప్పుడో గుర్తించాడు. ఆయన 'పేథో'లోని భాషణలు ఋషిని నాటకానికి ప్రేరణగా నిలిపాయి. అలాగే భావావేశపు నాటకానికి కూడా ప్రేరణగా నిలిపాయి. మనకు పురాణాల నుండి తెలిసిన సమాచారం మేరకు క్రీస్తు కూడా విషాదరహితమైన సర్వశ్రేష్టమైన హీరోగా ప్రతిష్టించబడ్డాడు. కాని పాశ్చాత్య దేశాలలోని లౌకిక నాటకాలలో కూడా విషాదాంత నాయకుడి కోసమే అన్వేషిస్తూ వచ్చాడు. సిద్ధాంతవేత్తలతో ఘర్షణ వున్నప్పటికీ అలాంటి నాటకాలు ఎప్పటికప్పుడు క్రొత్త మార్గాలు వెతికి ప్రామాణికంగా చెప్పబడే గ్రీకు విషాద నాటకాలకు భిన్నంగా రూపొందాయి. ముఖ్యమైన, అదే సమయంలో అస్పష్టమైన ఈ మార్గం మధ్యయుగాలలో **Hroswith a and The mysteries** ద్వారా నడిచింది. **Barogue** కాలంలో **Gryphics and Calderon** ద్వారా తర్వాత మనం **Lenz** , **Grabb** లలో చివరిగా **strindberg** లో చూడవచ్చు. ఈ తరహాలో ఒక చివరన షేక్స్పియర్ సన్నివేశాలు స్మృతి చిహ్నాలుగా నిలిస్తే, తర్వాత రెండవ చివర గోథే దాన్నీ అధిగమించాడు. ఇది యూరప్ మార్గము, జర్మనీ మార్గము కూడా. రహదారికాకున్నా చెదురుమదురుగా నడిచిన మార్గం గురించి ఎవరైనా మాట్లాడారంటే అది మనల్ని అలముకున్న మధ్యయుగాల

**Barogue** నాటక వారసత్వం గురించే. ఈ మార్గం కఠినమైనదైనా బ్రెహ్ట్ నాటకాలలో మనకు కన్పిస్తుంది.

**అవాంతరాలు**

అరిస్టాటిల్ సిద్ధాంతీకరించిన పరిమితమైన అర్థంలో నాటకీయమైన రంగస్థలానికి తన ఎపిక్ థియేటర్ విరుద్ధమైందిగా బ్రెహ్ట్ భావించాడు. అందుకని తన నాటక రంగ సిద్ధాంత, ఆచరణలను అరిస్టాటిలియన్ కానిదిగా వర్ణించాడు. (రేమాన్ నాన్-యూక్లిడియన్ గణితాన్ని పరిచయం చేసినట్లుగా). ఈ పోలికని బట్టి చూస్తే మనకు నాటక రూపాల మధ్య పోటీ ప్రధానం కాదని తెలుస్తోంది. రేమాన్ **Ariom of parallels** (సమాంతర సీకృతం)ని వ్యతిరేకించాడు. అరిస్టాటిల్ నాటకంలోని ప్రేక్షకుడు హీరో జీవితాన్ని నడిపే 'విధిరాత'తో, భావోద్వేగాలతో లీనమై, తన భావోద్వేగాలను సంతృప్తి పరచుకోవడానికి చేసే ప్రయత్నాన్ని బ్రెహ్ట్ వ్యతిరేకించాడు.

తీరికైన ప్రేక్షకుల ఆసక్తి కోసం ఉద్దేశించబడిన ఎపిక్ థియేటర్ ప్రదర్శనల విషయంలో ఇంకా చేయవలసి వుంది. అది నాటకంతో ప్రేక్షకుల మమేకతను పెంచడంపై కేంద్రీకరించ కూడదు. ఎపిక్ థియేటర్ సామర్థ్యము (కళ) ప్రేక్షకునిలోని తాదాత్మ్య శక్తిని కాక ఆశ్చర్యాన్ని పురికొల్పడంపై ఆధారపడి వుంది. ఈ సిద్ధాంతం ఆధారంగా హీరోతో మమేకమవ్వడానికి బదులుగా ఏ పరిస్థితులలో తాము జీవిస్తున్నారో ఈ పరిస్థితులను చూసి తాము ఆశ్చర్యపోవడాన్ని ప్రేక్షకులు నేర్చుకొనేట్లు చేయాలి.

బ్రెహ్ట్ దృష్టిలో ఎపిక్ థియేటర్ లక్ష్యం పరిస్థితులను ప్రతిబింబించటం కాదు. ప్రకృతివాద సిద్ధాంత వేత్తలు భావిస్తున్నట్లు ప్రతిబింబించడం అంటే 'పునరుత్పత్తి' కాదు. మొదటిది ఆ పరిస్థితులను కప్పిపుచ్చుకుండా బహిర్గతం చేయడం. అవి విపరీతంగా (కొత్తగా) అగుపడేట్లు చేయడం. పరిస్థితులను యదార్థంగా చూపించడం 'అంతరాయం' అనే ప్రక్రియ ద్వారా తీసుకురావాలి. చాలా బండ ఉదాహరణ ఒక కుటుంబ ఘర్షణ. అకస్మాత్తుగా ఒక కొత్త వ్యక్తి ఒక ఇంటి లోపలికి ప్రవేశించేటప్పటికి భార్య కంచు విగ్రహాన్ని తీసుకుని తన కుమార్తె మీదకు విసురుతోంది, భర్త పోలీస్‌ను పిలవడానికి కిటికీ తెరుస్తూ వున్నాడు. 1900 సం॥లో దీనిని టాబ్లూ అనేవారు. ఆగంతకుడు కొన్ని సంఘటనల సమాహారాన్ని ఎదుర్కొంటున్నాడు. కల్లోలిత వదనాలు, తెరిచిన కిటికీ, చిందరవందరగా వున్న అంతర భాగం. మనం ఈ సన్నివేశాన్ని గమనిస్తే పెట్టుబడిదారుల జీవిత చిత్రణకు నిదర్శనగా నిలుస్తుంది. ఇది అరుదైన సంఘటన కాదు.

**The Quotable Gesture**

ఈ ప్రక్రియలో ప్రతి వాక్యం ప్రభావశీలతా ముందుగానే తెలుస్తుంది. దాన్ని వూహించుకోగలుగుతారు అంటాడు బ్రెహ్ట్ నాటకరంగ సిద్ధాంత ఆచరణ సందేశాత్మక కవితలలో ఒక చోట. అలా వూహించడానికి ప్రయత్నించగానే ప్రేక్షకులు వాటి గమనాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తారు. సూక్ష్మంగా చెప్పాలంటే నటనకు అంతరాయం కలుగుతుంది. మనం ఇంకొంచెం ముందుకు వెళ్ళి గుర్తు చేసుకుంటే అంతరాయం అనేది అన్ని రకాల రూపాలలో ఒక ప్రాథమిక పద్ధతి. ఇది కళారంగంలోనే గాక ఇంకా చాలా ప్రక్రియల్లో ప్రవేశించింది. ఇది దాని ఒక అంశం లక్షణం. ఒక సూక్తిని ఉటంకించడమంటే ఒక సందర్భానికి అంతరాయం కలిగించటమే. దీన్ని తేలికగానే అర్థం చేసుకోవచ్చు. కాబట్టి 'అంతరాయం' మీద ఆధారపడిన ఎపిక్ థియేటర్‌లో ఒక ప్రత్యేక అర్థంలో కోట్ చేయవచ్చు. దానిలోని మాటలు కోట్ చేస్తే దానిలో ప్రత్యేకత ఏమీ వుండదు. నటనలో హావభావాలు ఉపయోగించడం అనేది మరొక అంశం.

హావభావాలను ఉటంకించే విధంగా చేయడం అనేది ఎపిక్ థియేటర్ సాధించిన అత్యావశ్యకమైన విజయం. నటుడు తన హావభావాల ప్రదర్శన మధ్య వ్యవధి ఇవ్వాలి. ఉదాహరణకు: తన హావభావాలను కోట్ చేయడమనేది స్టేజ్ మీద నటుని ద్వారా ప్రభావవంతంగా జరగాలి. కాబట్టి సుఖాంతంలో **Carola Neher, Salvation army sergeant** పాత్రలో, అక్కడ **converts** ని తయారు చేయటానికి **seamen's tavern** లో పాడిన తర్వాత, ఆ పాట చర్చిలో పాడేకంటే ఆ సమయంలో ఆ ప్రదేశంలో ఆ పాడటమే సరైనదని, **'Salvation Army Council'** ముందు పాడేటపుడు ఆమె ప్రదర్శించిన హావభావాలను **quote** చేయాలి. ఒక కామ్రేడ్ మీద చర్య తీసుకున్నందుకుగాను పార్టీ ట్రిబ్యునల్ ముందు కొంతమంది కమ్యూనిస్టు సభ్యులు సంజాయిషీ ఇచ్చుకోవడానికి సంబంధించినది. ఈ విధంగా చేసేటపుడు వారు ఆ ఘటనను పునరావృతం చేయడమే కాక చర్య తీసుకోబడిన కామ్రేడ్ హావభావాలను కూడా పునః ప్రదర్శిస్తారు. మొత్తంగా చూసినపుడు అత్యంత నైపుణ్యము కలిగిన కళాత్మక పద్ధతే **Epic Theatre. Lehrstuck** లో సందేశాత్మకత కోసం వెంటనే

ప్రవేశ పెట్టబడింది. అన్ని సందర్భాలలోను ఎపిక్ థియేటర్ నిర్వచనం హావభావాల ప్రదర్శన **(gestural)** నటనలో భాగంగా చాలా తరచుగా ఎవరో ఒకరికి అంతరాయం కలిగిస్తే మరిన్ని హావభావాలను మనం పొందవచ్చు.

### సందేశాత్మక నాటకం

ఎపిక్ థియేటర్ ప్రేక్షకులకు ఎంతగా ఉద్దేశించబడిందో అంతే నటులకు కూడా. సందేశాత్మక నాటకం దానికదే ఒక ప్రత్యేక తరహా క్రిందకు వస్తుంది. ఎందుకంటే చాలా సామాన్యమైన పరికరాలు నటులు ప్రేక్షకులుగా, ప్రేక్షకులు నటులుగా పరస్పరం మారడానికి అవకాశం కల్పించటం. ప్రతి ప్రేక్షకుడు నటుడు కావచ్చు. హీరోగా నటించడం కంటే ఉపాధ్యాయునిగా నటించడం తేలిక.

**The flight of the lindberghs** యొక్క మొదటి రూపము మేగజిన్‌లో అచ్చయినప్పుడు వైమానికదళ హీరోగా కనిపించాడు. అతను వెలుగులోకి రావడానికి ఆ నాటకం ఒక వస్తువుగా ఉపయోగపడింది. రెండవ ముద్రణలో ఇది మరింతగా బహిర్గతమైంది. బ్రెహ్ట్ తనను తానుగా కొన్ని మార్పులు చేశాడు. **lindberghs flight** ప్రదర్శనపట్ల రెండు ఖండాలలో ఎంత ఆసక్తి పెరిగిందో చెప్పలేము! అది ఒక సంచలనమే రేపింది. అయితే అది తొందరలోనే మటుమాయమైంది. **Flight of the lindberghs** లో అనుభవం లోని అందాలను రాబట్టడానికి బ్రెహ్ట్ సన్నివేశం పరిధిని కోత కోశాడు. ఈ అనుభవం **lindberghs** పనినుండి (అంటే అతని విమానయానం నుంచే) పొందాల్సి వుంటుంది. అంటే బ్రెహ్ట్ దాన్ని **Lindberghs** (అంటే కర్షకులకే)తిరిగి ఇవ్వడంగా భావించాడు.

రాయల్ ఎయిర్‌ఫోర్స్‌లో చేరాలని తాను తీసుకున్న నిర్ణయం మధ్యయుగాల నాటి మనిషి మఠం లోకి ప్రవేశించడం లాంటిది అని సెవన్ పిల్లర్స్ ఆఫ్ విజ్డం రచయిత టీఎం లారన్స్ రాశాడు. ఈ ప్రకటనలో మనం **The flight of the Lindberghs** ఆ తరువాతి సందేశాత్మక నాటకాల లక్షణమైన **tension** ని మనం ప్రకటనలో చూడవచ్చు. ఒక మఠంలో వుండే కఠోరమైన శిక్షణా పద్ధతిని ఇక్కడ ఆధునిక సాంకేతిక ప్రక్రియను నేర్చుకోవడానికి అన్వయించారు. అంటే విమాన యానంలో శిక్షణ పొందడం. మరొకటి వర్గపోరాటం. ఈ రెండవ పద్ధతి అత్యంత సమగ్రంగా మనం మదర్ నాటకంలో చూడగలం. ఇదొక సాంఘిక నాటకం. ఆధునిక ప్రేక్షకులు ఎంతగానో అలవాటు పడిన మమేక సానుభూతి భావనను తిరస్కరించే సాహసోపేతమైన ప్రయోగం ఇది. ఈ సంగతి బ్రెహ్ట్‌కు బాగా తెలుసు. న్యూయార్క్ నగరంలో ఈ నాటకం ప్రదర్శించేప్పుడు ప్రేక్షకులను ఉద్దేశించి పంపించిన సందేశాత్మక కవితలో ఆయన ఇలా పేర్కొన్నాడు: మీరు చెప్పేది కార్మికులందరికీ అర్థమవుతుందా అని మమ్మల్ను చాలా మంది అడిగారు. అవతలివారి తిరుగుబాట్లతో విజయాలతో మమేకం కావడమనే మత్తు లేకపోతే ఒప్పుకుంటాడా? రెండు గంటలపాటు తనను ఉత్తేజితం చేసి అంతకు ముందుకన్నా అలసిపోయేట్టు చేసే, అస్పష్ట జ్ఞాపకాలు అంతకంటే అస్పష్టమైన ఆశలు కల్పించి పంపే ఆ భ్రమాత్మక కల్పనను వదులుకోగలుగుతాడా?

ఎపిక్‌థియేటర్ అనేది కుదుపులతో ఆరంబాలతో నడుస్తుంది. దాన్ని సినిమా ముక్కలతో పోల్చవచ్చు. విడివిడిగా చాలా శక్తివంతంగా వుండే వేర్వేరు నాటక భాగాలు ఒకదానిపై మరొకటి బలమైన ప్రభావం చూపించడం దాని మౌలిక రూపం. పాటలు, శీర్షికలు, హావభావ సంప్రదాయలు సన్నివేశాలను విడివిడిగా చూపిస్తాయి. ఫలితంగా లభించే విరామాలు భ్రమను పటాపంచలు చేస్తాయి. మమేకం కావడానికి సిద్ధంగా వుండే ప్రేక్షకుని మనస్థితిని ఈ విరామాలు భగ్నపరుస్తాయి. ప్రేక్షకుడు విమర్శనాత్మక దృక్పథం తీసుకునేలా చేయడమే వాటి పరమార్థం.(అంటే నాటకంలోని పాత్రల ప్రవర్తనా సరళినీ, ఆ ప్రవర్తనను ప్రదర్శించిన తీరును కూడా) విమర్శనాత్మకంగా చూడాలి. ఇక ఏది ఎలా చూపించ దలుచుకున్నారనేది పాత్రల హావభావాల ద్వారానే ఎపిక్‌థియేటర్ తెలియజేస్తుంది. నటుడు మాత్రం ప్రశాంతంగా వుండాలి. అతనికి సానుభూతి భావన వల్ల ప్రయోజనం లేదు. ఈ తరహా నటనకు సంప్రదాయ నటులు పెద్దగా సిద్ధమై వుండరు. నటనలో ఎలా వుండాలనేది వూహించగలిగితే మనం ఎపిక్‌థియేటర్‌కు చాలా వరకు దగ్గరగా వచ్చినట్టే.

బ్రెహ్ట్ ఇలా అంటాడు: నటుడు ఘటనను చూపించాలి. తనను తాను ప్రదర్శించుకోవాలి. తనను తాను చూపించుకోవడం ద్వారానే అతను ఘటనను చూపించడం ఎలాగూ జరుగుతుంది. అలాగే ఘటనద్వారా అతను తనను తాను చూపించుకుంటాడు. ఈ రెండు ఏకకాలంలో జరిగినప్పటికీ రెంటికీ మధ్య గల తేడా దెబ్బతినే విధంగా మాత్రం జరక్కూడదు. మరో విధంగా చెప్పాలంటే పాత్ర

# కొత్త ఉదయం

- బ్రౌన్
8985759460

సూర్యుడికి కొన్ని
రంగులు పూసి
దాన్నే కొత్త ఉదయం
అంటూ మురిసిపోతావు

అప్పుడు నువ్వు
కొత్త కాంతులతో
ముగ్గులేస్తూ
చీకటికి కాస్త
దూరం జరుగుతావు

కానీ అన్నీ
సీతాకోకచిలుకల ఉదయాలు కావు
గొంగళిపురుగు చీకటి రాత్రుళ్ళు
ఇంకా మెదడ్లోనే
దాగి ఉన్నాయి



ప్రతి ఉదయానా నీ హృదయం
పరిణతి చెంది కొత్త వెలుగులు చిమ్ముతుంది
మరిన్ని కొత్త రోజులకు
ఒక్కో ఉదయం ఒక్కో మెట్టవుతుంది

సముద్రపు ఒడ్డున నిలబడి
సూర్యాస్తమయాలు ఇక
మళ్ళీ చూడవు
ఇక అన్నీ సూర్యోదయాలే

ప్రతి ఉదయానికీ
కొన్ని మెళుకువలు అద్ది
మరో ఉదయం
ఓ గోడకి అతికించి
నిన్నటి జ్ఞాపకాలను
నెమరు వేసుకుంటూ
మరో కొత్త ఉదయంలో
అడుగు పెడతావు.....

---

వెలుపల తెలివిగా నటించడం నటుడు తెలుసుకోవాలి. అతను హాయిగా వుండాలి. సరైన సమయంలో (తన భాగం గురించి) ఆలోచిస్తున్నట్టు నటించాలి. ఆ సమయంలో పుస్ ఇన్ బూట్స్‌లో వలె రొమాంటిక్ వ్యంగ్యం చూపిస్తే కుదరదు. ఇది సందేశాత్మకత ప్రయోజనం కాదు. అంతిమ సారంగా చెప్పాలంటే ఇదంతా కలసి రచయిత తాత్విక ప్రగాఢతను చెప్పగలగాలి. ఎందుకంటే అతను నాటకం రాసే సమయంలో ఈ ప్రపంచమే ఒక నాటకరంగం అన్న భావనతో రాస్తాడు.

ఈ నటించే విధానమే ఎపిక్ థియేటర్‌లో ముఖ్య స్థానం వహిస్తుంది. కళాత్మక ప్రయోజనం రాజకీయ సందేశంతో ఏ మేరకు మిళితం కాగలిగిందనేది తెలుస్తుంది. టెర్రర్ అండ్ మిజరీ అఫ్ ద థర్డ్ రీచ్ అన్న నాటకం గురించి మనం తెలుసుకుంటే సరిపోతుంది. ప్రవాసంలోని ఒక జర్మన్ నటుడు నాజీ మనిషిగానో లేక ప్రజా న్యాయస్థానం సభ్యుడుగానో నటించడం అంటే సంసారపక్షమైన ఒక మనిషి తిరుగుబోతు డాన్‌జాన్ పాత్ర ధరించినప్పటి పరిస్థితికి భిన్నంగా వుండాలి. ఎందుకంటే నాజీగా నటిస్తున్నప్పుడు ఆ పాత్ర సాటి యోధులను హతమార్చిన ఆ పాత్రపట్ల ఎలాటి సహానుభూతి వుండే అవకాశమే లేదు. ఇలాటివన్నీ చూసినప్పుడు నటుడు తన పాత్ర నుంచి ఎడంగా వుండటం నేర్చుకోవలసిన అవసరం కనిపిస్తుంది. అలాచేస్తే ఫలితం చాలా అసాధారణంగా విజయవంతమవుతుంది. ఈ పద్ధతి ఎపిక్ పద్ధతి అవుతుంది.

పిక్ థియేటర్ వెనక తపనను కొత్త తరహా నాటకం రూపంలో కన్నా రంగస్థలం కోణంలో మరింత త్వరితంగా నిర్వచించవచ్చు. గతంలో పెద్దగా పట్టించుకోని పరిస్థితులను అది ఎక్కువగా పరిగణనలోకి తీసుకుంటుంది. సంగీత ఘోషలో మునిగిపోవడమంటారే ఆ అఖాతంలో పడిపోకుండా చేస్తుంది. బతికున్న వారిని చచ్చిన వారిని వేరు చేసినట్టుగా నటులను ప్రేక్షకుల నుంచి వేరు చేసే అఖాతమది. అది నిశ్శబ్దంగా వుంటే నాటకంలో మాధుర్యం లాలిత్యం పెరిగినట్టు ప్రతిధ్వనులు పెరిగితే ప్రేక్షకులు సమ్మోహితులయ్యేట్టు చేసే అఖాతమది. ఏదో అత్యంత పవిత్రమైందిగా భావించబడే లక్షణం దీనికే వుంటుంది. ఎపిక్ థియేటర్‌లో అదే ప్రాధాన్యత కోల్పోతుంది. అయినా రంగస్థలం మాత్రం మరింత ప్రకాశవంతమవుతుంది. కాని అది ఒక అఖాతం నుంచి జరగదు. ప్రజా రంగస్థలంపై జరుగుతుంది. సందేశాత్మక నాటకం ఎపిక్ థియేటర్ ఈ స్థలాన్ని ఆక్రమించేందుకు సంసిద్ధమవుతాయి.

# దేవిప్రియకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు




ప్రముఖ రచయిత దేవిప్రియ రచించిన 'గాలి రంగు' కవితా సంపుటి కేంద్ర సాహిత్య అకాడమీ 2017 అవార్డుకు ఎంపికైంది. అనువాదం తెలుగు విభాగంలో వెన్నా వల్లభరావు రచించిన 'విరామమెరుగని పయనం' ఎంపికైంది. డిసెంబర్ 21న ఢిల్లీలో కేంద్ర సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీనివాసరావు ఈ వివరాలు వెల్లడించారు. దేశవ్యాప్తంగా 24 భాషలకు 24 మందిని ఎంపిక చేశారు. సాహిత్య అకాడమీ అధ్యక్షుడు విశ్వనాథ ప్రసాద్ తివారి అధ్యక్షతన సాగిన కార్యనిర్వాహక బోర్డు సమావేశంలో జ్యూరీ సభ్యులు ఇచ్చిన సిఫార్సు మేరకు ఈ ఎంపిక జరిగిందన్నారు. అవార్డుకు ఎంపికైన వారిని ఫిబ్రవరి 12న నిర్వహించే కార్యక్రమంలో రూ.లక్ష నగదు, తామ్రపత్రం, శాలువాతో సత్కరిస్తామన్నారు. అనువాద విభాగంలో ఎంపికైన వారిని రూ.50వేల నగదు, తామ్రపత్రంతో మరో కార్యక్రమంలో సత్కరిస్తామని శ్రీనివాసరావు వివరించారు.

ప్రముఖ కవి, సీనియర్ జర్నలిస్టు, సాహితీవేత్తగా పేరుగాంచిన దేవిప్రియ అసలు పేరు ఖాజా హుస్సేన్. గుంటూరుకి చెందిన ఆయన ఐదు దశాబ్దాలుగా హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. పలుపత్రికల్లో రన్నింగ్ కామెంట్రీ పేరుతో ఆయన చేసిన రచనలు ఎందరికో సుపరిచితం. ***'నిరంతరం/ ప్రజల మేలు కోరుకున్న సుందరయ్య/ నీలాగ నిప్పులాంటి నేతలు మాకెందరయ్య/ సోషలిజం ఈ దేశపు బిడ్డల తల నిమిరినపుడు/ ఎర్రబడిన ఏ మబ్బుల తెరు మీదో వచ్చిచూడు"*** అన్న ప్రసిద్ధ చరణాలు సుందరయ్య గారు చనిపోయినప్పుడు ఉదయం దినపత్రికలో రన్నింగ్ కామెంటరీలో రాసినవే. పలు సినిమాలకు స్క్రిప్ట్ రచయితగానూ దేవిప్రియ పనిచేశారు. బాల్యం నుంచే ఆయన కవితలు, గేయాలు, పద్యాలు రచించేవారు. 1951 ఆగస్టు 15న గుంటూరులో పుట్టిన ఆయన గత అయిదు దశాబ్దాలుగా హైదరాబాద్‌లోనే స్థిరపడి పలు ప్రక్రియల్లో రచనలు చేసి లబ్ధప్రతిష్టులయ్యారు. ఆయన అమ్మచెట్టు, గరీబు గీతాలు, నీటిపుట్ట, అరణ్య పురాణం మొదలైన 12 పుస్తకాలు రచించారు. దిగంబర కవిత్వంలోని అశ్లీలతను వ్యతిరేకిస్తూ పైగంబర కవిత్వం రాశారు. 2011లో 'గాలిరంగు' వెలువరించారు.




### అనువాదంలో వెన్నా వల్లభరావుకు...

వెన్నా వల్లభరావు కృష్ణా జిల్లా గుడివాడ మండలం బేతవోలుకి చెందినవారు. పంజాబీ రచయిత్రి అజీత్‌కౌర్ ఆత్మకథను తెలుగులో 'విరామమెరుగని పయనం'గా అనువదించినందుకు గానూ ఆయనకు సాహిత్య అకాడమీ అవార్డు దక్కింది. కృష్ణా జిల్లాలో వివిధ కళాశాల్లో హిందీ విభాగం అధిపతిగా, అధ్యాపకుడుగా పనిచేసి పదవీవిరమణ చేశారు 15కుపైగా అనువాద గ్రంథాలు, మూల రచనలు చేశారు. 2012లో ఈ పుస్తకాన్ని అనువదించారు.

ఎ.ఎన్. జగన్నాథ శర్మ, కె. శివారెడ్డి, సంపత్‌కుమార్‌లు దేవిప్రియ 'గాలిరంగు' కవిత సంపుటి ఎంపిక జ్యూరీ సభ్యులుగా వ్యవహరించారు. అంపశయ్య నవీన్, బండ్ల మాధవరావు, జె.ఎల్. రెడ్డిలు వెన్నా వల్లభరావు అనువాదం 'విరామమెరుగని పయనం' పుస్తక ఎంపికకు జ్యూరీ సభ్యులుగా వ్యవహరించారు.



ప్రస్థానం 2002 సాహిత్య ప్రత్యేక సంచిక నుండి

# అర్థం కాని కవిత్వం వ్యర్థం

- దేవిప్రియ

**జర్నలిజం, సినిమా, అడ్వర్టయిజ్‌మెంట్ ఇలా వివిధ వ్యాపకాల మధ్య కవితా రచన కొనసాగించడంలో సమస్యలు సదుపాయాలు ఎలా వున్నాయి?**

నాకు సాహిత్యమంటే ఏమిటో చూచాయగా తెలిసింది 1966-67 ప్రాంతాల్లోనే. తెనాలి విఎస్ఆర్ కాలేజీలో చదువుతున్నప్పుడు మా కాలేజీ మ్యాగజైన్‌లో కొన్ని రచనలు చేశాను. గుంటూరు ఎసి కాలేజీలో బిఎలో చేరిన తర్వాత కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, స్ఫూర్తిశ్రీ వంటి అధ్యాపకుల ప్రభావం వల్ల ప్రాచీనకవిత్వం గురించి అలంకారాల గురించి కొంత వరకు తెలుసుకోగలిగాను. అలా కవిత్వం మీద ఆసక్తి అభిమానం పెరుగుతూ వచ్చాయి. అయితే జీవితం ఒక్కొక్క దశలో ఒకో పని చేస్తూ వచ్చాను. అలా వెళ్లవలసిన అవసరం నాకు ఏర్పడింది. నా లోపల కవితా దాహం మాత్రం అలాగే వుండిపోయింది. నాకు కిటికీలు ఎక్కువ. అన్నిట్లోంచి చూడటం నా నైజం. సినిమాలు, రంగస్థలం చదువుకునే రోజుల్లోనే చాలా సమయం తినేసేవి. అయితే మార్కులు కూడా బాగానే వచ్చేవి కనక టీచర్లు ఏమనేవారు కాదు. సినిమాలు చాలా ఎక్కువగా చూసేవాణ్ని. 15, 20 సార్లు చూసినవి కూడా వున్నాయి. మెట్రికులేషన్ నాటికే ఈ సినిమా నాపై ఒక మ్యాజికల్ ఎఫెక్టు వేసింది. అప్పుడే నాకు సినిమాల గురించి కొన్ని ఒరిజినల్ ఐడియాలు వచ్చేవి. ఉదాహరణకు పాటలు వినేప్పుడు సంగీతపరికరాలు లేకుండా అవన్ని వినిపించడం అసహజమనిపించేది. సినిమా అంటే ఒక టెక్నికల్‌ప్రాసెస్ అని తెలుసుకున్నాను. అడ్వర్టయిజింగ్ లక్షణాలు కూడా స్కూలు రోజుల్లోనే వుండేవి. సినిమాల శతదినోత్సవాలకు సొంత ఖర్చుతో గోడలపై రాసేవాణ్ని. పాటలు రాసేవాణ్ని. గుంటూరులో మెహర్‌బాబా గుడి వుండేది. అక్కడ విన్న పాటలకు అనుకరణలు తయారు చేసేవాణ్ని. ఏమైనా కవిత్వం నా మొదటి ప్రేమగా వుండేది. కవిత్వం నాదారి అని నిర్ణయించుకున్నాను. ఏ విషయమూ దాన్ని డామినేట్ చేయడానికి అనుమతించలేదు. అందుకోసం ఉద్యోగానికి కవిత్వానికి సంఘర్షణ వస్తే రెండో దానికే ప్రాధాన్యత నిచ్చాను. ఆంధ్రజ్యోతిలో జీవకవిత్వం జిందాబాద్ స్పెషల్ వేసినప్పుడు ఎండి జగదీష్ ప్రసాద్ గారు సందేహం వెలిబుచ్చినా వినకుండా వేయించాను. తర్వాత ఆయనే మెచ్చుకున్నారనుకోండి. ఉదయంలో కూడా నారాయణరెడ్డిగారికి జ్ఞానపీఠ అవార్డు వచ్చినపుడు కవర్ స్టోరీ రాస్తే గజ్జెల మల్లారెడ్డిగారు అభ్యంతరపెట్టాలని చూశారు. నేను నా నిర్ణయానికే కట్టుబడ్డాను. ఇలా కవిత్వం జీవితం మధ్య ఎంపిక వచ్చినపుడు నేను ఖచ్చితంగా వ్యవహరించాను. అయితే ఏ దేశంలో నైనా మన దేశంలో మరీ కవిత్వాన్ని నమ్మి జీవితం గడపగలమని అనుకోను. జీవిక కోసం ఏదో ఒకటి చేయాలి. అవి చేస్తూనే కళాభిరుచిని తృప్తి పరుచుకోడానికి చేయాల్సింది చేశాను. డబ్బు ప్రధాన కన్సిడరేషన్ అనుకోలేదు. గద్దర్ మీద డాక్యుమెంటరీ తీయడానికి చాలా ఖర్చయింది. అది నా అభిరుచికి కన్విక్షన్‌కు సంబంధించిన విషయం కనకే వెనుకాడలేదు. ఇప్పటికీ దాన్ని ప్రమోట్ చేయలేకపోతున్నాను. అయితే ఇన్ని జీవన మార్గాలు నా అనుభవం సృజన ఎన్‌రిచ్ కావడానికి దోహద పడ్డాయనడంలో సందేహంలేదు.

**ఇక్కడే ఒక చిన్న ప్రశ్న. చాలా మంది మీ మిత్రులు రాసిన వ్యాసాలలో నెత్తిమీద దారిద్ర్యముంది అనే మీ కవితను ప్రస్తావించారు. కాని మీరు చాలా ఉన్నత స్థాయి ఎగ్జిక్యూటివ్ పదవులు నిర్వహించారు కదా..**

నిజమే. నా జీవన శైలి వల్లనే నాకు డబ్బు సమస్య వచ్చింది. ఈ శైలిని నేను కోరుకోలేదు. కాని వచ్చింది. నా యువకదశలో అశాంతిని గుర్తుచేసుకుంటే ఈ మాత్రం సెటిల్డ్ లైఫ్ గడుపుతానని ఏనాడూ అనుకోలేదు. ఇంటి బాధ్యతలు అనారోగ్యం వగైరాల వల్ల కలిగిన సమస్యలు. నిజానికి నేను

చాలా పేదరికం నుంచి వచ్చాను. కోరుకోకపోయినా పై తరగతి జీవితానికి అలవాటు పడ్డాను. మధ్య తరగతి కాంక్షలను అందుకోడానికి జరిగే పోరాటంలో ఆర్థిక సమస్యలు... దానికి తోడు అనారోగ్యం. ఈ సంగతులన్ని సన్నిహిత మిత్రులకు బాగా తెలుసు గనక వారు ఆ చరణాలను ఉటంకిస్తూ ఉంటారు.

***జర్నలిజంలో, అడ్వర్టయిజింగ్‌లో చాలా ప్రయోగాలు చేశారు కాని కవిత్వంలో మాత్రం మీరు సరళత్వాన్నే ఎంచుకున్నట్టు కనిపిస్తుంది. కారణమేమైనా వుందా?***

ఉంది. నా ఉద్దేశంలో కవిత్వం ఒక కమ్యూనికేషన్. అది చేరవలసిన వారికి చేరకపోతే రాయడమెందుకు? అర్థం కాని కవిత్వానికి అర్థమే లేదు. అన్ని సృజనాత్మక ప్రక్రియలు కూడా ముందుగా జనానికి అర్థం కావాలని నేను కోరుకుంటాను. అందుకే నైరూప్య చిత్రాలు కూడా నాకంతగా నచ్చవు.

***మరి మీరు చేసే సినిమాలలో, నర్సింగరావు గారు కొంత ఆ శైలిని అనుసరిస్తారు కదా?***

నిజమే. అది కూడా నేను పూర్తిగా ఏకీభవించేది కాదు. దాసి సినిమా వుందనుకోండి. అక్కడ నుంచి ఇక్కడకు రావడాన్ని అంతసేపు చూపించాలా అని నేను చాలాసార్లు అనేవాణ్ని. అయినా ఆ సినిమా స్క్రిప్టు నాకు మంచి పేరు తెచ్చిపెట్టింది. నాకు సంబంధించినంతవరకు కమ్యూనికేషన్ కీలకం. మిగిలినవన్నీ తర్వాతే. నీ వెంత గొప్పవాడవైతే అంత తేలిగ్గా చెప్పగలగాలి. ప్రతిభ కమ్యూనికేషన్‌కు అవరోధం కాకూడదు. నేను కవిత్వం మెరుగుపరుచుకోవడానికి చాలా చదువుతాను. ఆలోచిస్తాను. అలంకారాలు ఉపమానాలు వగైరాలను పట్టించుకుంటాను. కాని అవన్ని మరింత తేలిగ్గా అర్థంకావడానికే. కమ్యూనికేషన్ కోసం కళనైనా సాక్రిఫైజ్ చేస్తానేమో గాని దీనికోసం దాన్ని బలిపెట్టను.

***కవి వ్యక్తిగత అంశాలు అదేపనిగా రాయడంపై మీ అభిప్రాయం?***

ప్రతికవికీ వ్యక్తిగా ఒక అస్తిత్వం వుంటుంది. అనుభవాలు సంఘర్షణల జీవితం వుంటుంది. సాంఘిక చైతన్యం, నిబద్ధత వున్న కవి వాటిని సమాజానికి అన్వయిస్తాడు. ఆ పనిలో ఎంత క్లారిటీ వుంటే అంతగా జయప్రదమవుతాడు. వ్యక్తిగత అంశాలు సోషల్ రిలవెన్స్ వున్నంత వరకు రాయవచ్చు. లేకపోతే నిరర్థకం. నేను వ్యక్తిగత అనుభవాలు అనుభూతులు రాయడానికి వ్యతిరేకం కాదు. కాని అవి అందరి సమస్యలుగా కనిపించాలి. చదివిన వాన్ని కదిలించాలి. నాకు సంక్లిష్ట కవిత్వం పట్ల నమ్మకం లేదు. వ్యక్తివాదం చేసేవారిలోనూ గొప్పకవులున్నారు. శ్రీశ్రీ గొప్ప కవి. వేగుంట మోహన ప్రసాద్ మేము విద్యార్థులుగా వున్నప్పుడు ఆయన వస్తే అంత దూరం నుంచి చూసి ఆశ్చర్యపోతుండేవాళ్లం. గుంటూరులో నేను చదువుతున్నప్పుడే భారతిలో ఆయన కవిత్వం వచ్చేది. తెలుగే కాని ఆ కవిత్వం నాకేం బోధపడేది కాదు. అప్పుడే నేను ఇలా రాయకూడదని నిర్ణయించుకున్నాను. నేను ఇవాళ ఎంతో కొంతైనా జయప్రదం కాగలిగానంటే అలా అనుకోవడమే కారణం.

***ఈ తేలికైన కవిత్వం వల్ల మిమ్మల్ను ఇతరులు ఎవరైనా తేలిగ్గా చూసేవారా?***

తేలిగ్గా చూడ్డం కాదు కాని ఒక విధమైన హోస్టిలిటీ వుండేది. అది నా కవిత్వం వల్ల కాదు, నా సామాజిక నేపథ్యం వల్ల అనుకునేవాణ్ని. అది సంకుచిత మనస్తత్వం ఫలితం. మన సమాజంలో అనేక దురభిప్రాయాలున్నాయి. విద్యార్థి దశలోనే కాదు. తర్వాత కూడా అలాంటి ప్రతికూలతలను ఎదుర్కొన్నాను. కేవలం నా ప్రతిభ వల్లనే పైకి రాగలిగానని చెప్పగలను. బ్రాహ్మలు తప్ప అప్పట్లో పత్రికా రంగంలో పై స్థానాలలో ఎవరూ వుండేవారు కాదు. ఉదయం అడ్వయిజరీ ఎడిటర్‌గా నేను అపాయింట్ కావడం పెద్ద సంచలనం. అందుకు నేను చాలా గర్వపడుతుంటాను.

***మీరు మద్రాసులో చాలా కాలం సినిమా పరిశ్రమలో పనిచేశారు. తిరిగి నర్సింగరావు ప్రభృతులతో కలిసి 80లలో జరిగిన ప్రయత్నాలలోనూ భాగస్వామిగా వున్నారు. మరి 50లలో అభ్యుదయ రచయితలు సినిమా రంగంలో సాధించిన పట్టును విజయాలను తర్వాత సాధించలేకపోవడానికి కారణాలేమిటంటారు?***

1972 తర్వాత పదేళ్లు నేను అనిసెట్టి గారితో పాటు మద్రాసులో వుండి సినిమా రంగంలో పనిచేశాను. అప్పట్లో ఆయన డబ్బింగ్ కింగ్. సాహిత్యానికి సంబంధించిన విషయాలు అనేకం తెలియడానికి ముఖ్యంగా ఆంగ్ల సాహిత్య పరిచయం పెరగడానికి ఆయన చాలా దోహదం చేశారు. కొన్ని సినిమాటైటిల్స్‌లో ఆయనపేరుతో పాటు నా పేరు కూడా వుంటుంది. అయితే నేను సినిమా రంగం నుంచి వచ్చేశాను. తిరిగి 1980లలో మరో విధంగా సినిమా రంగంలో పనిచేశాను. మీరడిగిన ప్రశ్నకు వస్తే 1950లలో తెలంగాణా పోరాటం అనంతర నిర్బంధ పరిస్థితులలో నాటి అభ్యుదయ రచయితలు పెద్ద ఎత్తున వలస పోయారు. మైగ్రేటెడ్ ఎన్‌మాస్ అన్నమాట. అప్పుడు తెలుగు సినిమా పరిశ్రమ బాగా అభివృద్ధిచెందే దశలో వుంది. న్యూటాలెంట్ కోసం చూస్తూ వుంది. ఈ వెళ్లిన వారు కేవలం బ్రతుకు తెరువు కోసం,

రక్షణ కోసం వెళ్లారు. అలాంటి తరుణంలో వారిని పరిశ్రమ వుపయోగించుకుంది. ఒక రకంగా వారి ప్రతిభను కొల్లగొట్టింది. వారంతా ప్రజలపక్షాన నిలవవలసిన రచయితలు. కాని సినిమా రచయితలుగా మారిపోయారు. కాని 80లలో మేము వెళ్లినప్పటి పరిస్థితి వేరు. సన్నివేశం పూర్తిగా మారిపోయింది. వ్యాపారసినిమా బాగా వేళ్లూనుకుంది. సినిమా రచయితను కావాలని నేను సీరియస్‌గా ప్రయత్నించలేదు. కమర్షియల్ సినిమాకు ప్రత్యామ్నాయంగా ఆర్ట్ సినిమా వుందని చెప్పడం, దాని ఉనికిని చూపడం నా ఉద్దేశం అంతే. నేను ప్రత్యామ్నాయ భావాలతో సినిమా పరిశ్రమకు వెళ్లాను. ముందే చెప్పాను కదా, చిన్నప్పటి నుంచే నాకు సినిమా అంటే చాలా ఆసక్తి అని. నేను ప్రజాతంత్ర ఎడిటర్‌గా వున్నప్పుడే ఆర్ట్ సినిమా గురించి రాసేవాణ్ని. నిస్సంకోచంగా విమర్శలు చేసేవాణ్ని.

***దిగంబర కవిత్వానికి వ్యతిరేకంగా పైగంబర కవిత్వం రాశారు కదా, మరి అలాంటి విమర్శలే చేస్తున్నవారితో మీ సంబంధాలెలా వుండేవి?***

సి.పి.ఐ, సి.పి.ఎమ్ రెండూ దిగంబర కవిత్వాన్ని గట్టిగా వ్యతిరేకించాయి. పైగంబర కవులుగా మేము రావడం వెనక సిపిఐ హస్తం లేదా ఆ పార్టీకి సంబంధించిన మేధావుల ప్రోద్బలం వున్నాయని చాలామంది అనుకున్నారు. మేము గుంటూరులో పరుచూరి రాజారాంగారి సలహాలు తీసుకోవడం పైగంబర కవుల తొలిసంపుటి విశాలాంధ్ర బుక్‌హౌస్ మేడపైన ఆవిష్కరించడం ఇందుకు కారణమైవుండొచ్చు. కాని మాకు అలాంటి అభిప్రాయాలు లేవు. నిజానికి నాకు దిగంబర కవుల విషయంతో పెద్ద విభేదం వుండేది కాదు. కాని చెప్పే తీరుపైనే అభ్యంతరముండేది. అంతే శక్తివంతంగా రాసి దాన్ని ఎదుర్కొవాలనుకునేవాళ్ళం. మమ్ముల్ని పురి కొల్పినవాడు సుగమ్‌బాబు.

నాకు రాజకీయంగా అంత స్పష్టత వుండేది కాదు. విశాఖలో శ్రీశ్రీ షష్టిపూర్తి, విశాఖ విద్యార్థుల కరపత్రం వగైరాల తర్వాత విరసం ఆకర్షించింది. ఖమ్మంలో దాని మహాసభలకు వెళ్లాను. ప్రదర్శనలో ముందుభాగాన పాల్గొన్నాను. కాని అప్పటి నుంచే నాలో సందేహాలుండేవి. ఏం జరుగుతుందో తెలియకుండా ఎలా చేరడం అనిపించింది. రాజకీయాలే ప్రధానంగా అనిపించాయి. తెలియకుండానే ఆగిపోయాను. మేము ముగ్గురం ఖమ్మం వెళ్లాము. ఓల్గా, సుగమ్ బాబు విరసంలో చేరిపోయారు. నేను చేరకుండానే తిరిగొచ్చాను. వాస్తవానికి నేనెప్పుడూ ఓకల్‌కాదు. రిష్టయిన్డ్‌గానే వున్నా.

***అంటే బ్రాడ్ లెఫ్ట్ ఐడియాలజీని మీరు బలపరుస్తారు కదా?***

ఔను. లెఫ్ట్ లీనింగ్స్ ఎప్పుడూ వున్నాయి. ఇంకా ఇంకా పెరుగుతున్నాయి కూడా. విరసంతో సహా అన్ని ఇంకా రిలెవెన్స్ కలిగివున్నాయనే నా భావం. అయితే ఈనాటి పరిస్థితులలో విరసం, అరసం అంటూ గీతలు గీచుకోవడం ఇర్రిలవెంట్ అని, ప్రజాతంత్ర భావాలు కలవారందరిని కలుపుకొని పోవాలని-నేననుకుంటున్నాను.

***మీరు చాలా సార్లు చెప్పినట్టు ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం ద్వారా చేరాతలు, ప్రారంభం కావడానికి దళిత స్త్రీ మైనార్టీ వాదాలపై చర్చలు తీవ్రం కావడానికి కారకులయ్యారు కదా. ఆయన రాతలపై అనేక అభిప్రాయాలున్నాయి. వాటిని ఆయనకే వదిలేసినా ఈ వాదాలపై మీ అభిప్రాయాలేమిటి?***

స్త్రీ వాదం నిజానికి ఎప్పటినుంచో వున్నదే. రెండు వాదాలలో సామాజిక పరిస్థితుల నుంచి ఉత్పన్నం అయ్యాయి. ఆయా తరగతుల వారు అభివృద్ధి కావడం వల్ల చైతన్యం పెరగడం వల్ల వారిపై ఇతర వర్గాల ఒత్తిడిపీడన పెరగడం వల్ల వచ్చిన వాదాలని నేననుకుంటాను. ఆ రియాక్షన్‌కు సాహిత్య ప్రతిస్పందనగా వచ్చాయి. ఇదివరకటి ఐడెంటిటీస్‌ను ప్రశ్నించడం జరిగింది. కొత్త ప్లాట్‌ఫాం కోసం అర్జ్ పెరిగింది. దాన్ని వామపక్షాలు తీసుకుంటాయని నేను ఆ రోజులలో ఆశించాను. అలా జరగనందుకు నిరుత్సాహపడ్డాను. ఏ భావమైనా మార్గదర్శకత్వం వహించే రాజకీయ సంధానకర్త లేకుండా జరుగదు. నాయకత్వం కావాలి. దేశ రాజకీయాలకు అతీతంగా వీరు మాత్రమే సాధించగలిగింది వుండదు. అందుకే అవి టేకాఫ్‌కాలేదు. మైనార్టీలలో ఈ రోజున కనపడే కొన్ని ధోరణులకు మతదృష్టి కారణమని నేననుకోను. రాజకీయ వ్యవస్థ ప్రపంచ పరిణామాల వల్ల పెరిగే నిరసన ఆ రూపంలో వ్యక్తమవుతోంది. వారు లెఫ్ట్ పార్టీలతో ఇంకా ఐడెంటిఫై కాలేకపోతున్నారు. అందుకే వారిని ఎడ్యుకేట్ చేయాలి. అది నా ఉద్దేశం.

అసలు అంతర్జాతీయంగా అనేక తీవ్ర పరిణామాలు కలిగాయి. సోవియట్ విచ్ఛిన్నం అప్పుడు నేను హిట్లర్ నవ్వు రాశాను. కాని అక్కడ జరిగిందేమిటి, ఎందుకు జరిగింది ఇలాంటి విషయాలపై ఇప్పటికి రచయితలుగా మాకు పూర్తిగా స్పష్టతలేదు. వామపక్షాలు ఆ పని చేయాలి. అవగాహన పెంచి ఆచరణలో ఐక్యంగా ముందుకు తీసుకుపోవాలి.

ఇంటర్వ్యూ : **తెలకపల్లి రవి**

# సామాజిక న్యాయపోరాట కవిత్వం

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117




ప్రపంచదేశాలలో కెల్లా భారతదేశంలోని సామాజిక నిర్మాణం చాలా సంక్లిష్టమైనది. మిగతా ప్రపంచ దేశాలలో మతం, ధనం ప్రజల్ని చీలిస్తే భారతదేశంలో ఆ రెండింటితోపాటు కులం చాలా బలమైన చీలిక సాధనంగా ఉంది. ఇది చాలా నిరంకుశమైనది. దేశవ్యాప్తంగా కొన్ని వేల కులాలు జనాన్ని చీల్చి వైరుధ్యాలను సృష్టించాయి. ఎన్ని కులాలుంటే అన్ని చీలికలున్నట్లు లెక్క. అందుకే భారతదేశంలో ఇంకా నిచ్చెనమెట్ల సమాజమే కొనసాగుతున్నది. ప్రతి మెట్టూ పై మెట్టును చేరడానికి ప్రయత్నిస్తుంది. క్రింది మెట్టును పైకిరానీకుండా తొక్కుతూ ఉంటుంది. సాంఘిక వివక్ష, ఆర్థిక అసమానత భారతదేశాన్ని పట్టిపీడిస్తున్న రెండు రోగాలు.

*నిత్యసత్యాన్వేషక కాలవాహన త్రినేత్రుణ్ణి*
*నేను నడిచినంతమేరా దప్పుమోతలు*
*బాధతప్త హృదయాల విషాదగీతికలు*

– జూపల్లి ప్రేంచంద్ : అవేద

రాచరిక యుగాలలో ప్రపంచదేశాలన్నీ నిచ్చెనమెట్ల సమాజాలుగానే బతుకులు వెళ్ళదీశాయి. నిచ్చెనమెట్ల సమాజమంటే అసమసమాజం. ఆర్థిక సాంఘిక వైరుధ్యాలు, అణచివేత, వివక్ష, పీడన, ఆధిపత్యం వంటివి ఆ సమాజ లక్షణాలు. పెట్టుబడిదారీ వ్యవస్థ అసమ సమాజంలో కదలికలు తీసుకొచ్చిందిగాని అసమానత్వాన్ని నిర్మూలించ లేకపోయింది. అసమ వ్యవస్థకు విరుగుడు సామ్యవాద వ్యవస్థ అని మార్క్సిజం చెప్పింది. పీడకులు, పీడితులు, ధనికులు దరిద్రులుగా ఉన్న సమాజాన్ని అధిక సంఖ్యాకులైన పీడిత, పేద, శ్రామికవర్గ ప్రజలు ఉద్యమించి నిర్మూలించి దాని స్థానంలో సమసమాజాన్ని నిర్మించాలని మార్క్సిజం చెప్పింది. మార్క్సిజం చెప్పినట్లుగానే రష్యా, చైనా, జర్మనీ, తూర్పు యూరప్ దేశాలలో విప్లవాలు వచ్చాయి. భారతదేశంలో కూడా తెలంగాణా రైతాంగపోరాటం జరిగింది. అయితే పెట్టుబడిదారీ పెనుదాడులకు ఆ విప్లవాలు నిలదొక్కుకోలేకపోయాయి. అయినా క్యూబా, వెనిజులా వంటి దేశాలలో వామపక్షవాదం అమలులో ఉంటున్నది.

ప్రపంచదేశాలలో కెల్లా భారతదేశంలోని సామాజిక నిర్మాణం చాలా సంక్లిష్టమైనది. మిగతా ప్రపంచ దేశాలలో మతం, ధనం ప్రజల్ని చీలిస్తే భారతదేశంలో ఆ రెండింటితోపాటు కులం చాలా బలమైన చీలిక సాధనంగా ఉంది. ఇది చాలా నిరంకుశమైనది. దేశవ్యాప్తంగా కొన్ని వేల కులాలు జనాన్ని చీల్చి వైరుధ్యాలను సృష్టించాయి. ఎన్ని కులాలుంటే అన్ని చీలికలున్నట్లు లెక్క. అందుకే భారతదేశంలో ఇంకా నిచ్చెనమెట్ల సమాజమే కొనసాగుతున్నది. ప్రతి మెట్టూ పై మెట్టును చేరడానికి ప్రయత్నిస్తుంది. క్రింది మెట్టును పైకిరానీకుండా తొక్కుతూ ఉంటుంది. సాంఘిక వివక్ష, ఆర్థిక అసమానత భారతదేశాన్ని పట్టిపీడిస్తున్న రెండు రోగాలు.

వీటిలో సాంఘిక వివక్షను నిర్మూలించడానికి ప్రాచీన కాలం నుండీ ప్రయత్నాలు జరిగాయి. సాంఘిక నిరంకుశత్వం మీద చార్వాకులు, శాలంకాయనులు, జైనులు, శార్దులు వంటి అనేకులు యుద్ధం చేశారు. ఆధునిక కోణంలో మహాత్మాపూలే, మహాదేవగోవిందరనడే, బి.ఆర్.అంబేద్కర్ వంటి వాళ్ళ జీవితాలు అంకితం చేశారు. మార్క్సిజం అందుబాటులోకి వచ్చిన తర్వాత ఆర్థిక అసమానత్వ నిర్మూలనోద్యమాలు కొనసాగాయి. ఎందరో మేధావులు, కళాకారులు, రచయితలు, ఉద్యమకారులు ఈ ఆర్థిక సాంఘికోద్యమాలలో భాగస్వాములయ్యారు, అవుతున్నారు. సంఘసంస్కరణోద్యమకాలం నుండి నేటిదాకా భారతదేశంలోని అనేక రుగ్మతల మీద యుద్ధం జరుగుతూనే ఉంది. మార్క్సిస్టులు ఒకవైపు, అంబేద్కరిస్టులు మరోవైపు ఇవాళ ఈ యుద్ధంలో పాల్గొంటున్నారు.

డా.జూపల్లి ప్రేంచంద్ నాలుగు దశాబ్దాల నుండి ఈ యుద్ధంలో సైనిక పాత్ర నిర్వహిస్తూ ఉన్నారు. భారతదేశంలో వేల ఏళ్ళుగా ఊడలు దించుకొని ఉన్న నిచ్చెనమెట్ల వ్యవస్థను కూల్చడానికి ఆయన కవిత్వాన్ని ఆయుధంగా ఉపయోగించుకుంటున్నారు. 1981-91 మధ్య రాసిన కవితల్ని 'ఆవేద' గాను, తర్వాత 2000-2011 మధ్య రాసిన కవితలను 'నిచ్చెనమెట్ల లోలకం' గానూ ప్రచురించారు. 1980 నుండి నేటిదాకా మన సమాజంలో అనేక పరిణామాలు సంభవించాయి. ఆ పరిణామాలకు ప్రేంచంద్ అనంతపురం నుండి స్పందించారు. మనుషుల మధ్య కృత్రిమంగా కట్టబడిన అనేక రకాల గోడలు కూలిపోయి అడ్డుగోడలు లేని సమాజం రావాలని ఆయన ఆకాంక్ష. గోడలు పగులగొట్టడమే ఆయన కవిత్వ కర్తవ్యం.

'జీవితం సంక్షుభిత వ్యధాభరిత విషాదకావ్యం' అన్నది ప్రేంచంద్ నిర్వచనం. ఇక్కడ జీవితం అంటే భారతీయ జీవితమనీ, ఇక్కడి జీవితాన్ని విషాదకావ్యంగా నిర్వచించడానికి ఇక్కడి వర్గ కుల జీవితవిషాదలే కారణాలు. ప్రేంచంద్ కవిత్వంలో శ్రామికపక్షపాతం, రాయలసీమ కరువు, భూమి, రైతు, స్త్రీ, పరాయీకరణ, ప్రపంచీకరణ, సద్దాం ఉరితీత వంటి అనేక అంశాలు వస్తువులయ్యాయి. వర్తమాన సమాజం ఒక్కమాటలో ఆయన కవిత్వ వస్తువు.

ప్రేంచంద్‌కు రాజకీయ స్పృహ ఉంది. ప్రజా వ్యతిరేక రాజకీయ వ్యవస్థపైన ఆయన కవిత్వాగ్రహం వ్యక్తం చేశారు. ఎన్నికల రాజకీయ ప్రహసనాన్ని 'ఓట్లన్నీ పోలయినాయి' లోనూ, ప్రజాభిమతాన్ని కాదని సద్దాంహుస్సేన్ ఉరితీతను, శభాష్ సద్దాంలోనూ, ప్రపంచీకరణను 'కనిపించని శత్రువు' లోను ప్రేంచంద్ విమర్శనాత్మకంగా కవిత్వీకరించారు.

ఎన్నికలు ఎన్ని జరిగినా నర్సింలు వంటి పేదల జీవితాలలో మార్పు రాకపోవడాన్ని కవి తీవ్రంగా అధిక్షేపించారు.

***కుండలన్నీ నిండుకున్నాయ్***
***నిండుకున్న కుండల్ని నింపుతున్నాయ్ ఎన్నికలు***

భారత్, పాక్‌లు పోటీపడి చేసిన అణుపరీక్షల మీద ప్రేంచంద్ బుద్ధుని సాధనంగా చేసుకొని విమర్శ పెట్టారు. శాంతి, కరుణ వంటి భావనల్ని వెదజల్లిన గౌతముని నేలలో విధ్వంసక అణుపరీక్ష జరపడంలోని వైరుధ్యాన్ని కవి ఎత్తి చూపారు.

***ఎబివాజ్‌పేయ్ కాస్తా హటాత్తుగా***
***ఆటంబాంబ్ వాజ్‌పాయ్‌గా***
***అవతారమెత్తాడు***
***పోఖ్రాన్‌లో చిత్రంగా***
***బుద్ధుడు చిర్నవ్వాడు***

అని ప్రత్యక్షవిమర్శ పెట్టడానికి కవి వెనుకాడలేదు

***ఉరికంబం మీద సహితం ధిక్కారం***
***సద్దాం సింహానాదం ఓ తాజా హెచ్చరిక***

అని అంతర్జాతీయ అవగాహనతో కవి సద్దాం హత్యను ఖండించారు.

అమెరికా అహంకారం మీద కొట్టిన చావుదెబ్బగా సెప్టెంబర్ 11 సంఘటనను కవి గుర్తించారు. ప్రపంచీకరణ ప్రయోగం మీద ప్రగతిశీల స్వభావం గల కవికి స్పష్టమైన వ్యతిరేకత ఉంటుంది. ప్రేంచంద్‌లో ఆ వ్యతిరేకత అనేక పర్యాయాలు వ్యక్తమైంది.

***ప్రతి ఇల్లూ ఒక వస్తు ప్రదర్శనశాల...***
***ప్రపంచీకరణ అంటే అరచేతిలో స్వర్గాన్ని చూపించడం***
***సరళీకరణ అంటే నీ దేశాన్ని సుతారంగా కొల్లగొట్టి***
***దొల్లతనాన్ని మిగల్చటం.***

అని నిరాడంబరమైన భాషలో కవి ప్రపంచీకరణ స్వభావాన్ని ఆవిష్కరించారు.

రాయలసీమలో పుట్టిన ఆధునిక కవి సీమ కరువును గురించి కవిత్వం రాయకుండా ఉండడం సాధ్యం కాదు. ప్రేంచంద్ అనంతపురం జిల్లా కరువు అధ్యయన యాత్రలోను అనంత రైతు ఆత్మవిశ్వాస యాత్రలోను భాగస్వామి అయ్యారు. స్వచ్ఛందసంస్థ ద్వారా జిల్లా అంతటా తిరిగి వాస్తవ జీవితాన్ని అధ్యయనం చేశారు. ఆ అనుభవంలోంచి పదునూ, దాహం, అనంతలో వాన, ఎర్రగడ్డ, కరువు, కడాకు, అదే పదివేలు, కసాయి కరువు, వలస, వానాకాలంలో ఎండాకాలం వంటి అనేక కవితలలో ప్రేంచంద్ రాయలసీమ నిర్దిష్టతకు చిరునామా అయిన కరువు, దాని చుట్టూ ఆవరించిన అనేక సామాజికాంశాలను మనముందుంచారు. కరువుతో సంబంధంలేని అనుభవం లేని ప్రాంతాల పాఠకులను దిగ్భ్రమకు గురిచేసేవి ప్రేంచంద్ కరువు కవితలు.

రాయలసీమ మనిషికి ఒకే ఒక స్వప్నం. అది వాన స్వప్నం. అది నెరవేరని స్వప్నం. వర్షరాహిత్యం వల్ల సీమ జీవితాలే మిథ్యగా మారిపోయాయని కవి ఆవేదనపడ్డారు.

***ఈ ఎడారిముఖాలపై***
***ఈ ముడతలు తేలిన ముఖాలపై***
***చినుకుచింత తప్ప కాసింత చిగురింత కన్పించదు***
***ఇక్కడ జీవితం మిథ్య***

ఇది నిరాశకాదు. వాస్తవం. కరువు కాటకం వల్ల రైతుల, రైతు కూలీలు, వృత్తులవాళ్ళు పోతే వలసకు, కాకుంటే కాటికి.

***జీవితం అంటే ఆ కాలంలో పండిన పండుటాకు కావచ్చు.***

***జీవితం అంటే నిర్లక్ష్యంగా రాలిపోయే ఎండుటాకు కావచ్చు***

***జీవితం అంటే నగ్నంగా నాగలి మీద శిలువ ఎక్కటం కావచ్చు***

ఇది నిర్వేదం కాదు. సీమనిజం, అనంతనిజం, రాయలసీమ వర్షరాహిత్యం వల్ల తాగునీటికి కూడా ఇబ్బందిపడుతూ ఉంటుంది. తాగునీటి కొరత వల్ల రాయలసీమ మనిషే ఒక దాహంగా మారాడంటారు కవి. గుండెలు పిండే అభివ్యక్తి.

***వీడు దాహంతో ఉన్నాడు అనటం అబద్ధం***
***నీవే ఒక దాహం అనటం మాత్రమే సత్యం***

కరువుకు, ముఠా తత్వానికి ఉండే పేగుబంధం తెలియని రాయలసీమ రచయిత లేడు.

***కరువు రక్కసి కొద్దికొద్దిగా నిర్వీర్యం చేస్తుంటే***
***అనాలోచితంగా అజ్ఞానం అమాయకత్వంతో***
***ఇంటిముంగిట కసువుకోసం పేడ కోసం దిబ్బలకోసం***
***మాటలు పదునెక్కుతాయి ఈటెలు పదునెక్కుతాయి***
***తలకాయలు కోడిమెడల్లా తెగిపడతాయి.***

ప్రేంచంద్‌కు అనంతపురం జిల్లా మొత్తం తిరిగిన అనుభవం. చిన్న కారణాలకే పగలు ఎలా రగులుకుంటాయో చెప్పగలిగారు. ఈ పగలే క్రమక్రమంగా ముఠాకక్షలకు దారితీస్తాయి. కరువు రాయలసీమ జీవిత సంక్షోభానికి మూలమనే వాస్తవాన్ని ప్రేంచంద్ మరీమరీ చెబుతూవచ్చారు. 'కరువు' అనే కవితలో నర్సింలు, లచ్చిమి పాత్రల ద్వారా రాయలసీమ కరువు నగ్న రూపాన్ని ప్రేంచంద్ కథానాత్మకంగా ఆవిష్కరించిన తీరు గుండెల్ని పిండేస్తుంది. ఎన్నికలు జరిగినంత నిరంతరాయంగా సీమలో కరువు విలయతాండవం చేస్తుందని కవి పాఠకులకు గుర్తు చేశారు. 2002-04 సంవత్సరాల మధ్య రాయలసీమను కరువు అత్యంత దారుణంగా పీడించింది. ప్రభుత్వం అనుసరించిన ప్రజా వ్యతిరేక విధానాలు, ప్రకృతి అననుకూలత సీమబ్రతుకుల్ని పీల్చి పిప్పి చేసేశాయి. బాధ్యత గలిగిన రచయితలు ఈ క్రౌర్యాన్ని అక్షరీకరించారు. అనంతపురం జిల్లా యాసతో ప్రేంచంద్ రాసిన 'కసాయికరువు' కవిత అప్పటి 'అనంత' జీవిత వాస్తవికతను కళ్ళముందు నిలుపుతుంది.

***పసలబాద సూడ్లాక కాటికంపుతాండా***
***కసాయి కటికోల్లు కాళ్ళు ఇరగ్గొట్టి***
***లారీల్లో కుక్కి నగరాలకు తోలకపోతాంటే***
***తల్లిపేగు తెగినట్ల మా కడుపుల్లో కల్లోలం***

భూగర్భ జలాలు అడుగంటడంతో అనంతపురం జిల్లాలో నీళ్ళలో ఫ్లోరైడ్ బయటపడి చక్కగా ఉండే శ్రామికప్రజలు కాళ్ళు వంకర్లుపోయి అవిటివాళ్ళుగా తయారవుతున్న నిజాన్ని ప్రేంచంద్ 'అష్టవక్ర' కవితలో హృదయవిదారకంగా వర్ణించారు. ఇక్కడ కూడా కవి రాజకీయాన్నే దోషిగా గుర్తించారు.

"వాడి ఫ్లోరోసిస్ ఫ్లోరైడ్ వారసత్వం కాదా"

భారతదేశం వ్యవసాయ దేశమని, రైతు దేశానికి వెన్నెముక అని మనం చెప్పుకుంటూ ఉంటాం. అందువల్ల

రైతేరాజు కావాలనీ అకాంక్షిస్తూ ఉంటాం. ఆ పరిస్థితి భారతదేశంలో ఇంకా రాలేదు. ప్రేంచంద్ రైతేరాజు కవితలో సీమ రైతు దుస్థితిని వర్ణించారు.

*పురుగుమందుకు పురుగులు చావవు*
*ప్రత్తిరైతుల శవాలు చూసి*
*ఫకాలున నవ్వుతాయి*
*వేరుశనగ రైతు నడ్డి విరిచింది*
*వరి కాస్తా దోమపోటయ్యింది....*
*రైతు తాగేందుకే గుక్కెడునీళ్ళు కరువు*
*సేద్యానికేమిస్తారు ?*

ఈ ప్రశ్నకు స్వాతంత్ర్యానంతర పాలకులే సమాధానం చెప్పాలి.

ప్రేంచంద్ కవిగా పుట్టేనాటికి మార్క్సిజం తాత్విక దృక్పథంగా ఉండి తర్వాత 1990 నాటికి దళితబహుజన దృక్పథం తోడయ్యింది. ప్రారంభంలో ఆయన శ్రామికవర్గ దృక్పథంతో కొన్ని కవితలు రాశారు. తర్వాత కుల దృక్పథంతో రాయడం ప్రారంభించారు. 'మండుటెండల్లో' వంటివి ఆయన రాసిన శ్రామిక కవితలు. దున్నేవాడిదే భూమి అన్నట్లు, ఇంటినిర్మాణం చేసేవాళ్ళు కూడా ఇల్లు గలిగిన వాళ్ళు కావాలని ప్రేంచంద్ అకాంక్ష.

*వాళ్ళు నిర్మించిన భవనాల్లో వాళ్ళే*
*ఠీవిగా నిటారుగా స్వేచ్ఛగా*
*నిలబడేంతవరకూ*
*వెన్నెల మైదానాల్ని*
*చీకటి సముద్రాల్ని ప్రేమించలేను*
*మండుటెండను ప్రేమిస్తాను*

'సర్పపంజరం' కవితలో దళితులకు చరిత్రలో జరిగిన అన్యాయాల్ని ఎత్తిచూపారు. మను ధర్మాన్ని విమర్శకు పెట్టారు.

*"మంత్రోచ్చారణ చేశాను – నాలుక తెగ్గోశారు*
*మంత్రశ్రవణం చేశాను. చెవిలో కరిగించిన సీసం పోశారు"* అంటూ ఈ దుర్మార్గం ఇంకా కొనసాగడానికి వీల్లేదని కవి తీర్పు నిచ్చారు.

*"కొత్త నెత్తురుతో పాత చరిత్రను పునఃనిర్మించక తప్పదు"* అని చరిత్రను తిరిగి రచించవలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు.

భారతదేశ ఔన్నత్యాన్ని గురించి జబ్బలు చరుచుకునేవాళ్ళకు

*"మీరు వెలివాడగా మార్చిన దేశం కాదా నా దేశం"*
*అని మూలవాడి ప్రశ్నను ప్రేంచంద్ సంధించారు.*

దళితవేదనను సాంఘిక సంక్షేమ హాస్టల్ విద్యార్థుల దృష్టికోణం నుంచి 'ఉత్తీత' కవితగా మలిచారు. ఇదొక కొత్తకోణం. పాఠశాలలకు శలవులు వస్తే పై కులాల పిల్లలు ఉల్లాసంగా ఇళ్ళకు పోతే, దళిత పిల్లలు ఇంటికి పోతే ఏం తినాలని దిగులుపడతారు. ఈ కవిత ఈ సత్యాన్ని చాటిచెప్పింది. మతోన్మాదులు ఫాదర్ల మీద సిస్టర్ల మీద దాడులు చెయ్యడాన్ని కూడా 'పంచమ పంచాంగమ్' కవితలలో ప్రేంచంద్ ఖండించారు.

*గీత దాటితే*
*వెలివాడ భగ్గున మండిపోతుంది*
*సిస్టర్ ప్లాన్ట్‌గా చెరచబడుతుంది*
*ఫాదర్‌ను సజీవదహనం చేస్తారు*

90 దళిత కులాల చర్చ బయలుదేరిన సమయంలో ప్రేంచంద్ 'రాజ్యం' కవిత రాశారు.

*"దేశం మీదే కాదు*
*దేహం మీదా అధికారాన్ని కోల్పోయాం"* అని దళితుల జీవితాలు పరాయీకరింపబడటాన్ని అధిక్షేపించారు.

ప్రేంచంద్ సామాజికన్యాయ స్వాప్నికుడు. జనాభా ప్రాతిపదిక మీద అన్ని సౌకర్యాలు పంపకం జరగాలని కుల మత జండర్ ప్రాంత వివక్షలన్నీ నశించిపోవాలని ఆయన ప్రగాఢంగా కోరుకుంటున్నారు. ఇవాళ సామాజిక న్యాయం అని అంటున్నది, మార్క్సిజం చెప్పిన శ్రామికవర్గన్యాయమూ కొంచెం తేడాలతో ఒకటే.

*నా కులాన్ని గుర్తించలేదు – కుల ఆధిపత్యంపై పోరాటం*
*నా మత మైనారిటీని గుర్తించ లేదు – మత స్వేచ్ఛకై పోరాటం*
*నా జాతిని గుర్తించలేదు – మహిళావిముక్తికై పోరాటం*
*చివరకు నా ప్రాంతాన్ని గుర్తించలేదు*
*ప్రాంతీయ అసమానతలూ సామాజిక అన్యాయము*
*సామాజిక న్యాయం కోసం పోరాటం తప్పదు*

– జూపల్లి ప్రేంచంద్ : నిచ్చెనమెట్ల లోలకం

## మనసు మరణించిన దేహం

- యామినీ దేవి కోడే
9492806520

**నా** ఆశల రెక్కలేమీ నీకు తొడగలేదు
లక్ష్యపు దారి మాత్రమే నేనిచ్చా ...
దిశానిర్దేశాలూ, విచక్షణలూ మంచి మార్గాలన్నీ నేర్పా
మరెందుకిలా ముళ్ళమీద అడుగులేస్తావ్??

మనసు సుడిగుండంలో కొట్టుకుంటోంది.
కన్నీళ్ళు వెలికి రాకున్నా
సుడులు తిరుగుతున్న బాధెక్కడో
అణువణువునూ మెలిపెడుతోంది.



పేగు తెంచుకు పుట్టావప్పుడు
నరాలన్నీ తెంపేస్తున్నావిప్పుడు
అయినా మమకారపు మోహాన్ని
తుంచుకోలేకున్నాను.

గాయం నీకయినా
ఒక్కో స్వేదబిందువు గుండా
రక్తం నాకు కారుతోంది.
నీకు మాత్రం అవేం పట్టవ్!!
ఎందుకంటే నువిప్పుడు పెద్దోడివయ్యావ్..!!
నీకన్నీ తెలుసనుకునే అహం నిన్ను కమ్ముకున్నాక
నన్ను నీకు దూరం చేస్తూనే ఉంటుందా భావం.

ఒక్కో అబద్ధం బయటికొచ్చి
నిజాలన్నీ నా ముందు కనపడుతుంటే
శరీరానికి ప్రాణముంటుంది
కానీ మనసు మరణించేదప్పుడే.
ముక్కలయిన హృదయానికెన్నిసార్లు
మాటువేసుకోనూ...??

అమృత కలశాన్ని చేతిలో పెట్టినా
విష వలయపు గారడీలో మునిగి
నువ్వే చేదెక్కి పోయావ్.
అలాంటప్పుడే ప్రాణమెలికి పోయేలా
గుండె మెలిక పడేది.

గొంతెండి పోతోంటే
గుక్కెడు నీళ్ళిస్తావనే ఆశ ఎటూలేదు.
ఎందుకంటే
నన్ను చితిమీద పేర్చకుండానే
నీ చేష్టలతో సజీవదహనం చేసేసావ్.
ఇక మిగిలింది మనసు మరణించిన దేహమే. ◆

---

## నిష్క్రమించిన సూర్యుడు ?

- ఎస్.రామకృష్ణ
8985087408

**సూ**రీడు
మబ్బుల దుప్పటి తెరిచే లోపే



తొలిపొద్దై
వెలుగు పూలు పూయించి
రాత్రి వెన్నెలలా
తిరిగి వచ్చేవాడు
మట్టి వాసనై ...

ఎందుకో
ఆవేళ చీకట్లు
భారంగా ఒళ్ళు విరుచుకుంటున్నాయి
ఇంకా తెల్లవారలేదన్నట్టు ...

దేశమంతా గాఢ నిద్రలో
రాత్రి తాగిన మత్తు
దిగలేదన్నట్టు ...

బహుశా
దళారుల, దగాకోరుల
దశావతారాల్ని
తన ఒంటరి దేహంపై మోసి
అలసిపోయాడేమో
పాపం సూరీడు
నిష్క్రమించాడు ...

ఉన్నంత కాలం
తన వెలుగుకు గుర్తింపు లేదు
అందుకే
ఈ నేల మట్టి వాసన కోల్పోయింది ....
ఇంక మిగిలింది ఆకలి చావులే

ఎక్కడో
కాలుతున్న దేహం వాసన
ఈ దేశం
తగలబడుతోంది కాబోలు .....

అక్కడ
ఆకాశం అంచున నిలిచిన
ఆ దేహమే
ఈ దేశపు ధ్రువతార ...... ◆

# వేమన - ఇతర భారతీయ కవులు

- డా॥ ఎ.ఎ. నాగేంద్ర
9490188263




***"ఈనాడు మతం పేరిట జరిగే మారణహోమం చూస్తుంటే, వేమన, కబీర్‌ల ఆధునిక దృష్టి ఎంతో ఆశ్చర్య మనిపిస్తుంది" అన్నారు అనంతరావు. మధ్యయుగాల భారతీయ సమాజంలో విలయతాండవం చేస్తున్న కర్మకాండ మీద ఈ ఇద్దరు కవులు దాడి చేశారని ఆయన పేర్కొన్నాడు. వేమన "తలలు బోడులైన తలపులు బోడులా", కబీరు "కేసన కహా బిగారియా, మూండియే జామై విషయ వికార్" (తలవెంట్రుకలకు బదులు మనస్సు కొరిగించితే మంచిది). కబీరు 'దోహా'లను, వేమన ఆటవెలదిని స్వీకరించి దేశీ ఛందస్సుకు పెద్దపీట వేశారని, ఈ ఇద్దరి కవిత్వాలకు జానపద సాన్నిహిత్యం వుందని పేర్కొన్నారు.***

తెలుగు సాహిత్య చరిత్రలో వేమన మధ్యయుగ కవి. 17వ శతాబ్దంలో వేమన జీవించినట్లుగా చరిత్రకారులు భావించారు. నన్నయ నుండి గోపినాథ వెంకటకవి దాకా వున్న వందల కొలది ప్రాచీన తెలుగు కవులలో వేమన విభిన్నమైన కవి, విశిష్టమైన కవి. ఇంక ఏ కవీ రానంత సమీపంగా సమాజం దగ్గరకు వేమన రావడమే అతని వైశిష్ట్యానికి, విభిన్నత్వానికి కారణం. తన సమకాలీన సామాజిక వాస్తవికతను సామాజిక దృష్టితో, విమర్శనాత్మక దృష్టితో ప్రతిబింబించడం వేమన మిగతా కవుల కన్నా భిన్నంగా కన్పించడానికి కారణం.

వేమన మీద సాహితీ స్రవంతి ఏప్రెల్ 30, 2017న అనంతపురములో సదస్సు నిర్వహించిన సందర్భంగా, ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన 13 గ్రంథాలలో "వేమన కవిత్వం - ఇతర భారతీయ కవులు" అన్నది ఒకటి. వేమనను వేమన వంటి ఇతర భారతీయ కవులతో పోల్చి అధ్యయనం చేయడం కొంత విస్తృతంగానే జరిగింది. విశ్వవిద్యాలయాలలో దాదాపు 10 మంది దాకా పరిశోధకులు వేమనను తులనాత్మకంగా అధ్యయనం చేశారు. విశ్వవిద్యాలయాలకు వెలుపల రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గుర్రం వెంకటరెడ్డి మొదలైన వాళ్లు వేమన జీవిత సాహిత్యాలను అధ్యయనం చేస్తూ కూడా, తులనాత్మకంగా పరిశీలించారు. వీళ్లు కాక ఇంకా అనేక మంది విద్వాంసులు వేమన మీద తులనాత్మక దృష్టితో వ్యాసాలు రాశారు. అలాంటి 9 వ్యాసాలతో వచ్చిన పుస్తకమే "వేమన కవిత్వం - ఇతర భారతీయ కవులు" అన్నది.

ఈ సంకలనంలో నూతలపాటి గంగాధరం వేమనను గురజాడకు మార్గదర్శిగా గుర్తించాడు. ఆచార్య జి.యన్. రెడ్డి అత్యంత ప్రాచీన తమిళకవి తిరువళ్ళువర్ వారితో వేమనను పోల్చి పరిశీలించారు. ఆచార్య కె. సర్వోత్తమ రావు ఇంకో అడుగు ముందుకు వేసి వేమనను తిరువళ్ళువర్ వారితో పాటు కన్నడకవి సర్వజ్ఞనితో కూడా పోల్చి పరిశీలించారు. సి. అనంతరావు, ఒంగోలు రమాదేవి, వై.వి.ఎస్.ఎస్.ఎన్. మూర్తి, అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి ఈ నలుగురూ వేమనను కబీరుతో కలిపి అధ్యయనం చేశారు. ఆచార్య ఎన్.గోపి వేమనను కేరళ కవి నారాయణగురుతో పోల్చి పరిశోధించారు. శ్రీమతి సయ్యద్ మెహరున్ వేమనను అన్నమయ్య, వీరబ్రహ్మంలతో కలిపి అధ్యయనం చేశారు.

భారతదేశ చరిత్రలో మధ్యయుగాలలో నిరంకుశంగా మారిపోయిన సామాజిక వ్యవస్థను సంస్కరించడానికి అనేక

మంది భక్తి, తాత్విక, సంస్కరణవాద కవులు, రచయితలు కృషిచేశారు. కబీరు, సర్వజ్ఞుడు, నారాయణగురు, అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మం లాంటి కవులు. ఈ అందరికన్నా ముందు తమిళకవి తిరువళ్ళువర్ తమిళనాడు నుండి సంస్కరణ శంఖం పూరించాడు. ఈ వ్యాస సంపుటి మధ్యయుగాలలో భారతదేశ వ్యాప్తంగా సంస్కరణవాద కవులు ఎలాంటి సామాజిక బాధ్యత నిర్వహించారో తెలియజేస్తుంది. ఈ కవులందరూ రాజస్థానాలను ధిక్కరించి, ప్రజాసంస్థానాల్లో సంచరిస్తూ రచనలు చేసిన రచయితలు. సాహిత్యాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేయడం వల్ల అనేక మతాలుగా, అనేక భాషలుగా, అనేక ప్రాంతాలుగా విభజింపబడి వున్న భారతీయ జీవితంలోని సాదృశ్యాలు కనిపెట్టడానికి అవకాశం వస్తుంది.

ఈ సంకలనంలోని 9 మంది వ్యాసరచయితలు తిరువళ్ళువర్ నుండి నారాయణగురు దాకా గల భారతీయ తాత్వికభక్తి సంస్కరణ వాద రచయితల సాహిత్యంలోని సమాన భావాలను అన్వేషించారు. ఈ అన్వేషణ జాతీయ సమైఖ్యతకు, భారతీయ సాహిత్య భావనకు బాగా దోహదం చేస్తుంది.

నూతలపాటి గంగాధరం వేమన గురజాడకు ఏఏ అంశాలలో మార్గదర్శి అయ్యాడో వివరించారు. ఈ పరిశీలనలో గంగాధరం నాలుగు అంశాలను గుర్తించాడు. అవి

1) ప్రజాబాహుళ్య ప్రయోజన సాహిత్యానికి సంస్కృత వృత్తాల వంటి బలమైన ఛందస్సు పనికిరాదు.

2) భాష – నిత్య వ్యవహారంలో మెదిలేదై ఉండాలి.

3) ఉపమానాలు, ఉదాహరణలూ నిత్య జీవితానికి దగ్గరివై ఉండాలి.

4) వ్యవహారంలో ఉన్న జాతీయాలూ, లోకోక్తులూ సందర్భోచితంగా వ్యవహరించాలి. గురజాడ ఈ నాలుగు అంశాలను వేమన నుండి గ్రహించినట్లు గంగాధరం సోదాహరణంగా వివరించారు.

ఆచార్య జి.యన్. రెడ్డి తిరువళ్ళువర్, వేమనల మధ్యగల బేధ సాదృశ్యాలను లోతుగా పరిశీలించారు. చాలా పూర్వీకుడైన తిరువళ్ళువర్ భావాలు తెలుగు వాళ్ళకు కొత్తగా కనిపించవు అని, ఇందుకు కారణం తిరువళ్ళువర్ వంటి కవి వేమన తెలుగులో ఉండటమే కారణం అని పేర్కొన్నారు. **'We find great similarities in the lives of and teachings of Valluvar and Vemana'** అన్నది జి.యన్. రెడ్డి గారి తీర్పు. వేమన యోగి కాగా, వళ్ళువర్ భోగి అని పేర్కొన్నారు. వళ్ళువర్, వేమన ఇద్దరూ శాంతిని ప్రచారం చేశారని కూడా ఆయన భావించాడు. స్త్రీ విషయంలో మాత్రం ఈ ఇద్దరి మధ్య భేదాలే ఎక్కువ ఉన్నాయని, అయినప్పటికీ ఇద్దరూ ఉత్తమ ఇల్లాలు ఆనంద దాయకమైన కుటుంబాన్ని నిర్మిస్తుందని భావించినట్లు జి.యన్. రెడ్డి పేర్కొన్నారు.

15వ శతాబ్దం నాటి కబీరు, 17వ శతాబ్దం నాటి వేమన ఈ ఇద్దరి రచనల్లోని సాదృశ్యాలను తెలుగు విమర్శకులు అనేకం గుర్తించారు. సి. అనంతరావు ఈ ఇద్దరికీ రసవాద విద్యలో విశ్వాసం వుందని, ఇద్దరూ హఠయోగంలో కృషిచేసిన వారని సోదాహరణంగా వివరించారు. అదే సమయంలో వేమన భావాలలో తీవ్రత, కబీరు భావాలలో రమ్యత కన్పిస్తాయని కూడా ఆయన పేర్కొన్నారు. "కబీరు గంభీరుడు, వేమన ఉద్రేకి" అన్నది అనంతరావు తీర్పు. ఆనాటి వర్ణవ్యవస్థలోని బ్రాహ్మణాధిపత్యాన్ని ఈ ఇద్దరు కవులు ఆక్షేపించారని, ఇద్దరూ మానవతా వాదులని అనంతరావు వివరించాడు. అంతేకాదు "ఈనాడు మతం పేరిట జరిగే మారణహోమం చూస్తుంటే, వేమన, కబీర్‌ల ఆధునిక దృష్టి ఎంతో ఆశ్చర్య మనిపిస్తుంది" అన్నారు అనంతరావు. మధ్యయుగాల భారతీయ సమాజంలో విలయతాండవం చేస్తున్న కర్మకాండ మీద ఈ ఇద్దరు కవులు దాడి చేశారని ఆయన పేర్కొన్నాడు. వేమన "తలలు బోడులైన తలపులు బోడులా", కబీరు "కేసన కహా బిగారియా, మూండియే జామై విషయ వికార్" (తలవెంట్రుకలకు బదులు మనస్సు కొరిగించితే మంచిది). కబీరు 'దోహా'లను, వేమన ఆటవెలదిని స్వీకరించి దేశీ ఛందస్సుకు పెద్దపీట వేశారని, ఈ ఇద్దరి కవిత్వాలకు జానపద సాన్నిహిత్యం వుందని పేర్కొన్నారు.

ఒంగోలు రమాదేవి కబీరు వేమనల మధ్య నూరు, నూటయాభై ఏళ్ళ కాలవ్యవధి వున్నా, దేశ పరిస్థితులు మాత్రం ఒకేరకంగా ఉన్నాయని అభిప్రాయపడ్డారు. ఈ ఇద్దరు కవుల వ్యక్తిగత జీవితాలకు సంబంధించి అనేక వాద వివాదాలు ఉన్నాయని ఆమె గుర్తించారు. కబీరు వేమన ఇద్దరూ అద్వైతవాదులని, ఇద్దరూ 'గురువు' ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పారని, సత్యసంపదకు పెద్దపీట వేశారని, ఇద్దరూ భోగలాలసత్వం వ్యతిరేకించారని, విగ్రహారాధనను ఇద్దరూ ఖండించారని, మతమౌఢ్యాన్ని ఇద్దరూ వ్యతిరేకించారని ఉదాహరణలతో ఆమె రుజువు చేశారు. ఈ ఇద్దరు కవులూ ప్రజలలో ఒక నూతనోత్తేజం కల్గించారని అందువల్ల వీరిని యుగకర్తలుగా భావించాలని పేర్కొన్నారు. ప్రజల భాషకు పట్టం కట్టడంలో ఇద్దరూ భాగస్వాములయ్యారని పేర్కొన్నారు.

కబీరు, వేమనలు దేవుడు ఒక్కడే అని గుర్తించి, మానవతా వాదాన్ని పెంపొందించారని వై.వి.ఎస్.ఎస్.ఎన్. మూర్తి అభిప్రాయపడ్డారు. అంతేకాదు ఇద్దరూ దేవుడు ఎక్కడోలేడని

మనుషులలోనే ఉన్నాడని భావించినట్లు చెప్పారు. ఉదా: కబీరు "ఓయ యక్ మషీన్ టీక్ హై జుయే – నకమక లేరా సాయి తుజెమి, మిఅగ్ని" (దేవుడు నాలోనే ఉన్నాడు. నువ్వుల్లోనే నూనె వున్నట్లుగా, నిప్పులోనే అగ్ని వున్నట్లుగా దేవుడు కూడా నీలోనే ఉన్నాడు).

*వేమన: తోలు కడుపులోన దొడ్డ వాడుండగా*
*రాతి గుళ్ళలోన రాసిబోయ*
*రాళ్ళు దేవుడైనా రాసులు మ్రింగడా*

(దేవుడు నీకనే వున్నాడు. ఎందుకు నీవు రాళ్ళకు మ్రొక్కుతావు? రాతికి జీవం వస్తే నువ్వు పెట్టిన ప్రసాదం మింగదా?) ఈ ఇద్దరు కవులు కులతత్వాన్ని, విగ్రహారాధనను, తీర్థయాత్రలను, కపట సన్యాసులను ఎలా ఖండించారో, విమర్శించారో వై.వి.ఎస్.ఎస్.ఎన్. మూర్తి సుదీర్ఘంగా చర్చించారు.

కబీరు, వేమనలను సమన్వయవాద కళాకారులుగా అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి నిర్వచించారు. వేమనను తెలుగు సాహిత్యపు కబీరు అని ఆయన పేర్కొన్నారు. "ఈ కళాకారులు వైష్ణవ మతపు ద్వైత వాదమును, భక్తిభావము నంగీకరించిరి గాని సగుణ సాధనా పద్ధతి యొక్క బాహ్యాడంబరము లను ఏమాత్రము నిర్మొహమాటంగా త్యజించిరి". అని శ్రీరామరెడ్డి అభిప్రాయపడ్డారు. అన్ని ప్రాణులను సమానముగా భావించుటయే ఈ ఇద్దరు కవులలోని సమన్వయ వాదమని శ్రీరామరెడ్డి తీర్పు.

ఆచార్య కె. సర్వోత్తమరావు తిరువళ్ళువర్, సర్వజ్ఞ, వేమనలు కాలపరీక్షలో నెగ్గి నిలిచిన మహాకవులు, సంఘసంస్కర్తలు అని నిర్వచించారు. సమకాలీన రాజకీయ పరిస్థితి వళ్ళువర్ రచనల్లో కన్పించకపోయినా, సర్వజ్ఞ వేమనలలో అనేక చారిత్రాకాంశాలు కనిపిస్తాయని సర్వోత్తమరావు అభిప్రాయ పడ్డారు. సర్వజ్ఞుని రచనల్లో తెంకలనాడు, మలెనాడు, వేమన పద్యాలలో కొండవీడు, మూగచింతపల్లె వంటి స్థలనామాలు కనిపించినట్లుగా తిరువళ్ళువర్ సాహిత్యంలో కనిపించదు అని కూడా ఆయన గుర్తించారు. తిరువళ్ళువర్, సర్వజ్ఞులు చర్చించని ముక్తిని గురించి వేమన ప్రస్తావించాడని ఆయన పేర్కొన్నాడు. ఈ ముగ్గురు కవులు ఏకేశ్వర ఉపాసననే ప్రతిపాదించినట్లు కూడా ఆయన పేర్కొన్నారు. ఈ ముగ్గురు కవులు ఉన్నతమైన కుటుంబ జీవితాన్ని ఆమోదించి, వేశ్యాలంపటత్వాన్ని తిరస్కరించిన తీరును సర్వోత్తమ రావు ఉదాహరణలతో చర్చించారు. అలాగే ఈ ముగ్గురు కవులు కర్షక జీవితాన్ని ఉన్నతంగా భావించినట్లు సర్వోత్తమరావు గుర్తించడం విశేషం.

ఆచార్య ఎన్.గోపి వేమనను నారాయణగురును ప్రజాయోగులుగా నిర్వచించారు. గోపి వేమనను ఆస్తిక హేతువాది అనడం ఆలోచింప జేస్తుంది. ప్రపంచంలో ఇలాంటి వాళ్లు చైనాలో టావో మతస్థాపకుడు, తమిళంలో తిరువళ్ళువర్, కన్నడంలో సర్వజ్ఞుడు, పంజాబ్‌లో గురునానక్, ఉత్తరభారతంలో కబీరు, మరాఠా దేశంలో తుకారాం, తెలుగునేలలో పోతులూరి వీరబ్రహ్మం అని ఆయన నిర్వచించారు. వేమన, నారాయణ గురు కులవ్యవస్థను ఖండించిన తీరును గోపి ఉదాహరణలతో చర్చించారు.

*వేమన:కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు*
*సానుజాతమయ్యె సకల కులము*
*హెచ్చుతగ్గుమాట లెట్లెరుంగగవచ్చు*
*విశ్వదాభిరామ వినురవేమ!*

*నారాయణ గురు: ఒరు జాతియల్ నిన్నల్లో*
*పిరిన్నీదున్న సంతతి*
*నరుజాతి ఇతు ఓర్కుం బోల్*
*ఒరు జాతి ఇల్ ఉళ్ళతాం*

(సంతతి అంటే ఒకే జాతి నుంచి పుడతారు. కాబట్టి మనుష్యులందరూ ఒకే జాతి)

శ్రీమతి సయ్యద్ మెహరున్ ప్రాచీన తెలుగు సాహిత్య చరిత్రలో సంస్కరణవాద కవిత్రయం అయిన అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మంల కవిత్వాలలోని సామాజిక దృక్పథాన్ని తులనాత్మకంగా పరిశీలించారు. ఈ ముగ్గురు కవులు కులతత్వాన్ని నిరసించిన తీరును సయ్యద్ మెహరున్ సోదాహరణంగా చర్చించారు. అభివ్యక్తులలో తేడాలు ఉన్నా ఆలోచనలలో ఈ ముగ్గురి మధ్య సాదృశ్యాలున్నాయని ఆమె గుర్తించారు. అన్నమయ్య రచించిన

*"ఎక్కువ కులజుడైన హీన కులజుడైన*
*నిక్క మెరిగిన మహానిత్యుడీ ఘనుడు*
*వేదములు చదివియును విముఖుడైన హరిభక్తి*
*యాదరించని సోమయాజి కంటే*
*యేదియును లేని కులహీనుడైనను విష్ణు*
*పాదములు సేవించు భక్తుడే ఘనుడు"* అనే పద్యాన్ని

వేమన రచించిన

*"కులము హెచ్చు తగ్గు కొదువల పనిలేదు*
*సాను జాతమయ్యె సకల కులము*
*హెచ్చు తగ్గుమాట నెట్లెఱుంగ గవచ్చు?"* అనే పద్యాన్ని

# కింకర్తవ్యం

- గరికపాటి మాష్టారు
8897672733



దేశంలో యిప్పుడు ఎక్కడ పాదం మోపినా...
భూమి మండుతోంది
ఎక్కడ అడుగు మోపినా భయం భూతం వెంటాడుతూంది
దేశంలో మనుషులు పగలు అతికించుకున్న దృశ్యాల్ని
రాత్రి స్వప్నాల్లో రీళ్ళుగా చుట్టుకుంటూ ఉలిక్కిపడి-
నిద్రలేస్తున్నారు
నిద్రలేవగానే నిరాశ దుప్పటి కప్పుకుని-
బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు
ఎండిపోయిన లోతైన కళ్ళు బావుల సాక్షిగా
యిప్పుడు దేశం మొత్తం మీద ప్రవహిస్తూన్న
ఏకైక జీవనది - రైతుల కన్నీటి నదే!
తమ ఆకలి పేగుల సాక్షిగా
ఎంగిలి మెతుకుల చెత్తకుండీ ప్రక్కన
జాతీయ జెండా కప్పుకుని పడుకున్న
దౌర్భాగ్య దేహాలు
మన భావిభారత పౌరుల దేహాలే
మన దేశపటం ప్రపంచ మేప్‌లో...
రూపాయి కప్పల్ని మింగి మింగి
బలసిన డాలరు కొండచిలువ ఆవలింతలా వుంది.
ఇప్పటికైనా మన చాపక్రింద చేరిన నీరు
సునామీలా మారక ముందే
ప్రశ్నించుకుందాం కింకర్తవ్యమని?
సమాధానం కోసం వెదకుదాం ◆

---

వీరబ్రహ్మం చెప్పిన
**"చిల్లర రాళ్లకు మ్రొక్కుచు ఉంటే**
**చిత్తము చెదునుర వారే వారే**
**చిత్తము నందలి చిన్మయ జ్యోతిని**
**చూచుచు నుండుట సరే సరే**
**వొక్క ప్రొద్దులని యుండకనుంటే**
**వోసంగ చెదుదువు వారే వారే."** అనే తత్వాన్ని స్వీకరించి ఈ ముగ్గురు కవుల భావసామీప్యతను వివరించింది.

ఈ తొమ్మిది వ్యాసాలు మనం జాగ్రత్తగా అధ్యయనం చేస్తే తిరువళ్ళువర్ మొదలుకొని నారాయణ గురు వరకు గుర్తించిన ఏడు మంది భారతీయ సంస్కరణ వాద రచయితల అభిప్రాయాలు మనకు తెలుస్తాయి. ఇవాళ మన సమాజంలో వేళ్ళుదించుకొని ఉన్న విగ్రహారాధన, కులతత్త్వం, వేశ్యాలోలత్వం, కుహనాభావాలు, విపరీతమైన కర్మకాండ వంటి అనేక రుగ్మతలకు మూలాలు ప్రాచీన కాలంలోనే ఉన్నాయని వాటిని ఆనాడే విభిన్న కాలాలలో ఈ కవులు విమర్శకు పెట్టారని అవగాహన కలుగుతుంది. అంతేకాదు 19వ శతాబ్దంలో వలసపాలన కాలంలో సంఘ సంస్కరణోద్యమం కొత్తగా మొదలుకాలేదని, వలస పాలకులు మనదేశానికి రాకముందే, భారతీయ దేశ కవులే మన సంఘాన్ని సంస్కరించడానికి కృషిచేశారని మనం గుర్తించగలం.

ఈ సంస్కరణ వాద రచయితలకు మనం నమస్కరించక తప్పదు. ఈనాడు సామాజిక రుగ్మతలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న వాళ్ళకు ఈ ఏడు మంది రచయితలు స్ఫూర్తి ప్రదాతలుగా నిలుస్తారని భావించవచ్చు. ఈ ఏడు మంది రచయితలలో కనిపించే సమాన భావాలు కలిగిన ఖండికలను సంకలనం చేయగలిగితే నేటి సమాజానికి ప్రయోజనం కలుగుతుంది. ◆

# అద్దేపల్లితో అనుభవాలు-జ్ఞాపకాలు

- గనారా
9949228298



'అనుభూతి గాఢత పెరిగేకొద్దీ
ఎక్కువ సమయం గడిచినట్లు ఉంటుంది.'

ఇది నిజమేనేమో! అనుభవాలు. అనుభూతులు సహచర్యం చేసి మనస్సును పెన వేసుకున్నప్పుడు కాలాన్ని కొలవలేము.

ఒక వ్యక్తి-వ్యక్తుల మీద, సమూహం మీద తన కాలం మీద ముద్రవేసిన వారు మనల్ని విడిచి భౌతికంగా జీవితం చాలించినప్పుడు ఆ జ్ఞాపకాలు సహజంగానే భావోద్వేగంతో ఉంటాయి.

అలా పెన వేసుకుపోయినవాడే అద్దేపల్లి రామమోహనరావు.

తెలుగు కవులతో ప్రత్యేకంగా తూర్పు గోదావరి కవులతో ఆయన బంధం చాలా చిక్కనిది. మా యిద్దరి మధ్య ఆయన చివరి మూడు సంవత్సరాలు అత్యంత గుర్తుండే కాలం. ఆ దశలో అనేక సభల్లో, సమావేశాలలో పాల్గొన్నాం. గంటల కొద్దీ ప్రయాణం చేసాం. కవి మిత్రుల్ని చేర దీసి సంధ్యా సాయంకాలాల్లో మిత్ర గోష్ఠి నడిపేవారము.

చర్చలు సాగేవి. మధ్యమధ్యలో లలిత గీతాలు, గజల్ పాటలు, కూనిరాగాలు వినిపించేవాడు. ఏదైనా సినిమా పాట చరణం చెప్పితే ఆ పాట మొత్తం ఆయన గొంతులోంచి మధురంగా జారివచ్చేది. ఆ కళ్ళల్లో యవ్వనపు రోజుల అనుభూతులు కనిపించేవి. ఒక భావుకుడు కనిపించేవాడు. తన్మయత్వం గోచరించేది. ఒక విషాదఛాయ కనిపించేది.

"జీవితానికి సమాజానికి ఉన్న సంఘర్షణని అనుక్షణం అనుభవిస్తూ ఒక ఖచ్చితమైన నేపథ్యంలో..." ఆ కవి బ్రతికాడు. 'జీవితంలో వేరే మలుపులు రావడంతో ఈ దు:ఖం నాకెందుకు పట్టుకుంది.....కవిత్వమే జీవితమైనవాడు. ఆ దు:ఖాన్ని ప్రేమిస్తాడు. ఆ రాపిడి ఎంత ఎక్కువైతే అంత ఎక్కువ ఊపిరిపోసుకుంటాడు. నేను ఆ కొవలోకే వస్తాను' ఈ వాక్యాలు అరసవిల్లి క్రిష్ణతో పంచుకున్నప్పటికీ అందులో వేదనాభరితమైన తాత్వికత కనిపిస్తుంది.

అలా గంభీరంగా మారిపోయిన వాతావరణంలో పెద్ద నవ్వుతో ఛలోక్తులు విసిరి బాహ్యప్రపంచంలోకి తెచ్చేవాడు.

ఈ క్రమంలోనే 'సాహితీస్రవంతి' కాకినాడ శాఖ ప్రారంభించాము. అది మమ్మల్ని మరింత దగ్గరకు చేర్చింది. కుటుంబ సభ్యుల కన్నా ఎక్కువ పాధాన్యత ఇచ్చాడు. ఇందుకు కారణం ఆయన్ని అర్థం చేసుకున్నందువలన, సాటి కవులతో సంధానకర్తని కావడం వల్ల నన్ను ప్రేమించాడు. ఈ కాలంలోనే అనేక భావాలు పంచుకున్నాం. ఒకే కాలంలో

భిన్న వైరుధ్యాలు ఆయనలోకి చూసి విమర్శనాత్మకంగా గమనిస్తుండేవాణ్ణి. ఆశ్చర్యం ఏమిటంటే తన కన్నా చిన్న వాళ్ళయినప్పటికిని, ఏ అహం ప్రదర్శించకుండా కలిసి మెలసి ఉండేవాడు. మాగ్రూపులో తన కొడుకుల కన్నా చిన్నవాళ్ళు ఉన్నారు. సమవయస్కులు, విద్యార్థి శిష్యులు ఉన్నారు. ఇప్పుడు వారిలో కొందరు కవులుగా, విమర్శకులుగా మారి కృషిచేస్తున్నారు. ఆ ప్రోత్సాహం లేకపోతే బాగా వెనకబడి ఉండేవారు. 'ముందు నువ్వు నడుస్తూ పో! అదే తరువాత నీ లక్ష్యాన్ని నిర్దేస్తుంది.' అన్న వాక్యం వారిని ప్రతిభావంతులుగా చేసింది. వారి వారి నేపథ్యాలను బట్టి రాస్తున్నా, గైడ్ చేస్తూ కాలంతో పాటు మార్చుకుంటున్న వారి దశను దిశను గమనించేవాడు. ఆ స్నేహంలో అన్ని తరగతులు వారు ఉండేవారు.(అద్దేపల్లి యువకులు గురించి 'సాహిత్య గమ్యం' రాసారు–ప్రజాశక్తి ప్రచురణ).

కవుల బృందంలో బార్బర్ షాపు నారాయణ, సైకిల్ షాపు సూర్యారావు, కవి అయిన ఆటోడ్రైవర్, ప్రవచనాలు చెప్పే పంతులు, ముస్లిం పండితుల గజల్స్‌కారులు, సంప్రదాయవాదులు సలహాలు తీసుకునేవారు.

కాలక్రమంలో కవిగా మారిన యాసలపు సూర్యారావు ను కలవడానికి కాలినడకన కాకినాడ నుంచి పెద్దాపురం వెళ్ళేవారు. ఈ మధ్యకాలంలో అక్కడ సభలో పాల్గొంటున్నప్పుడు ఈ సంఘటనని గూర్చి ఉద్యమకారులు చెప్పుకుంటుండగా విన్నాను.

ఒకప్పుడు ఎంతో చైతన్యవంతమైన కళల కాణాచి కాకినాడను స్తబ్ధత ఆవహించి ఉంటే సాహితీస్రవంతి వేదిక ఏర్పడిన తరువాత సభలు, సమావేశాలు, కవితా గానాలతో కేరింతలు కొడుతూ ఒకనాటి చైతన్యాన్ని పునరుజ్జీవింప చేయడంలో నాయకత్వం వహించాడు అద్దేపల్లి.

ఆయన దగ్గరకు అన్నిచోట్లనుండి చాలామంది కవులు వచ్చేవారు. ప్రయాణమార్గంలో కూడా చాలా మంది కలుసుకొనేవారు. భిన్నభావాలు ఉన్న వారిని తృణీకరించలేదు. ఒక చిరునవ్వు, ఒక కరస్పర్శ. ఎవరి వ్యక్తిత్వం పట్ల రంధ్రాన్వేషణ చేయలేదు. వారి కవిత్వాన్ని ఆస్వాదించడమే!. స్థాయీ బేధాలు చూడలేదు. మెరుగైన కవులను తయారు చేయడానికి కొత్తగా వచ్చే వందలాది కవులకి ముందుమాట రాసి ప్రోత్సహిస్తూ సూచనలు చేసేవాడు. అందువలనే చాలా మంది తమ రచనలను ముద్రణలో చూసుకోగలిగారు.

'నది తన ప్రవహించినంతమేర మట్టిలో ప్రతి రేణువున్ని ప్రేమిస్తుంది. నదికి నేల పట్ల వివక్షత ఉండదు. అద్దేపల్లికి కూడా లేదు' అని వరికొండ కాంతారావు చక్కటి నిర్వచనం చేసాడు.

ఆయన నాయకత్వంలో 'సాహితీస్రవంతి రెండు వార్షికోత్సవాలు' చేసుకుంది. ప్రతి నెల ఒక కవితాంశం ఇచ్చి సభలో చదివించేవాడు. ఏటా అవి సంచికలు తెచ్చేవారము. తనని సత్కరించిన మిత్రులను. శిష్యులను మరచిపోకుండా ఆహ్వానించి సభలో గౌరవించేవాడు. కాకినాడలో సాహితీస్రవంతి కృషిని వివరించేవాడు.

మా ఇద్దరికి అనేక అంశాల మీద విభేదం ఉండేది. వాదన ఉండేది. చర్చ ఉండేది. కావాలని ఆయనను రెచ్చగొట్టి సుదీర్ఘ ఉపన్యాసంలోకి నెట్టేవాడిని. ఆస్వాదించేవాడిని. ప్రణయం మొదలుకొని పర్యావరణం వరకు సాగేది. మూడవ వ్యక్తి వస్తే యధాస్థితికి వచ్చేవాళ్ళము.

సాంస్కృతికంగా ముందుకు పోకుండా దేశం అభివృద్ధి జరగదని వామపక్ష భావజాలం చెప్తుతుంది. అందుకు సాంస్కృతిక యోధులు కావాలి. ఆ స్ఫూర్తే చివరి వరకూ అద్దేపల్లిని వామపక్ష భావజాలంవైపు నిలబెట్టింది.

'ఆరు దశాబ్దాల సాహిత్య యాత్రలో తనకు విస్తారమైన స్నేహ సంబంధాలు, పేరు ప్రతిష్టలు, పరిచయాలు ఉన్నా స్వంతానికి వాడుకోని విలక్షణ వ్యక్తి అద్దేపల్లి. కొంత మంది సాహిత్యకారుల లాగా ఆయన బిరుదుల కోసం, పదవుల కోసం ఎన్నడూ ఆరాటపడలేదు. 'కళాత్మకంగా' బతికే చాలామందికి ఉండే వ్యసనాలు, వ్యామోహాలు దరికి రానివ్వని అద్దేపల్లి నిండు కుటుంబీకుడు' అన్న తెలకపల్లి రవి మాటలు అక్షర సత్యం.

***(జనవరి 13 రెండవ వర్ధంతి)*** ♦

# నా పేరు నాయనమ్మ

- బి. కళాగోపాల్
9441631029



బహుదూరపు బాటసారుల ప్రస్థానంలో...
సగభాగాలు కాలేనంటున్న సమభాగన్యాయాలు !
నా ఇరుకు కిటికీలో నుంచి చూస్తున్న
మిథ్యా ప్రపంచంలో,
చిగురించని వసంతాన్ని అలుముకున్న
ఎడారికోయిల పాటలు...
స్తబ్దుగా కదిలే ఉషోదయాలు !
చుట్టూ పేనిన కృత్రిమ రంగస్థలంపై
నలిగిపోయే పాత్రధారిగా...
నడిచొచ్చిన కాలం మైలురాయిపై....
కదిలొచ్చిన సాలభంజికల కథలు !
అరవైలో ఇరవై కాలేవంటున్న నీలినీడలు !
నా గదిలో ఘనీభవించిన దీపపుకాంతిలో...
స్మారకశిల లాంటి జీవితానికి...
ఆజన్మాంతం దాసోహమంటూ....
ఎవరికి వారే వేసుకున్న
సంకెళ్ళ ఉచ్చు బతుకులో రొచ్చుదేవులాట!
ఇంకా మిగిలి ఉన్నాయనుకున్న
అనుబంధాలు, ఆప్యాయతలు
జ్ఞాపకాల ఎన్‌కౌంటర్లలో అదృశ్య అలల్లా ఎగిసి,
నింగిని అంటిపెట్టుకున్న రంగువెలసిన
హరివిల్లులయ్యాయి!
మరుపుకు రానంటున్న చేదునిజాల్ని...
పుండులా సల్పుతున్న
వర్తమాన గాయాల్ని...
భవిష్యత్ విపణిలో దొరికే
ఆశావహ తీపిమాత్రలో రంగరిస్తూ...
బంధాలన్నీ జారిజారి ఇగిరిపోయి...
కాలం కూల్చిన రాతితెర ఆనవాళ్ళుగా మారిపోయాక,
శేషప్రశ్నలాంటి జీవితంలో మరో కోణం ఏమిటని
వానప్రస్థం ఎదురునిల్చి ప్రశ్నించింది
రాజీనామా లేని బతుకు రాజీపత్రాలలో...
ఊ కొడుతూనే ఊహు అంటున్న శషబిషల పద్మవ్యూహంలో...
వీలువెంబడి వచ్చిపోయే వారసత్వపు గడబిడలు !
టచ్‌స్క్రీన్ మరబొమ్మల చక్రభ్రమణంలో,
కొన్ని అపరిచిత ముఖాల నడుమ...
ఇంటింటి ఫేస్‌బుక్ వాల్‌పోస్టర్‌లో,
రాట్నం వడుకుతున్న ముసల్ది ఎవరంటున్న...?
ఒక పరాకైన పురా జ్ఞాపకపు చిరునామాగా...
నా పేరు నాయనమ్మ @ అనాది కాలపు అమ్మ....!!!

◆

కథ చిన్న టార్చిలైటు వేసి జీవితరేఖలోని ఒక బిందువును, ఒక జీవిత శకలాన్ని చూపుతుంది. నవలను బూర్జువా సమాజం ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తర కానుకగా నవలా సాహిత్య విమర్శకులు అభివర్ణిస్తారు. ఆ పద్ధతిలోనే మనం కథను పారిశ్రామిక నాగరికత ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తరమైన కానుకగా అభివర్ణించవచ్చు.

◆ ◆ ◆

చెప్పవలసినదాన్నంతా చెప్పడం చేత నిస్సందేహంగా కథకు విలువ తగ్గుతుంది. చెప్పవలసిన దానికంటే ఎక్కువ చెప్పటం కథా ప్రక్రియకే విరుద్ధం. ఈ విషయాన్నే చెకోవ్ ఒక సందర్భంలో చమత్కారంగా చెప్పాడు– 'కథలో చెప్పవలసిన దానికంటే తక్కువ చెప్పటం మంచిది. ఎందుకంటే... ఎందుకంటే... ఎందుకో నాకూ తెలియదు' అన్నాడు చెకోవ్. 'నాకు తెలీదు' అన్నంత మాత్రం చేత చెకోవ్‌కు నిజంగానే తెలియదనుకోవటం మన అమాయకత్వం మాత్రమే.

– వల్లంపాటి వెంకటసుబ్బయ్య

# వైజాగ్ ఫెస్ట్‌లో సాహితీ సంరంభం




- వొరప్రసాద్

సుసంపన్నమైన సాహితీ, సాంస్కృతిక చరిత్రకు నెలవైన ఉత్తరాంధ్ర ప్రాంతంలోని విశాఖ నగరంలో వైజాగ్ ఫెస్ట్ 2017 ఒక పెద్ద ఉత్సవంలా జరిగింది. కళలు, సంస్కృతి, సాహిత్యం, సైన్స్, షార్ట్‌ఫిలిమ్స్, ప్రభుత్వ రంగ సంస్థల పెవిలియన్, కమర్షియల్ ఎగ్జిబిషన్స్, ఆహార పదార్థాల స్టాల్స్‌తో డిసెంబర్ 1 నుండి 10 వరకు విశాఖ నగరంలోని ఆంధ్ర విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాల మైదానం జనసందోహంతో నిండిపోయింది. విశాఖ నగర ప్రజలు వైజాగ్ ఫెస్ట్ 2017ను మనసారా ఆహ్వానించి ఆస్వాదించారు. రోజూ వేలాదిగా సందర్శకులు ఈ ఉత్సవానికి హాజరయి కళ, సాహిత్య సాంస్కృతిక, పుస్తక ప్రదర్శనలను ఆసక్తిగా తిలకించారు.

**ప్రసిద్ధ రచయిత సి.వి. పేరుతో పుస్తక ప్రాంగణం.**

వైజాగ్ ఫెస్ట్ 2017 ఉత్సవంలో పుస్తక ప్రదర్శన పుస్తక ప్రియులకు ఓ ప్రధాన ఆకర్షణ. నిర్వాహకులు ప్రసిద్ధ రచయిత సి.వి. పేరు ఈ ప్రాంగణానికి పెట్టారు. ఈ పుస్తక ప్రదర్శనలో 100కు పైగాతెలుగు, ఇంగ్లీషు ప్రచురణ సంస్థలు తమ స్టాల్స్‌ను ఏర్పాటుచేశాయి. గత వైజాగ్‌ఫెస్ట్ 2015లో లాగానే ఈసారి కూడా విశాఖ నగర ప్రజలు ఈ ప్రదర్శనలకు హాజరై పుస్తకాలు కొనుగోలు చేశారు. తెలుగు ప్రచురణ సంస్థలైన విశాలాంధ్ర, ప్రజాశక్తి, ఎమెస్కో వంటి ప్రముఖ సంస్థల పుస్తకాలతో పాటు కొందరు రచయితలు వాట్స్‌అప్ గ్రూప్‌ల పరిచయం ద్వారా కలిసి ఒక స్టాల్ తీసుకొని తమ పుస్తకాలను కూడా అందుబాటులో ఉంచడం విశేషం. ప్రజాశక్తి బుక్‌హౌస్ సామాజిక శాస్త్రాలకు చెందిన అరుదైన ఆంగ్ల పుస్తకాలను సేకరించి తమ స్టాల్స్‌లో ప్రత్యేకంగా అందుబాటులో ఉంచడం పలువురిని ఆకట్టుకుంది.

టి.వి. మీడియా, సోషల్ మీడియా, మరీ ముఖ్యంగా మొబైల్ ఫోన్స్‌లో ఇంటర్నెట్ సౌకర్యం అందుబాటులోకి వచ్చిన తర్వాత పుస్తకాలు చదవడం మీద తీవ్రమైన ప్రభావం పడింది. వేల, లక్షల జీతాల ఉద్యోగాలిచ్చే చదువులకే ప్రాధాన్యత ఏర్పడిన కాలంలో సామాజిక అవగాహనను పెంచే పుస్తక పఠనం ప్రశ్నార్థకం అయ్యింది. గత వైభవాలతో పోల్చలేకున్నా ఇప్పటికీ తగినంతగా పుస్తక ప్రదర్శనలు తెలుగునాట నిర్వహించగలగడాన్ని అభినందించుకోవాలి. తెలుగునాట అభ్యుదయ, ప్రగతిశీల సాహిత్య, ఉద్యమాల వారసత్వం కూడా ఇందుకు దోహదం చేస్తుండటాన్ని గమనించవచ్చు. మంచి పుస్తకాలను ప్రచురించడం ఒక ఎత్తైతే వాటిని అమ్ముకోవడం ఇటీవల కాలంలో ఒక పెద్ద ప్రయాసగా మారింది. ప్రభుత్వాలు కూడా పుస్తకాలను కొనుగోలు చేయడం లేదు. ప్రచురణ కర్తలను, రచయితలను ప్రోత్సహించడంపై దృష్టి పెట్టడం లేదు. దానితో ప్రచురణ రంగం తీవ్రమైన ఒత్తిడిని ఎదుర్కొంటుంది. తెలుగు భాష వికాసంలో ప్రధాన పాత్ర ప్రచురణ రంగానిదే. ప్రభుత్వం ఈ రంగాన్ని పట్టించుకోవాల్సిన అవసరం చాలావుంది.

వైజాగ్ ఫెస్ట్ 2017 లో జరిగే పుస్తక ప్రదర్శన స్టాల్ నిర్వాహకులకు గొప్ప అవకాశం కల్పించింది. ఒక పెద్ద జనసందోహం వైజాగ్ ఫెస్ట్‌లో జరిగే సాంస్కృతిక ప్రదర్శనలను తిలకించడానికి రావడం విశేషం. కళా, సాంస్కృతిక

ప్రదర్శనలు, కమర్షియల్ స్టాల్స్ వంటి వాటితో పాటు పుస్తక ప్రదర్శనను ఏర్పాటుచేయడం మంచి ఫలితమే ఇచ్చింది.

### గురజాడ సాహిత్య వేదిక

వైజాగ్ ఫెస్ట్ 2017లో సాహిత్య అభిమానులకు పుస్తక ప్రదర్శన ఒక ఆకర్షణ అయితే గురజాడ సాహిత్య వేదిక మరో ఆకర్షణ. డిసెంబర్ 1 నుండి 10 వరకు జరిగిన సాహిత్య కార్యక్రమాలు సాహిత్య ప్రియులను విశేషంగా ఆకర్షించాయి. ఆ పదిరోజులూ ప్రధాన అంశంపై ప్రసంగాలు, అనంతరం జనకవనంలో కవితా కెరటాలు పేరుతో రోజూ 20 మందికి పైగా కవులు స్వీయ కవితలు వినిపించడం ఒక సాహిత్య కోలాహలంలా జరిగింది. ఉత్తరాంధ్ర ప్రాంతంలోని ప్రతీ కవీ, రచయితా ఈ గురజాడ సాహిత్య వేదికపై నుండి తమ గళాలను వినిపించారంటే అతిశయోక్తి కాదు. తొలిరోజు ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు రాచపాళెం చంద్రశేఖర రెడ్డి 'సమాజం – సాహిత్యం' అంశంపై ప్రసంగించారు. ప్రాచీన కాలం నుండి నేటి ఆధునిక కాలం వరకూ సాహిత్యం సమాజాన్ని ఏ విధంగా ప్రతిబింబిస్తున్నదీ, ప్రభావితం చేస్తున్నదీ వివరిస్తూ ఆయన చేసిన ప్రసంగం సభికులను గాఢంగా ఆకట్టుకుంది. సుద్దాల అశోక్‌తేజ ఈ వేదికపై నుండి పాటల రచయితగా తన ప్రస్థానంలో సామాజిక స్ఫూర్తిని చాటుతున్నానని భావోద్వేగంతో ప్రసంగించారు. రెండవ రోజు 'మీడియా – టి.వి. – సినిమా' అంశంపై నల్లి ధర్మారావు, ఉప్పల అప్పలరాజు, అరసవిల్లి కృష్ణ ప్రసంగించారు. మూడవ రోజు 'ప్రపంచీకరణ – సంస్కృతి' అంశంపై మేడిపల్లి రవికుమార్, చందు సుబ్బారావు, సి. ఉమామహేశ్వరరావు, వెలుగు రామినాయుడ్ని ప్రసంగించారు. నాల్గవ రోజు 'సామాజిక అసమానతలు – సాహిత్యం' అంశంపై మల్లిపురం జగదీష్, మాటూరు శ్రీనివాస్, బండి సత్యనారాయణ, డి.వి.జి. శంకరరావులు ప్రసంగించారు. ఐదవ రోజు 'ఉత్తరాంధ్ర సాహిత్య వికాసం' అంశంపై అట్టాడ అప్పల్నాయుడు, వంగపండు ప్రసాదరావు, బి.వి.ఎ. రామారావు నాయుడు ప్రసంగించారు. ఆరవ రోజు 'సాహిత్యం – స్త్రీలు' అంశంపై చాగంటి తులసి, అయ్యగారి సీతారత్నం, జగద్ధాత్రి ప్రసంగించారు. ఏడవ రోజు 'తెలుగు భాష వికాసం' అంశంపై గోరేటి వెంకన్న, గంటేడ గౌరునాయుడు, వెలమల సిమ్మన్న ప్రసంగించారు. ఎనిమిదవ రోజు 'వర్తమాన సాహిత్యం' అంశంపై మాటూరి శ్రీనివాస్, ఎల్.బి. శ్రీరామ్ ప్రసంగించారు. తొమ్మిదోరోజు 'భావ ప్రకటనా స్వేచ్ఛ' అంశంపై తెలకపల్లి రవి ప్రసంగించారు. ప్రతిరోజూ ప్రసంగాలు జరిగిన అనంతరం జరిగిన జనకవనంలో ఉత్తరాంధ్ర జిల్లాలకు చెందిన సుమారు 250 మంది కవులు తమ కవితలను వినిపించడం విశేషం.

### సీరియస్‌గా సాగిన సాహిత్య సమాలోచన

ఈ పదిరోజుల సాహిత్య సమాలోచన రచయితల్లో ఉత్తేజం కలిగించింది. తెలుగునాట ప్రసిద్ధులైన సాహిత్యవేత్తలు, ఔత్సాహిక రచయితలు మేలు కలయికగా జరిగిన ఈ కార్యక్రమం ఒక మంచి సాహిత్య వాతావరణాన్ని సృష్టించింది. ప్రతీరోజు ఆయా అంశాలపై సాగిన ప్రసంగాలు తెలుగు సాహిత్యం పట్ల సభికుల్లో అవగాహనను పెంపొందించాయి. ప్రాచీన సాహిత్యం మొదలుకొని వర్తమాన సాహిత్య ధోరణుల వరకూ వక్తలు అనేక అంశాలను తమ ప్రసంగాల్లో ప్రస్తావించారు. జనకవనంలో కవులు వర్తమాన సామాజిక అంశాలతో పాటు పర్యావరణం, తెలుగుభాష వంటి అంశాలను తమ కవితల్లో వినిపించారు.

ఈ సభలకు సాహితీస్రవంతి బాధ్యులు వొరప్రసాద్, చీకటి దివాకర్, గనారా, ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు, చంద్రికారాణి, సత్యాజీ, పి.ఎస్. శ్రీనివాస్, పాయల మురళీకృష్ణ, కృష్ణారావు, వైష్ణవిశ్రీ, ప్రధాన ఆదినారాయణ, డి.ఆర్.కె. నాయుడు అధ్యక్షులుగా వ్యవహరించారు. ఈ సభలలో పాల్గొన్న వక్తలకు, కవులకు సర్టిఫికెట్‌తో పాటు, మెమెంటోను అందించారు.

### కథల, కవితల పోటీ విజేతలు

వైజాగ్‌ఫెస్ట్ 2017 ను పురస్కరించుకుని నిర్వహించిన కథల పోటీలో ప్రథమ బహుమతి మల్లిపురం జగదీష్ 'గతవర్తమానం' కథకు, రెండవ బహుమతి ఇందూరమణ 'ఉసురు' కథకు, మూడవ బహుమతి ఎల్. శాంతి 'లిప్‌స్టిక్' కథకు లభించాయి. కవితల పోటీలో మొదటి బహుమతి సిరికి స్వామినాయుడు 'జనంలోంచి...' కవితకు, రెండవ బహుమతి డా॥ కె. సుదేరా 'వనమాలి' కవితకు, మూడో బహుమతి రాపాక సన్నివిజయ్ క్రిష్ణ 'నేను గౌరీ లంకేశ్‌ను...' కవితకు లభించాయి. కవితల పోటీలో ద్వితీయ బహుమతిని అవసరాల సంపత్, తృతీయ బహుమతిని సిహెచ్. ఎల్.ఎన్. శాస్త్రి స్పాన్సర్ చేశారు. విద్యార్థుల కోసం నిర్వహించిన కథ, కవితల పోటీకి తగినంత స్పందన రాలేదు. విద్యార్థినీ, విద్యార్థుల నుండి వచ్చిన కథలు, కవితల్లో నుండి ప్రోత్సాహక బహుమతికి ముగ్గురు కవులను, ముగ్గురు కథారచయితలను న్యాయనిర్ణేతల కమిటీ ఎంపికచేసింది. విజేతలకు చివరి రోజు డిసెంబర్ 10న బహుమతులను గురజాడ సాహిత్యవేదికపై అందజేయడం జరిగింది. ◆

## చరాస్తులు

- డా॥ విజయలక్ష్మి పండిట్



అమ్మ చేయి పట్టి నడుస్తున్న
కొడుకునుచూసి మురిసిపోతున్నాడు తండ్రి.
చదివి డాక్టరో ఇంజనీరో కాబోయే
ఆ కొడుకు నడిచేదారంతా పరుచుకుంటున్న
కట్న కానుకలు, భూమి, డబ్బు మెరిసాయి..!!
కొడుకు వారికి చరాస్తి.

భార్య చిటికెన వేలు పట్టి నడుస్తున్న
పెండ్లికొడుకు ఊహాలోకంలో విహరిస్తున్నాడు.
ఆ రోజు నుండి భార్య అతని చరాస్తి.
ఆమెకు తాను సంరక్షకుడన్న అతిశయం.
అహంకారం మెరిసింది ముఖంలో..!?

వెనుక నడుస్తున్న అత్త మామ ఆడపడుచులు
వారివారి ఊహాలోకాలలో కోడలు..
అత్త మామకు సేవలు ఇంటి చాకిరి చేసే
జీతం బత్తెమ్ లేని కట్టుబానిస..
కోడలు ఇంటిల్లిపాదికి చరాస్తి ..!?

మనుష్యులను చరాస్తులుగా మలిచిన
ఆ ఘనకార్యం ఎవరిది ?..
ఏ నాగరికత ఏ సాంప్రదాయానిది..!?
సాక్షులమై మిగిలాము మనం. ♦

---

## మనసు ప్రతిబింబం?

- రాణి
9492929093



సూక్ష్మదర్శిని దర్శించలేనపుడు
ఏ రవి గాని కవి గాంచును...
మండే గుండెను
రగిలే శ్వాసను
హృదయాంతరాలలో
నిద్రిస్తున్న నిప్పును
క్షణమొక యుగము చేసి
రాజేస్తూ
వక్రీకరణల వలయ చట్రంలో
ఇమడక
ఇమడలేక
విలవిల్లాడుతున్న
మనోభావాల నరకయాతన..

వేనవేల వత్సరాల బడబాగ్ని
ఘనీభవించిన హిమశిఖరం..
కనబడలేదా హృదయాంతరం?
లలిత సౌకుమార్య దృశ్యమా..

మోముపై చిరునగవేనా
మనసు ప్రతిబింబం? ♦

---

## డిసెంబర్ నెల పురస్కారాలు

**గల్ఫ్‌బండి**
కథకు: రూ.700/-
రచయిత : డా॥ తవ్వా వెంకటయ్య

**మరికొన్ని..నిజాలు**
కవితకు : రూ .500/-
రచయిత : సునీత గంగవరపు

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారాల చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు.
సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని
ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. - ఎడిటర్

## రేపటి వసంతం కోసం

ఎస్.ఆర్. పృథ్వి

వెల :100/- పేజీలు: 118

ప్రతులకు : 9989223245




పృథ్వి కవిత్వంలో వస్తు వైవిధ్యం విస్తారంగా కనిపిస్తుంది. ఏ కుర్ర కవికి తీసిపోకుండా సమకాలీన అంశాలపై స్పందించడం ఆయన కవితా స్వభావం. పృథ్వి కవిత్వంలో కార్మికులు, కర్షకులు అక్షర రూపాలు దాల్చి మనముందు నిలబడతారు.

- ఎండ్లూరి సుధాకర్

## వొరుపొప్పోటు

దీర్ఘకవిత (కరువు కుమ్ముడు)

యాములపల్లి నరసిరెడ్డి

వెల : 50/- పేజీలు: 68

ప్రతులకు : 9603759059




బాధ్యత తెల్సిన కవి. తను పుట్టి పెరిగిన నేల మీద నిలబడి మట్టిని పిడికిళ్ళ నిండా నింపుకొని గర్వంగా తలెత్తి మొవ్వతెగులు సోకి, కుళ్లిన ఈ పాలక వ్యవస్థపై సవాళ్లు విసురుతున్న కవి నర్సిరెడ్డి.

- డా॥ రాధేయ

## మల్లెచెట్టు చౌరస్తా

కవిత్వం

మమత వేణు

వెల : లేదు పేజీలు: 100

ప్రతులకు : 9866973959




మమత వేణులో చక్కటి భాషా సంపద వుంది. కవిత్వానికి రూపసారాలు ఎంత అవసరమో శబ్దార్థాలు సైతం అంతే అవసరం. శబ్దార్థాలు రెండూ భాషకు సంబంధించినవి, ముఖ్యంగా శబ్దం భాషా సంబంధితం. ఈ పదసంపద వేణులో వేళ్లూనుకుని వుండటం మంచి లక్షణం.

- డా॥ నలిమెల భాస్కర్

## రావి కిరణాలు

రావి రంగారావు

వెల : 50/- పేజీలు: 32

ప్రతులకు : 9247581825




పాదానికి మూడు పదాలు మించకుండా నాలుగు పాదాలతో ఎలాంటి అక్షరాల నియమం లేకుండా ఒక కొత్త లఘు కవితా రూపం ఇది. ఈ లఘు కవితా రూపం పేరు "కిరణం". అక్షరాల మీద దృష్టి లేకుండా కవిత్వ శక్తి మీద ఎక్కువ దృష్టి పెట్టి "కిరణాలు" రాస్తే మంచి కవిత్వం రావచ్చు అనేది నా ఆశ.

- రావి రంగారావు

## సంతకం

కవితా సంపుటి

ప్రతాప్ కౌటిళ్యా

వెల : 100/- పేజీలు: 148

ప్రతులకు: 9502850832




విజ్ఞానశాస్త్ర విద్యార్థి, అధ్యాపకుడు, శాస్త్రవేత్త కావాలన్న తపనతో జీవిత అధ్యయనంలో ఆరి తేరిపోయి, బాల్యంలోనే అంకురాలై నిలిచిన శాస్త్ర సాంకేతిక భావాలతో కవిగా అవతరించిన ప్రతాప్ కౌటిల్య తన కవితల్లో ఎన్నో శాస్త్ర విజ్ఞాన పదాలను వాడి, వేడి భావజాలాన్ని జ్వలలుగా విస్తరించిండు. తన కవితా సంకలనం 'సంతకంలో'తో.

- డా॥ అగ్రహారం ఛందోజిరావు

## మన్నే మాతరం

కవిత్వం

యాములపల్లి నరసిరెడ్డి

వెల : 100/- పేజీలు: 152

ప్రతులకు : 9603759059




నరసిరెడ్డి కవిత్వపు నడక ఆవేశపూరితంగా ఆకర్షణీయంగా ఆలోచనలు పెంచేవిధంగా వుంది. కవితల్లోని ప్రతి వాక్యంలోనూ అంతర లయను పాటించడానికి ప్రయత్నించారు కవి. ఆధునిక సమాజంలో తలెత్తుతున్న గందరగోళాలను పట్టుకోగలిగారు.

- కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి




## జళ్‌గీద్

**ఎం. కృష్ణ నాయక్ చవాణ్**

**వెల : 175/- పేజీలు: 216**

**ప్రతులకు : 9949133221**

ఈ రచన అటు సుసంపన్న సాహిత్య సంపద కలిగిన తెలుగు సాహిత్యానికి, అతి తక్కువ సాహిత్యం కలిగివున్న బంజారా భాషకూ ఒక మంచి చేర్పు కాగలదని నేను భావిస్తున్నాను. 'జలగీతం' కావ్యంలో నీటి పుట్టుక, విస్తృతి, లభ్యత, ఉపయోగం, మానవ వినియోగం, నీటి కొరత, నీటి విశృంఖల వినియోగం సంరక్షణావశ్యకతలపై వైజ్ఞానిక మానవీయ తాత్విక అంశాలకు సంబంధించిన విస్తృత చర్చ జరిగింది.

**- డా. ఎం. ధనంజయ్ నాయక్**




## సేవా శతక్

**(బంజారా భాషలో సేవాలాల్ శతకము)**

**తెలుగులో టీకా తాత్పర్యము**

**మూడ్ కృష్ణనాయక్ చవాణ్**

**వెల : 50/- పేజీలు: 108**

**ప్రతులకు : 9949133221**

సంత్ శ్రీ సేవాలాల్ మహారాజ్ జీవిత గాథ మరియు వారి ఉపదేశాలు బంజారాలు పాడుకునే పాటలలో నిక్షిప్తమై ఉన్నవి. వాటి సారాన్ని తీసుకొని సామెతలు మరియు నానుడిలను జోడించి సేవా శతకము బంజారా భాషలో వ్రాయడము జరిగినది. బంజారా భాషకు లిపి లేనందువల్ల తెలుగు లిపిని ఉపయోగించాను. ఈ శతకమును ఒక ప్రత్యేక ఛందస్సులో వ్రాశాను.

**- మూడ్ కృష్ణనాయక్ చవాణ్**




## ఐదు గంటల వాన

**యక్కలూరి శ్రీరాములు**

**వెల : 90/- పేజీలు: 76**

**ప్రతులకు : 9866171648**

ఈ పుస్తకమంతా బండలైన బతుకుల గురించి గుండె పగిలి, పొగిలి పొగిలి కన్నీరు గడ్డకట్టిన కవితా వడగళ్ళే. అసమానతలపై ఆక్రోశం పొంగి ఎత్తిన అక్షరాల పిడికిళ్ళే.

**- లక్కరాజు దేవి**




## గంపకూడు కవిత్వం

**చిన్ని నారాయణరావు**

**వెల : 100/- పేజీలు: 115**

**ప్రతులకు : 9440202942**

ఒక భావాతీత శక్తితో, నిబద్ధతతో రాసిన గంపకూడు కవిత్వం వర్తమాన సమాజంపై బోర్లించిన నిప్పుల కుంపటిగా భావిస్తున్నాను. మహోన్నత చైతన్యంతో కవిత్వం రాసిన చిన్ని నారాయణరావు ఈ దేశ ఆర్థిక వ్యవస్థపై ఒక గొప్ప ఆర్థికవేత్తగా తనదైన శైలిలో వాతలు పెట్టాడు.

**- సాగర్ శ్రీరామకవచం**




**తిమ్మిరి బిళ్ళలు**

## యశస్వి నానీలు

**డా॥ రమణ యశస్వి**

**వెల : 80/- పేజీలు: 72**

**ప్రతులకు: 98480 78807**

శబ్దాన్ని మలిస్తే సంగీతం, కదలికల్ని మలిస్తే నృత్యం, జీవితాన్ని అందంగా మలిస్తే సంబరం, అక్షరాలని మలిస్తే మనసుకి హత్తుకునే కవిత్వం ఉద్భవిస్తాయి. 'నానీలు' అలా జనించినవే. ఇవి ఆస్వాదించండి. తిమ్మిరిబిళ్ళల హాయిని పొందండి.

**- డాక్టర్ రమణ యశస్వి**




## ప్రతిబింబాలు

**బడుగు వీరవెంకట్రావు**

**వెల : 60/- పేజీలు: 75**

**ప్రతులకు : 9440672229**

ఈ ప్రతిబింబాలలో అనేక వర్తమాన సామాజిక సమస్యలు, రుగ్మతలు, నున్నితంగానూ, లోతుగానూ స్పృశించడమే గాక వాటి పరిష్కార మార్గాలను కూడా సూచించడం జరిగింది. ఈ పుస్తకం ఒక దర్పణం లాంటిదైతే, అందులోని కవితాంశాలు అన్నీ ఆ అద్దంలో ప్రతిఫలించే ప్రతిబింబాల్లాంటివే.

**- వెంకటరావు**




విజయవాడలోని ఎం.బి. విజ్ఞానకేంద్రంలో డిసెంబర్ 14న జరిగిన 'తెలుగు సాంస్కృతిక పురోగమనంలో కమ్యూనిస్టుల పాత్ర' సదస్సులో ప్రసంగిస్తున్న కడియాల రామమోహన్ రాయ్. చిత్రంలో ఎం.వి.ఎస్. శర్మ, తెలకపల్లి రవి, పాపినేని శివశంకర్, పి. మురళీకృష్ణ



కాకినాడలోని రోటరీక్లబ్ సమావేశ మందిరంలో డిసెంబర్ 12న జరిగిన ఇస్మాయిల్ సాహిత్య పురస్కార ప్రదానోత్సవ సభలో పురస్కారం అందుకుంటున్న బొల్లోజు బాబా. చిత్రంలో దాట్ల దేవదానం రాజు, అకెళ్ళ రవిప్రకాష్, వాడ్రేవు వీరలక్ష్మి, శిఖామణి తదితరులు ఉన్నారు.



కర్నూలు సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో నేషనల్ తెలుగు పండిత శిక్షణా కళాశాలలో నవంబర్ 30న జరిగిన గురజాడ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న జంధ్యాల రఘుబాబు. చిత్రంలో హరిశ్చంద్రారెడ్డి, జహీర్ అహ్మద్.



కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో డిసెంబర్3న కాకినాడ రోటరీక్లబ్‌లో ఓల్గా 'యశోబుద్ధ' నవల ఆవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న ఓల్గా. చిత్రంలో గనారా, వాడ్రేవు వీరలక్ష్మి, డా।। శైలజ, కస్తూరి మురళీశంకర్, గవరసాన సుభద్ర, సత్యనారాయణ




అనంతపురం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో నవంబర్ 26న అనంతపురంలో ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించిన 13 వేమన పుస్తకాలపై జరిగిన సమీక్షా సదస్సులో ప్రసంగిస్తున్న పి. కుమారస్వామి. చిత్రంలో ప్రొ।। బాలసుబ్రహ్మణ్యం, నాగేశ్వరాచారి, నాగశేషు

## 'సోమేపల్లి' చిన్న కథల పోటీ ఫలితాలు

రమ్యభారతి మాసపత్రిక ఆధ్వర్యంలో నిర్వహించిన 'సోమేపల్లి' చిన్న కథల పోటీ ఫలితాలను చలపాక ప్రకాష్ ఒక ప్రకటనలో తెలిపారు. ప్రథమ బహుమతి 'నిమజ్జనం'- వదలి రాధాకృష్ణ' చీరాల, ద్వితీయ బహుమతి 'బిచ్చగాడు'- జి.ఎస్.కె. బాబా, అనకాపల్లి', తృతీయ బహుమతి 'వార్డెన్'- శింగరాజు శ్రీనివాసరాజు, ఒంగోలు, ప్రత్యేక పురస్కారాలు- 'సమీనా'- జి. అనసూయ, హైదరాబాద్, 'చీకటిదారిలో'- తాటికోల పద్మావతి, గుంటూరు, 'జననీ జన్మభూమి'- శివానీ, విశాఖపట్నం, 'దేవుడు వరమిచ్చినా'- కోపూరి పుష్పాదేవి, విజయవాడ, 'వారధి'- సి. యమునా, హైదరాబాద్. ప్రముఖ రచయిత్రి సి. భవానీదేవి ఈ పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. విజేతలకు త్వరలో జరగబోయే ఒక ప్రత్యేక కార్యక్రమంలో బహుమతులు అందజేయనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. ◆

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

విశాఖపట్నంలో ఆంధ్ర విశ్వవిద్యాలయ ఇంజనిరింగ్ కళాశాల మైదానంలో వైజాగ్ ఫెస్ట్ 2017 సి.వి. పుస్తక ప్రదర్శనను ప్రారంభిస్తున్న వైస్ ఛాన్సలర్






వైజాగ్ ఫెస్ట్ 2017 కథల పోటీలలో బహుమతి అందుకుంటున్న మల్లిపురం జగదీశ్, ఇందూ రమణ. కవితల పోటీ బహుమతి అందుకుంటున్న సిరికి స్వామినాయుడు, కె. సుదేరా, రాపాక సన్ని విజయ్ క్రిష్ణ




గురజాడ సాహిత్య వేదికపై జరిగిన జనకవనం దృశ్యాలు

ఉత్తరాంధ్ర జిల్లాల కళాశాల విద్యార్థినీ విద్యార్థులకు కథ, కవితల పోటీలో ప్రోత్సాహక బహుమతులు అందిస్తున్న దృశ్యం




మూర్తి, మామిడి కోదండరావు, చందు సుబ్బారావు, బాలకోటయ్య, ఎస్.ఆర్. పృథ్వీ పుస్తకాల ఆవిష్కరణ దృశ్యాలు



SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19

Date of Posting : 02.01.2018 . Date of Publication: 27.12.2017





If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO8A188 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayathri |
| పేజీలు విడదీసినది | Gayathri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |